శ్రీః

# వేదమన్త్ర రామాయణమ్

## బాలకాణ్డ

శ్రీ నీలకణ్ఠాచార్య సంకలితమ్

తెలుగు సేత: - "మైత్రేయ"



దాశరథి
౧౪-౮-౦౧



ప్రకాశకులు:

సాధన గ్రంథ మండలి, తెనాలి.



[ వెల రూ. 40-00

శ్రీః

శ్రీ నీలకణ్ఠాచార్య సంకలితమ్

# వేదమన్త్ర రామాయణమ్

బాలకాణ్డ

(తెలుగు సేత: మైత్రేయ)



నమోస్తు రామాయ సలక్ష్మణాయ దేవ్యై చ తస్యై జనకాత్మజాయై।
నమోస్తు రుద్రేంద్రయమానిలేభ్యో నమోస్తు చంద్రార్కమరుద్గణేభ్యః॥

ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి

 వెల రూ. 40-00.

వేదమన్త్ర రామాయణమ్-ఋగ్ వేదమ్

సంకలితమ్-శ్రీనీలకణ్ఠాచార్యులు

తెలుగు సేత-మైత్రేయ

ప్రథమ ముద్రణ-అగష్టు 15,2001-శ్రీ అరవిన్ద జయన్తి

ప్రతులు-1000

పేజీలు-210

వెల-రూ.40/-



DTP by
R. MOHAN RAO
4-103, I.L.T.D. Colony
Kothapeta, Chirala - 523 157
Ph: 34054

Printed at
KAMAL ART PRINTERS
TENALI,
Ph: 24472.

# మండలిమాట

ప్రఖ్యాత భాష్యకారులు శ్రీ నీలకంఠాచార్యులవారు ఋగ్వేదము నుండి సంకలనము చేసిన 157 మంత్రాలకు సంస్కృత వ్యాఖ్య వ్రాయడం ద్వారా **'మంత్రార్థ రామాయణము'** వెలుగుచూచింది. దీనిని ఆధారంగా చేసికొని, తనదైన శైలిలో తెలుగున విస్తృతమైన వ్యాఖ్యతో **వేదమంత్రరామాయణము**గా రూపుదిద్దుకొన్న ఈ గ్రంథమును అందించిన స్వామి మైత్రేయ, భాసరక్షేత్ర శ్రీ సరస్వతీదేవి అనుగ్రహము పొందినవారు.

ఈ వేదమంత్రరామాయణం మొదటి భాగంగా బాల కాండ వెలువడుచున్నది. రెండవ భాగంగా మిగిలిన కాండలు త్వరలో వెలుగు చూడగలవని ఆశిస్తున్నాను.

ఈ వేదమంత్ర రామాయణ బాలకాండలో ఋగ్వేదము నుండి సమీకరించిన 40 ఋక్కుల వ్యాఖ్యానం ఉన్నది. ఈ వ్యాఖ్యాన గ్రంథము భద్రాచల శ్రీరామచంద్రప్రభు పాదపద్మము లకు భక్తితో సమర్పితము.

ఈ ఋగ్వేదమంత్రాలు రామాయణ పరంగా వ్యాఖ్యానంతో మా మండలి తరపున వెలువరించుచున్నందుకు కడు సంతసించు చున్నాను.

ఇట్లు

**బులుసు సూర్యప్రకాశ శాస్త్రి**

వ్యవస్థాపకులు, సాధన గ్రంథ మండలి, తెనాలి.



రా కలుషంబులెల్ల బయలుంబడ ద్రోచిన మా కవాటమై
దీకొని ప్రోచు నిక్కమని ధీయుతులెన్న దదీయవర్ణముల్
గైకొని భక్తిచే నుడువగానరుగాక! విపత్పరంపరల్
దాకొనునే జగజ్జనుల? దాశరథీ కరుణాపయోనిధీ.

5

తెలుగు సేత: మైత్రేయ

శ్రీః

శ్రీ నీలకంఠాచార్య సంకలితమ్

# వేదమన్త్ర రామాయణమ్

## బాలకాణ్డ

## (తెలుగు సేత: మైత్రేయ)

'శ్రీరామనవమి' దగ్గరకు వచ్చిందంటే చాలు రామాయణ పాత్రలైన దశరథ, జనక, సీత, లక్ష్మణాది పాత్రల ఉల్లేఖనం వేదాలలో ఉంది అంటూ ఎందరో విద్వాంసులు అనేక పత్రికలలో వ్యాసాలు వ్రాస్తూ వుంటారు.

కానీ ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే అనేక శతాబ్దాల పూర్వమే ప్రఖ్యాత భాష్యకారులు శ్రీ నీలకంఠాచార్యులవారు, 157 ఋగ్వేద మంత్రాలను సమీకరించి వాటికి ఒక సంస్కృత వ్యాఖ్య వ్రాయడం ద్వారా మంత్రరామాయణం నిర్మాణంలో కృతార్థులైనారు. ఈ మంత్రాల ద్వారా కొన్ని రామాయణ పాత్రల ఉల్లేఖన పరిచయాదులే కాక కొన్ని ఘట్టాల సాక్షాత్కారమో మాత్రమే గాక సంపూర్ణ రామకథ ప్రత్యక్షమౌతుంది.

అయితే వేద మంత్రాలలో ఉపయోగించిన పదజాలానికి అనేక రకాలుగా విస్తృతమైన అర్థ వివరణ ఇవ్వవచ్చు కనుక రామాయణ పరంగా తాను ఇచ్చిన అర్థం సరైనదే అని నిరూపించడానికి శ్రీ నీలకంఠాచార్యుల వారు తమ భాష్యంలో ఎంతో కృషి చేశారు. శ్రీ నీలంకఠాచార్యులు ఎన్నుకొన్న ఆ 157 మంత్రాలకు సరళ తెలుగు అనువాదంతో వాటిపై వ్యాఖ్య వ్రాయడానికి ప్రయత్నిస్తాను.

**1. మంత్రం**

*కం నశ్చిత్ర మిషణ్యసి చికిత్వాన్ పృథుగ్మానం వాశ్రం వా వృధధ్యై।*
*కత్తస్య దాతు శవసో వ్యుష్టౌ తక్షద్వజ్రం వృత్రతుర మపిన్వత్॥*

(ఋగ్-10-99-1)

గురుదేవా! మీరు మమ్మ ఏరమణీయ, శౌర్య వీర్య గుణాలు కల్గిన పురుషుణ్ణి స్తుతించమని ప్రేరేపిస్తున్నారు? వారిని స్తుతించడం వల్ల మా కెటువంటి ఫలితం లభిస్తుంది? అని ప్రశ్నించగా "ఆ వీర్యవంతుని స్తుతించడం వల్ల మీరు వివేకమనే వజ్రాయుధాన్ని తక్షణం చేసి, అజ్ఞానాన్ని (వృత్రాసురుణ్ణి) నాశనం చేయగలరు", అని గురువర్యులు సమాధాన మిస్తున్నారు.

దేవుడు లేడు, ఉన్నదంతా దైవత్వమే. దేవుడంటూ ఒక వ్యక్తి ఉంటే అతడు ఎక్కడో ఒకచోట ఉండాలి కదా! ఒక చోట ఉంటే ఇంకో ప్రదేశంలో. లేనట్లే కదా. ఈ విధంగా దేశబద్ధుడైన వ్యక్తి సర్వవ్యాపి ఎలా అవుతాడు? వ్యాపకత్వం లేనివాడు దేవుడెలా అవుతాడు? కాబట్టి దైవత్వమే కాని వేరుగా దేవుడు లేడు.

మరి సర్వం వ్యాపించి ఉన్నా, రూపం లేక కనపడని పరమాత్మను పొందడం ఎలా? అనేది ప్రశ్న. కరెంటు తీగలో అంతటా వ్యాపించి ఉన్నా అక్కడక్కడా కాంతి రూపంలో కొన్ని బల్బులు గుండా ప్రకటమౌతోంది. అయితే కరెంటు ఓల్టేజి అంతటా సమానంగా ఉన్నా బల్బు యొక్క వాట్స్ బట్టే కాంతి ప్రకటమౌతుంది. అలాగే అందరిలోనూ వ్యాపించి ఉన్న ఆ పరమతత్వం కొందరిలో మాత్రం స్పష్టంగా పదహారు కళలతో ప్రకటమౌ తుంది. ఆ కోవకు చెందినవారే రాముడు, కృష్ణుడు, రామకృష్ణ పరమహంస మొదలైన వారు. వీరు వందక్యాండిల్స్ బల్బుల వంటివారు. పరమతత్వం అనే కరెంటు వారిలోనూ, మనలోనూ సమానంగా ఉన్నా, మన సాధన, ఉపాధిగతభేదాన్ని బట్టి మనం జీరోక్యాండిల్ బల్బులలాగా వెలుగు తున్నాము.

ప్రతి జీవిలోనూ ఆ పరతత్వం అవతరిస్తూనే వుంది. కానీ కొందరు మాత్రమే పూర్ణావతారులైనారు. ఇది ఎలాగంటే ఒక ఇంట్లో దేదీప్యమానంగా ట్యూబ్ లైట్లు వెలుగుతున్నా, కిటికీలు తలుపులు అన్నీమూసి ఉంటే ఒక్క కాంతి కిరణం గూడా బైటికి ప్రకటం కానట్లు మనం ఉంటే, పూర్ణావతారులు

గా పేర్కొనబడ్డవారంతా కిటికీలు, తలుపులు తెరవడమేగాక అసలు భవనాన్నే కాల్చివేసి, వ్యక్తిత్వాన్నే వదిలి పెట్టి సమష్టి ప్రకృతిలో ఒకట్టై జీవించారు. అందుకే వారి జీవితాలు దేదీప్యమానమై కండ్లు మిరిమిట్లు గొల్పాయి.

అందుకే శ్రీరామకృష్ణ పరమహంసను, నరేన్ "మీరు దేవుణ్ణి చూశారా?" అని అడిగినప్పుడు అవును "నిన్ను చూస్తున్నంత స్పష్టంగా, దేవుణ్ణి కూడా చూస్తున్నాను" అన్నారాయన. అంటే ఎక్కడో ఉన్న పరమాత్మను శ్రీరామకృష్ణ పరమహంస చూడటం కాదు. బీజప్రాయంగా నరేన్‌కే తెలియకుండా ఆయనలో దాగున్న ఆ పరమతత్త్వాన్ని చూస్తున్నానని అర్థం. కిటికీ ముందు కూర్చున్న వ్యక్తికి బజారులో వ్యక్తి కిటికీ ముందుకు వస్తేగానీ కనిపించడు.కాని ఆ మేడపైన ఎక్కి ఉన్నవ్యక్తికి ఎదురుగా ఉన్న వీధి ఆ మూలనుండి ఈ మూలవరకు కండ్ల ముందు నిలిచి అందులోకి ఎవరు వచ్చినా స్పష్టంగా కనిపిస్తుంది. అలాగే కాలానికి అతీతుడైన మహాత్ముడికి కేవలం వర్తమానమేకాక భూత భవిష్యత్ కాలాలు కూడా కనిపిస్తాయి. అందుకే శ్రీ రామకృష్ణ పరమహంసకు నరేన్‌లో భవిష్యత్‌లో మహావృక్షం కాబోతున్న వర్తమాన బీజరూప పరమాత్మ కనిపించాడు.

మరి ప్రస్తుతం బీజరూపంలో ఉన్న ఆ పరతత్వం ఎలా వికసిస్తుంది? అంటే, ఆ అవతార పురుషులను శరణు పొందటం ద్వారా. వారిపై మనకు శరణాగతభావం ఎలా కలుగుతుంది? అంటే వారిని స్తుతించడం ద్వారా, వారిని స్మరించడం ద్వారా. మనం పరమాత్మ ఎలా గుంటాడో ఎరుగము, అసలు ఉన్నాడో లేడో కూడా మనకు తెలియుదు. ఇది ఎలాగంటే కరెంటు అనేది ఉందో లేదో తెలియదు. ఎందుకంటే దాన్ని ఇంతవరకు చూచినవాడు లేడు. కాకపోతే అది కరెంటు బల్బులో కాంతిగా, ఫ్యానులో గాలిగా, హీటర్‌లో వేడిగా, కూలర్‌లో చల్లదనంలాగా ప్రకటమౌతున్నది. అలాగే ఆ పరమతత్వం సాధనరూపంలో శ్రీరామకృష్ణ పరమహంసలోనూ, ధర్మరూపంలో శ్రీరాముడిలోనూ, లీలారూపంలో కృష్ణుడిలోనూ ప్రకట

మైంది. కనుక ఆ పరతత్త్వాన్ని చేరాలంటే, ప్రకటమైన దాని విభూతిని స్మరించటం స్తుతించటం ఒక్కటే మార్గం. దాన్నే ఇక్కడ ఈ పై మంత్రంలో శ్రీరామస్తుతిగా పేర్కొన్నారు.

మనకు కావలసింది ఎక్కడ ఉందో తెలుసుకొని వారి వద్దకు వెళ్లి అడగడం వల్లే మనకు అది లభిస్తుంది. బిచ్చగాడి వద్దకు వెళ్ళి డబ్బు అడగం కదా! అలాగే ఇక్కడ రామస్మరణ వల్ల ఫలితం ఏమిటని శిష్యుడు ప్రశ్నస్తే, గురువుగారు "అజ్ఞాన నాశనం" అని జవాబిచ్చాడు. మంత్ర శాస్త్రంలో 'ర' అగ్నిబీజం. దాని స్మరణ వల్ల సర్వపాపాలు (సంస్కారాలు) నశిస్తాయని ఏకాక్షర నిఘంటువు తెలియజేస్తోంది. రామశబ్దానికి అందరిలో రమించే వాడని ఒక అర్థం ఉంటే, అందరిని రమింపజేసేవాడని మరొక అర్థం ఉంది. ఆనంద స్వరూపుడే కదా- ఇతరులకు ఆనందం పంచగలిగేది. "శుచా అభి దుద్రువే ఇతి శూద్రః" తాను దుఃఖపడుతూ ఇతరులను దుఃఖంలో ముంచేవాణ్ణి శూద్రుడన్నారు. అలాగే రావణశబ్దానికి రుదనం చేసేవాడని ఒక అర్థముంటే, ఇతరులను రోదించేలా చేసేవాడని మరొక అర్థం ఉంది. కాబట్టి రామస్మరణ వల్ల అజ్ఞాన నాశనమవుతుంది. అజ్ఞానమే దుఃఖానికి కారణం.

knowledge is the best antidote to fear.

భయానికి విరుగుడు జ్ఞానమొక్కటే అన్నాడు 'ఎమర్సన్'." జ్ఞానతృష్ణ కలిగిన యువతీ యువకులు వక్రమార్గాన పడరు" అన్నాడు శ్రీ వివేకానంద స్వామి. కనుక రామస్మరణ వల్ల అజ్ఞాన నాశనం, దానివల్ల దుఃఖనాశనం -ఫలితం ఆనందప్రాప్తి.

ఉలటా నామ జపత జగ జానా ।
వాల్మీకి భయేబ్రహ్మ సమానా ॥

'మరా' 'మరా' అని తలక్రిందులుగా స్మరించడం వల్ల కూడా వాల్మీకి మహర్షి బ్రహ్మ సమానుడైనాడు.

వాల్మీకి రామాయణం కూడా మహర్షి వాల్మీకి జిజ్ఞాసతోనే ప్రారంభ

మవుతుంది. "కోన్వస్మిన్ సాంప్రతం లోకే" ప్రస్తుతం ఈ ప్రపంచంలో, ఈ సమయాన, గుణవంతుడు, వీర్యవంతుడు, ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు, సత్యవ్రతుడు అయిన పురుషుడెవరు? అని వాల్మీకి నారదుణ్ణి ప్రశ్నిస్తాడు.

అవతారిక :

రామస్తుతి, స్మరణ ఫలాన్ని చెప్పిన గురువుగారు ఇక రెండవ మంత్రంలో, ఎవరీ రాముడు? ఆయన గుణాలేమిటి? అనే విషయం వివరించబోతున్నాడు.

2. మంత్రం

**స హి ద్యుతా విద్యుతావేతి సామపృథుం యోనిమసురత్వా ససాద ।**
**స సనీలేభిః ప్రసహానో అస్య భ్రాతుర్న ఋతేసప్తథస్య మాయాః ॥**
(ఋగ్. 10-99-2)

తేజస్సు, శక్తియుక్తులు కలిగి, ద్రోహరహితుడైన రాముని యొక్క పత్ని, పృథ్వీ పుత్రియైన సీతను రాక్షసులు ఎత్తుకు పోయారు. లోకవాసులతో విచరిస్తూ రాముడు రావణమాయను సహిస్తూ, యుద్ధంలో అతడీ మాయను అతడితో సహా అంతం చేశాడు.

ఏకరామ అవధేస కుమారా ।
తిన్హకర చరిత విదితసంసారా ॥

అయోధ్యానగర రాజైన దశరథుడి కుమారుడి చరిత్ర లోకవిఖ్యాతమైంది..... ఆయనేనా ఈ పరమాత్మ అవతారం? అని యాజ్ఞవల్క్యుడు భరద్వాజుడిని ప్రశ్నిస్తాడు.

"ఇక్ష్వాకు వంశ ప్రభవో రామోనామ జనైః శ్రుతః"

ఇక్ష్వాకు వంశకీర్తిని ఇనుమడింపజేసిన రాముని పరిచయం అందరికీ ఉంది అంటాడు వాల్మీకితో నారదుడు. అంటే వేదకాలంకన్నా ముందు నుండే రామాయణం లోకకథగా ప్రసిద్ధిపొంది ఉన్నదన్నమాట.

మరి ఇంతా ఆయన లోకంలో ప్రసిద్ధమవడానికి కారణం ఏమి?

అంటే ఆయనలో మూడు గుణాలున్నాయని చెప్పారు. అవి తేజస్సు, శక్తి, యుక్తి. కానీ శక్తియుక్తులు గల్గిన హిట్లర్, అందము తేజస్సు కల్గిన అనేకమంది కూడా లోకంలో ప్రసిద్ధులే, అలాగే రాముడు కూడా ప్రసిద్ధుడా అంటే, కాదు వారికి కుకీర్తి, సుకీర్తి రెండున్నూ అశాశ్వతమే. కానీ ఒక్క రాముడి కీర్తే ఈ లోకంలో శాశ్వతమై నిలిచింది. అందులకు ఇతరుల మంచే తప్ప ద్రోహం చేయగూడదనే ఆయన చింతనే కారణం.

"న్యాయవిహితమైన తెలివితేటలు మోసంగా పరిగణించ బడతాయే గాని, విజ్ఞానంగా గుర్తింపుపొందవు" అంటారు ప్లేటో.

అంతేగాక ఆయనకు కీర్తి తెచ్చిన మరొక గుణం "సహనం". తనకు కల్గిన కష్టాన్ని, దుఃఖాన్ని ఆయన సహించాడు, చేతకానివాడై సహించలేదు.

"సహనం సర్వదుఃఖానాం అప్రతీకార పూర్వకం"

ప్రతీకార ఇచ్ఛ లేకుండా దుఃఖాన్ని సహించడం 'తితిక్ష' గా వేదాంతం చెబుతోంది.

అయితే వ్యక్తిగతమైన ద్వేషంతో గాక కేవలం ధర్మసంస్థాపన కొరకై చివరికి ఆయన రావణుణ్ణి సంహరించాడు.

"అన్యాయం అత్యాచారం చేసేవాడికన్నా, దాన్ని సహించేవాడే గొప్పదోషి" అంటారు శ్రీ బాలగంగాధర తిలక్.

పైగా కష్టసమయాల్లో ఉద్రేకపడకుండా సహనంతో ఆలోచించి మంచి సమయం వచ్చేవరకు ఎదరుచూసి, సరియైన బలాన్ని సమకూర్చు కొని అధర్మాన్ని ఎదిరించడమే యుక్తి- అదే రాముడిలో ఉంది.

రాముడు దేవుడు కనుక ఇదంతా ఆయనకు సాధ్యమైంది, మేమెలా చేయగలం అంటూ తప్పించుకుందామని చూస్తారు కొందరు.

"మాతా పృథ్వీ పుత్రోऽహం పృథివ్యాః"

భూమాత పుత్రుడిని నేను, నేను పృథివికి చెందినవాణ్ణి అని గుర్తించ మంటుంది వేదం. వల్మీకాల (పుట్టలు)లో నుండి పుట్టిన వాల్మీకి రచించిన

రామాయణం దేవసంబంధమైంది, స్వర్గ సంబంధమైంది ఎలా అవుతుంది? అది కేవలం భూసంబంధమైందే. రాముడు పుట్టింది ఈ భూమినుండి ఉత్పన్నమైన అన్నంతో చేసిన పాయసం నుండే. రావణ సంహారం కొరకు ఆయన ఏ స్వర్గవాసుల సహాయ మపేక్షించలేదు, భూవాసులైన వానరాలే ఆయనకు సాయపడ్డాయి. అందుకే పై మంత్రంలో "లోకవాసులతో విచరిస్తూ" అంటుంది వేదం, ఇక సీతామాతను గూర్చి "పృథ్వీ పుత్రియైన సీతను" అని మంత్రంలో ఉంది. వాల్మీకి నారదుణ్ణి ప్రశ్నిస్తూ "అస్మిన్‌లోకే" ఈ లోకంలో గుణవంతుడైన వ్యక్తి ఎవరు అని అడిగాడు. నారదుడు జవాబిస్తూ 'ఇక్ష్వాకు వంశ ప్రభవః' అంటాడు. అది ఈ లోకంలో, ఈ భూమిపైనే రాముడు జన్మించిన ఇక్ష్వాకువంశం రాజులు చేసిన కర్మయోగాన్ని సూచిస్తుంది.

"నేను మొదట ఈ కర్మయోగ రహస్యాన్ని సూర్యుడికి ఉపదేశించా. ఆయన నుండి మనువుకు, మనువు నుండి ఇక్ష్వాకుకు ఈ రహస్యాలు తెలిశాయి" అంటాడు భగవద్గీతలో కృష్ణపరమాత్మ.

"స్వస్తి పంథాన మనుచరేమ సూర్యాచంద్రమసావివ"

"రాత్రింబవళ్ళు సూర్యుడు ప్రకాశాన్ని, చంద్రుడు ఆహ్లాదాన్ని ఇస్తూ నిరంతరం కర్మయోగంలో రతులై ఉన్నారు". అంటుంది ఋగ్వేదం.

ఈ విధంగా మూలపురుషుడితో మొదలుకొని రాముడి వరకు ఇక్ష్వాకు వంశరాజులు అందరూ లోకకళ్యాణార్థం ధర్మసంస్థాపనలో రతులైన భూమి పుత్రులే. ఇటు సీత తండ్రి జనకుడు కూడా గొప్ప కర్మయోగిగా తరించిన వాడేనని భగవద్గీత చెబుతోంది.

కనుక రాముడు దేవుడిగా ధర్మాచరణ, ధర్మసంస్థాపన చేయలేదు. ఈ లోకంలో విచరిస్తూ అందరి మానవులలో తాను ఒక మానవుడై కష్టాల ను సహిస్తూ మనకు మార్గదర్శకుడైనాడు.

అవతారిక :

క్రోధంతోనో, ద్వేషంతోనో, లంకానగరం పై ఆశతోనో కనుక రాముడు

రావణ సంహారం చేసి ఉంటే, లంకను ఆక్రమించి ఉండాలి లేదా కొల్లగొట్టి ధనరాసులను, రావణుడి స్త్రీ జనంతో సహా (ప్రతీకార వాంఛతో) అయోధ్యకు తరలించి ఉండాలి. కానీ అలా జరగలేదని అందుకు కారణం రాముడి స్థితప్రజ్ఞ లక్షణమేనని తరువాతి మంత్రం తెలియజేస్తోంది.

3. మంత్రం

**స వాజం యతాపదుష్పదాయన్ త్స్వర్షాతా పరిషదత్సనిష్యన్ ।**
**అనర్వా యచ్ఛ తదురస్యవేదోఘ్నంఛిశ్న దేవాగ్ం అభివర్పసాభూత్ ।**

(ఋగ్. 10-99-3)

భూమి మీదా, నీటిలోనూ, అరణ్యాలలోనూ కంటక మయ స్థలాలలోనూ అశ్వరహితంగా పాదచారియై శ్రీరామభద్రుడు సంగ్రామానికి వెళ్లి రాక్షసులను సంహరించి, తన భార్య అపహరణానికి కారణమైన రావణుని దునుమాడి, అతడి తమ్ముడికి (విభీషణుడికి) పరిజనయుక్తంగా (సర్వ సంపదలతో బాటు) లంక రాజ్యాన్ని ఇచ్చి వేశాడు.

Never fear shadows .They simply mean there's light shining somewhere nearby.

"నీడలకు భయపడకండి, నీడలున్నాయంటే ఎక్కడో దగ్గరలో దీపం వెలుగుతోందని అర్థం" - అంటాడు 'రుత్‌రెంకెల్'.

కష్టాలకు భయపడి ఉంటే అలనాడు రాముడు అడవికి వెళ్లేవాడే కాదు. లంక వరకు రాళ్లూ ముళ్లు మధ్య కాళ్లకి చెప్పులైనా లేకుండా నడిచేవాడే కాడు.

దుఃఖాలు వచ్చినప్పుడు ఉద్విగ్నత చెందకుండా ఉండుట, సుఖాలలో స్పృహ లేకుండా ఉండటం "స్థితప్రజ్ఞలక్షణం" అంటుంది భగవద్గీత.

అదే కనిపిస్తుంది రాముడిలో ఆయన కష్టాలు పడ్డా కలత చెందలేదు. ఇక లంకానగరం విజయం తరువాత నగరంలోని సంపదను, సౌందర్యాన్ని చూసి, ఇక్కడే ఉండిపోదామన్న లక్ష్మణుడితో

"అపి స్వర్ణమయీ లంకా నమే లక్ష్మణ రోచతే"

నా జన్మభూమి తప్ప, బంగారు నగరమైన లంక కూడా నాకు రుచించదు లక్ష్మణా అంటాడు రాముడు.

Though it rains gold and silver in Foreign land and beggar's tears at home yet it is better to be at home.

"పరదేశాలలో కనుక రజతాలు వర్షిస్తున్నా, భిక్షాటన స్థితిగల స్వంత ఇంట్లో ఉండటం ఉత్తమం" (మలేషియా సామెత)

అక్కడక్కడ రామాయణంలో రాముడు సుఖదుఃఖాలకు లోనవుతున్నట్లు కనపడుతున్నా అదంతా నటనే......

"సౌఇసౌఇ రూపదిఖావఇ ఆపున హోఇనసోఇ"

ఒక నటుడు అనేక వేషాలలో కనిపించినా, ఆయన అవేవీ కాడు. అలాగే రాముడు కూడా.

శ్లో॥ ప్రసన్నతాం యా నగతాభిషేకత స్తథా న మమ్లౌ వనవాసదుఃఖతః।
ముఖాంబుజశ్రీ రఘునన్దనస్యమే సదాస్తు సా మంజుల మజ్గలప్రదా।

"రాజ్యాభిషేక వార్త వినగానే ప్రసన్నతను గానీ, వనవాసవార్త వినగానే దుఃఖాన్ని గానీ పొందని రఘునందనుడి ముఖ కమలం మాకు మంగళ ప్రదమగు గాక".

జీవితంలో సుఖాల కుప్పొంగక, కష్టాలకు తల్లడిల్లక నిలుచువాడే నిజమైన ధీరుడు.

If it were not for the rocks in its bed, the stream would have no song.

నదీ తీరంలో రాళ్ళే లేకపోతే, నీటిలో నుండి మధురమైన సంగీత ముత్పన్న మయ్యేదేకాదు - అంటాడు "చార్ పెర్కిన్స్".

అరణ్యవాసదుఃఖాన్ని, సీతాపహరణాన్ని ధైర్యంగా ఎదుర్కొనే రాముని ధీరోద్దాత్తతే లేకుంటే రామాయణం లోకపూజ్య మయ్యేదే కాదు.

కేవలం కాలినడకనే అశ్వరహితుడైన రాముడు లంక వరకు వెళ్లి యుద్ధంలో పాల్గొన్నాడు.

తులసీ రామాయణంలో రామ రావణులిరువురు ముఖాముఖి యుద్ధానికి తలపడపోతుంటే రాముడి వద్దకు విభీషణుడు వచ్చి.....

"నాథ నరథ నహి తన పదత్రానా।
కెహి బిధి జితబ బీర బలవానా ॥"

"హే ప్రభూ! మీ వద్ద రథం లేదు, శరీరంపైన కవచం లేదు, చివరికి కాళ్లకు చెప్పులన్నా లేవు, మీరే విధంగా బలవంతుడైన ఈ శత్రువును (రావణున్ని) జయించగలరు?" అని అడుగుతాడు.

అప్పుడు రాముడు నవ్వుతూ "విజయాన్ని చేకూర్చే ధర్మరథం" నా వద్ద ఉంది. దాన్ని వర్ణిస్తాను విను. "శౌర్యం, ధైర్యం అనే రథచక్రాలు, సత్యం, శీలం అనే ధ్వజపతాకాలు, కలిగిన ధర్మరథానికి బలం, వివేకం, దమం, పరోపకారమనే గుఱ్ఱాలు, క్షమ, దయ, సమత్వం అనే త్రాళ్లతో కట్టబడియున్నాయి. ఈశ్వర భజన అనే చతురుడైన సారథి దీనిపై కూర్చొని ఉన్నాడు. వైరాగ్యమనే డాలు, సంతోషమనే కత్తి, దానమనే బల్లెం, ప్రచండబుద్ధి అనే శక్తి, శ్రేష్ఠమైన విజ్ఞానమనే విల్లు నా వద్ద ఉన్నాయి. నిర్మలమైన, స్థిరమైన మనస్సు అనే అంబులపొదిలో శమం, యమం, నియమం అనే బాణాలున్నాయి. నేను గురుపూజ అనే గొప్పకవచాన్ని ధరించి ఉన్నాను. ఇలాంటి ధర్మరథం ఎక్కినవాడు సంసారమనే శత్రువునే జయించగలడు. ఇక వేరే శత్రువు మాట ఎందుకు?" అంటాడు.

ఈ విధంగా ధర్మరథ మెక్కిన రాముడు శత్రువును జయించి లంకా నగరాన్ని విభీషణుడి కిచ్చాడంటోంది పై వేదమంత్రం. అది ఎలాగో చూడండి.

దోహా॥ జోసంపతి సివ రావనహి దీన్హిదియే దసమాథ ।
సొయి సంపదా విభీషనహి సకుచిదీన్హి రఘునాథ ॥

పదితలలు బలిదానమిచ్చిన రావణుడికి శివుడు ఏ లంకానగరమైతే

ఇచ్చాడో, కేవలం తనకు శరణాగతుడైన విభీషణుడికి అదే లంకారాజ్యాన్ని రాముడు సంకోచంతో ఇచ్చాడు.

"అయ్యో! శివుడు తన భక్తునికి అందమైన బంగారునగరాన్ని ఇస్తే, నేను హనుమంతుడి ద్వారా కాల్చబడ్డ నగరాన్ని ఇస్తున్నానే" అనే సంకోచమే తప్ప మరొక సంచోచం రాముడిలో లేదంటారు, టీకాకారులు.

అవతారిక :

రామునిలోని కరుణాదిగుణాలు, స్థితప్రజ్ఞ లక్షణాలు వివరించిన తరువాత నాలుగవ మంత్రంలో ఆయన కర్మలోని కుశలతను వర్ణించ బోతోంది శ్రుతిమాత.

**4. మంత్రం**

**సయహ్వ్యావనీర్గోష్వర్వా జుహోతి ప్రధన్యాసు సస్రిః ।**
**అపాదో యత్ర యుజ్యాసో2 రథాద్రోణ్యశ్వాస ఈరతేఘృతం వాః ॥**

(ఋగ్. 10-99-4)

నీటిలో నావలాంటి గమనం కలిగిన రాముడు, పాదచార రహితుడి లాగా తన వానర మిత్రులతో కూడి మహాసముద్రంపై వంతెన కట్టి దాన్ని విశాలమైన భూప్రదేశంలాగా భ్రమణ యోగ్యం చేశాడు.

"జీవితంలో నీకు ఏది ఎదురొస్తుందో అది ప్రారబ్దం. దాన్ని నీవు ఎలా ఎదుర్కొంటావో అది పురుషార్థం"అంటారు శ్రీ స్వామి చిన్మయానంద.

ఒక వ్యక్తి జాతకంలో ఇతడొక గొప్పకావ్యం వ్రాస్తాడు అని ఉంది. ఆయన వాల్మీకి రామాయణాన్ని ఉన్నదున్నట్లు ఎత్తి చూసి వ్రాయడం జరిగింది.

వాల్మీకి మహర్షి రామాయణ మహాకావ్యం వ్రాశాడు, ఈ వ్యక్తి కూడా వ్రాశాడు. ఇద్దరి ప్రారబ్దంలోనూ ఉన్నది ఒకటే, కానీ చేసిన పనిలో ఎంత వ్యత్యాసం ఉందో చూడండి.

అలాగే రాముడు వంతెన కట్టవలసి వస్తే తన ప్రారబ్ధానికి

పురుషార్థాన్ని జోడించి ఎల్లకాలం ప్రజలంతా స్మరించేలాగా చేశాడు. దీన్నే "యోగః కర్మసు కౌశలం" కుశలకర్మే యోగం అన్నారు.

ఎటువంటి అధునాతన యంత్ర సముదాయ సహాయం లేకుండా 100 యోజనాలు అంటే 800 మైళ్ల పొడుగున వారధి నిర్మించడం సాధ్యమౌతుందా? ఆ! ఇవన్నీ కట్టుకథలు అలనాడు వారేదో పడవలు తయారుచేసుకొని సముద్రాన్ని దాటి ఉంటారు అంటారు కొందరు. కానీ ఆ మాట మాట్లాడేప్పుడు వారికి 'సర్ ఆర్థర్ కాటన్' గుర్తురాడు కాబోలు. ఆయన గోదావరి మీద ఆ బృహత్ కార్యాన్ని సాధించినప్పుడు ఆయనకు ఏపాటి అధునాతన యంత్ర సముదాయం సహాయపడింది? ఆయన విజయానికి కారణం స్వయంగా ఆయన మాటల ద్వారా వినండి.

"ఏ పనిలోనైనా విజయం సాధించలేమని ముందుగా ఒక నిర్ణయానికి వచ్చే వ్యక్తులు ఎప్పుడూ విజేతలు కాలేరు". - సర్ ఆర్థర్ కాటన్.

ఇంట్లో పెండ్లాంతో పోట్లాడివచ్చిన ఉపాధ్యాయుడు పిల్లల పరీక్ష పేపర్లు దిద్దటానికి కూర్చుంటే, ఆ రోజు ఆయన చేతబడ్డ పిల్లలందరూ పరీక్షలో ఫెయిలవక తప్పదు. అంటే తన అపజయాన్ని ఆ వ్యక్తి ఇతరుల మీద రుద్దాడన్నమాట. ఇలా జరగడానికి కారణం ఆ వ్యక్తి మనస్సు వర్తమానంలో నిలవకపోవడమే.

శ్రీరాముడు కూడా భార్యావియోగ దుఃఖంలో మునిగి, సీతస్మరణ లోనే తేలిఆడుతుంటే బృహత్‌వారధి నిర్మాణం జరిగేదా? ఆ ఉపాధ్యాయుడు లాగా తన వ్యక్తిగత కష్టాన్ని సమష్టిపై రుద్దిఉంటే అది వానరసైన్యానికి కూడా అపజయకారణమై నిలిచేది.

"తత్రైకాగ్రం మనఃకృత్వా, యత చిత్తేంద్రియ క్రియః"

మనస్సును ఏకాగ్రం చేసి విజయాన్ని సాధించమని గీతాచార్యుడు ఉద్బోధిస్తున్నాడు.

"గతాసూ నగతాసూంశ్చ, నానుశోచంతి పండితాః"

గతించినదాన్ని (వారిని) గూర్చిగాని, గతించని దాన్ని (వారిని) గూర్చిగాని ఆలోచించక, వర్తమానంలో కర్తవ్యంపై మనస్సును నిలపడమే విజయానికి కారణం అవుతుంది. అదే కర్మలో కుశలత.

సువిశాలమైన సముద్రాన్ని దాటాలంటే, అంతకన్నా విశాలమైన సంకల్పం ఉండాలి, అందుకు బలమైన ఇచ్ఛాశక్తి అవసరం.

"జ్యాయాన్ నిమిషతోసి తిష్ఠతో జ్యాయాన్ సముద్రాదసి కామమన్యో" (అథర్వ వేదం. 1-2-23)

ఓ ఇచ్ఛాశక్తీ! ఓ ఉత్సాహమా! నీవు చరాచర జగత్తును మించిన దానవు. నీవు సముద్రం కన్నా పెద్దదానవు.

స+ముద్+ర, ముద్ అంటే ఆనందం. 'సముద్' అంటే ఆనందంతో కూడినది అని అర్థం, అంటే విజ్ఞానం. దానిని 'ర' అంటే గ్రహించడం (రాతి గృహ్ణాతి ఇతరః) అని అర్థం. 'ఆనందరూపాన విశేషజ్ఞానాన్ని గ్రహించడం కొరకు చేసే భావన' సముద్రపదానికి అర్థం.

కనుక సంకల్పం ఉన్నతంగా ఉండి, భావం దృఢంగా ఉంటే సముద్రాన్ని కూడా జయించవచ్చు.

ఏదైనా కార్యం సాధించాలంటే ముందు దాన్ని సాధించాలన్న తపన కావాలి, దాన్నే తపస్సన్నారు. శ్రీరాముడు సముద్రుడి అనుగ్రహం కొరకు మూడురోజులు మౌనంగా తపస్సు చేశాడు. అంటే అవస్థాత్రయాలకు (జాగ్రత, స్వప్న, సుషుప్తాలకు) అతీతుడై ధ్యానైక గమ్యుడైనాడు. కానీ సముద్రుడు ప్రత్యక్షం కాకపోవడంతో విసుగు చెంది శరసంధానం చేశాడు. శరసంధానం అన్న పదానికి నాశనం చేయడం అని అర్థం.

సాధన ఫలించని వైరాగ్యంతో అసలు సాధన చేసేవాణ్ణే అంతం చేసుకుందా మనిపించే నిస్పృహ భావన అది. అది ఆవరించిననాడే దైవ సాక్షాత్కారమౌతుంది.

ఏడు సంవత్సరాలు అకుంఠిత దీక్షతో రాత్రింబవళ్లు నిర్విరామంగా

సాధన చేసిన సిద్ధార్థుడు (ఏడు చక్రాలను దాటిన యోగి), శరీరం శుష్కించి నిరంజనా నదిలో కొట్టుకుపోయి చివరికి బోధివృక్షం క్రిందికి చేరి ఏ ప్రయత్నం వల్లా సాధించలేని ఆ స్థితినే, ప్రయత్నం చేసేవాడే (కర్తృత్వమే) అంతమయ్యేలా విశ్రమించినప్పుడే బుద్ధత్వాన్ని పొందాడు.

శ్రీరామకృష్ణ పరమహంస కూడా విసుగు చెంది చివరికి తనను తాను బలిపెట్టుకోబోయినప్పుడే కదా కాళీమాత సాక్షాత్కారం పొందింది.

కనుక కార్యసాధనకు (1) తపస్సు, (2) సంకల్పబలం, (3) కర్తృత్వ రాహిత్యం (నేను చేస్తున్నాననే అహంకారం లేకపోవడం) అవసరం.

ఇవన్నీ కలిగి ఉన్న కర్మయోగి శ్రీరాముడు.

శ్రీరామచరితమానసంలో వారధి నిర్మాణ ఘట్టం మనోహరంగా వర్ణించబడింది. ఇంకా ఆలస్యమెందుకు ఇక సేతునిర్మాణం మొదలు బెట్టండి అన్న శ్రీరాముడితో జాంబవంతుడు "నాథనామ తవసేతు నరచఢి భావసాగర తరహి".

హే ప్రభో! ' సేతు' అనేది మీ నామమే గదా దాని నధిరోహించి (ఆశ్రయించి) నరులు భవసాగరాన్ని దాటుతున్నారు అంటాడు.

"సంసార సాగర సముత్తరణైక సేతో"

అంటూ ఆ పరమాత్మను సుప్రభాతంతో రోజూ భక్తులు కొనియాడటం లోకవిదితమే కదా. కనుక ఇక ఈ చిన్నసేతువొక లెక్కనా అంటూ ఉండగా ఆంజనేయస్వామి "శ్రీరామా! మీ ప్రతాపమనే బడబానలం (సముద్ర గర్భంలో ఉండే అగ్ని) ముందే ఈ సముద్రజలాన్ని ఆవిరి చేసింది. కాని రాక్షస స్త్రీల అశ్రుధారలతో ఇది మళ్లీ నిండి పోయింది. అందుకే సముద్ర జలం ఉప్పగా ఉంటుంది" అంటూ చమత్కరిస్తాడు.

వారధి నిర్మాణంలో కొండలు, రాళ్లు, చెట్లు ఉపయోగిస్తూ వెళ్లగా నాలుగు రోజులలో చుట్టు ప్రక్కల అరణ్యాలు, కొండలు అన్నీ అయి పోయాయట. ఇంకా 23 యోజనాల వారధి నిర్మాణం మిగిలి ఉండటంతో వానరులంతా

కొండరాళ్ళు సేకరించడానికి ఉత్తర భారత ప్రాంతాలకు వెళ్లారట. ఆంజనేయస్వామి గోవర్ధన పర్వతాన్ని ఎత్తుదామని చూస్తే అది లేవలేదు. తనను రామకార్యార్థమై తీసుకువెళ్లదలచానని చెప్పడంతో ఆ పర్వతం తేలికైంది. కానీ దాన్ని తెచ్చేంతలోనే ఇక్కడ వారధి నిర్మాణం పూర్తవడంతో యథాస్థానంలో ఉంచడం జరిగింది. తాను రామకార్యానికి ఉపయోగపడ లేకపోయానే అని బాధపడుతున్న గోవర్ధనానికి ద్వాపరయుగంలో తన లీలలో పాల్గొనే అవకాశం లభిస్తుందని రాముడు వరమిచ్చాడనే ఒక పురాణకథ మనకు కనిపిస్తుంది.

నలనీలులనే వానరులచేత ఈ వారధి పదియోజనాల (ఒక యోజనం - 8 మైళ్లు) వెడల్పుతోనూ, 100 యోజనాల పొడవున నిర్మించబడింది. కాబట్టి ఇది అత్యంత విశాలమై భూమిలాగా భ్రమణ యోగ్యమైందంటున్నది శ్రుతిమాత. ఈ నలనీలులనే వానరులు చిన్నతనం లో అల్లరిగా తిరుగుతూ ఆశ్రమవాసులైన మునుల దండకమండలాలు, ఆసనాలు, జపమాలలు మొదలైనవి నదుల్లోకి విసిరివేసేవారట. అప్పుడు వారు వీరిచేత నీళ్లల్లో వేయబడ్డ వస్తువులు తేలాలని శాపమిచ్చినట్లు - అది ఇప్పుడు వరంగా పరిణమించిందనే ఇంకొక పురాణగాథ కనిపిస్తుంది.

ఇదంతా తమవల్లే అవుతోంది అనే అహంకారం నలనీలులకు రావడంతో, వాళ్లు నీళ్లలో వేసిన రాళ్లు అలల వేగానికి కొట్టుకొని పోవడం మొదలు బెట్టాయట. వారంతా శ్రీరామునితో ఈ విషయం విన్నవించు కోగా 'రా' ఒక రాయిమీద, 'మ' ఇంకొక రాయిమీద రాయమని దానితో పరస్పరం ఆ రాళ్లు జిగురు రాసినట్లుగా అంటుకుపోతూ కదలకుండా ఉండగల వన్నారట. ఆ విధంగా చేసి వాళ్లు తమ అహంకారాన్ని పోగొట్టు కున్నారని మరొక పురాణగాథ కనిపిస్తుంది.

వారధి నిర్మాణమనేది సమష్టి కార్యం. ఫలాపేక్ష లేకుండా, వ్యక్తిగత అహంకారాదులకు తావు లేకుండా మొత్తం సంఘాని కంతటికీ పనికివచ్చే సమష్టి కార్యాన్ని చేస్తే దాన్ని యజ్ఞమంటారు. అటువంటి కార్యాలలో

వ్యక్తిగతాహంకారాలకు తావియ్యగూడదని ప్రబోధించడానికే ఈ పురాణ కథలన్నీ చెప్పబడుతున్నాయి. ఈ విషయాన్ని సూచించడానికే పై మంత్రం లో శ్రుతిమాత "రాముడు వానర మిత్రులతో కూడి మహా సముద్రం పైన వంతెన కట్టి దాన్ని విశాలమైన భూప్రదేశం లాగా భ్రమణయోగ్యం చేశాడు" అని చెబుతోంది. సమష్టి కార్యంలో రాముడు కూడా ఒక సమిధగా మారాడే గాని కేవలం తానే చేస్తున్నాననే అహంకారం ఆయనలో లేదు.

"నలాతి గృహ్ణాతి ఇతి నలః" అంటే దేనినీ గ్రహించని అసంగత స్థితి 'నిర్' అంటే నిర్గతమైన, 'ల' అంటే గ్రహణం కలది అంటే సంగాన్ని అధిగమించిన నిస్సంగత్వ స్థితి. ఈ విధంగా నలుడు అసంగత్వ స్థితిలో దూరంగా ఎలా చేయాలో చెప్పి చేయిస్తుంటే నీలుడు నిస్సంగత్వంలో తాను చేస్తూ కూడా చేయని స్థితిని పొందాడు. దీనినే కర్మలో అకర్మదర్శనం అన్నాడు గీతాచార్యుడు.

"సేతుం దృష్ట్వా సముద్రస్య పునర్జన్మ న విద్యతే" ఈ విధంగా అహంకార రహితమైన సమష్టి కర్మలో తయారైన సేతువు (జీవ, బ్రహ్మల మధ్య వారధి)ని దర్శించిన వారికి ఇక పునర్జన్మ ఉండదు.

అవతారిక :

4వ మంత్రంలో రాముని కర్మయోగ తత్వాన్ని వర్ణించిన శ్రుతిమాత "రామో విగ్రహవాన్ ధర్మః" ధర్మమే శరీరంగా గల రాముడు సాంఘిక వ్యవహారంలో ఎలా ధర్మాచరణ చేశాడో చెబుతూ ఆయన యొక్క ఆ ధర్మాచరణ బీజంలో నుండి వచ్చిన శుభఫలం ఏమిటో చెప్పబోతోంది.

5. మంత్రం

**సరుద్రేభిరశస్తవార ఋభ్వాహిత్వీ గయమారే అవద్య ఆగాత్ ।**
**వమ్రస్య మన్యే మిథునా వివవ్రీ అన్నమభీత్యారోదయన్ముషాయన్॥**

(ఋగ్. 10-99-5)

ఆ రాముడు హనుమదాదుల సహితంగా సమస్త దోషరహిత

సీతాదేవితో బాటు తిరిగి స్వస్థానానికి చేరుకున్నాడు. రావణ స్పర్శ నిమిత్త అపవాదాన్ని దూరం చేయడం కొరకు రామునిచేత పరిత్యజించబడ్డ సీత అరణ్యంలో రోదించడం మొదలుబెట్టింది. వాల్మీకి యుగల శిష్యులు లవ కుశులు ఆయన వద్ద రామాయణాన్ని చదువుకొని ఆ వృత్తాంతాన్ని లోకం లో గానం చేశారు.

"అజ్ఞానమిచ్చిన ధైర్యాన్ని విజ్ఞాన మివ్వదంటారు" శ్రీ పోలాప్రగడ సత్య నారాయణమూర్తి,కానీ విచక్షణారహితమైన ఈ ధైర్యము మంచికన్నా చెడే ఎక్కువగా చేస్తుంది.అదే అనర్థం జరిగింది-త్రాగిన చాకలివాడి మాటల వల్ల.

శ్రుతిమాత అదే చెబుతోంది వినండి-"సమస్త దోషరహిత సీతాదేవి".

సీ॥ అవని నయోనిజనైపుట్టి మిథిలేంద్రు
వీట నే నుండిన విధము వినరొ?
యంగరాగము లిచ్చి యనసూయ మొదలైన
సతులెంచుకొన్నది చాల వినరొ?
యా లంకలో దొల్లి త్రై లోక్యము నుతింప
వహ్ని నే జొచ్చిన వార్త వినరొ?
యీ సీత నిర్దోష యేలుకొమ్మని రాము
బ్రహ్మాదులపు డన్న పలుకు వినరొ?
ఆ॥ వినియు గనియు బ్రజలు నను నిందసేసిన
యంత మాత్రమునకె యధిపుడులికి
యింత తెగువ సేయ నిచ్చగించుట న్యాయ
భాగ్యమింతె యొకరి బల్కనేల?

ఇది లౌకిక దృష్టి. సాధారణ మానవుడు ఆలోచించే విధానం. లోతైన ధర్మగతికి వారు ఎదగటం కష్టం. శ్రీరాముని ధర్మగతిని భవభూతి ఉత్తరరామచరితంలో ఇలా వర్ణిస్తారు.

శ్లో॥ స్నేహం దయా చ సౌఖ్యం చ యదివా జానకీమపి ।

ఆరాధనాయ లోకానాం ముంచతో నాస్తి యే వ్యథా॥ 1-12)

నేను స్నేహాన్ని విడవగలను, దయను విడువగలను, మిత్రతను విడువగలను, జానకిని కూడ విడువగలను, కానీ లోక కల్యాణం కొరకు, ప్రజలకు శుభాన్ని చేకూర్చడం కొరకు నేను చేసిన ప్రతిజ్ఞను విడిచిపెట్టలేను. (దాని కొరకు అన్నీ విడుస్తాను)

ధర్మాధర్మాల మధ్య ఘర్షణ కనుక వస్తే ధర్మాన్ని ఎన్నుకొని దాని పక్షాన నిలబడటం మానవుడి కర్తవ్యం. కానీ ధర్మానుగమనం ఈ లోకంలో అంత సులభమైన విషయం కాదు. మానవుడు సంఘజీవి కనుక అతడికి ఇతరులతో ఉన్న అన్ని సంబంధాలు ఏదో ఒక ధర్మానికి దారితీస్తాయి. వ్యక్తికి తల్లి పోషణ ఎంత ధర్మమో, భార్యను పోషించడం కూడా అంతే ధర్మం.వారిద్దరికి మధ్య ఘర్షణ వచ్చి వారిద్దరు ఒక్కచోట కలిసి ఉండలేక పోతే వారికి నచ్చచెప్పడం వారిని కలిపి ఉంచడానికి ప్రయత్నించడం కూడా అతడి ధర్మమే, కానీ వారు విడిపోవడం అనివార్యమైతే తాను ఎవరి పక్షం వహించాలి? ఇది ధర్మం అధర్మానికి మధ్య ఘర్షణ కాదు. ధర్మానికి ధర్మానికి మధ్య ఘర్షణ.

అన్నం పెట్టిన యజమానిని సేవించడం ఒక ధర్మమైతే, సంఘంలో అధర్మాచరణ కలిగిన అదే యజమానిని సంఘంలోని ఒక వ్యక్తిగా ఎదుర్కోవడం ఇంకొక ధర్మం. ఈ రెంటి మధ్య ఎన్నిక చేసుకోవాల్సి వచ్చినప్పుడు, భీష్మద్రోణులు మొదటి ధర్మాన్ని ఎన్నుకొన్నారు. విభీషణాదులు రెండవదాన్ని ఎన్నుకొన్నారు. కానీ ఈ ధర్మాత్ములలో ఎవరినీ అధర్మాచరణం చేశారనలేము.

అలాగే రాజుగా ప్రజల మనోభావాలను మన్నించడం రాముని కర్తవ్యం, భర్తగా భార్యకు ఏ కష్టం రాకుండా చూడటం కూడా రాముడి కర్తవ్యమే. ఆ రెండు ధర్మాల ఘర్షణలో పతి ధర్మాన్ని రాజధర్మానికి బలి పెట్టక తప్పలేదు రాముడికి.

శూద్ర శంబుకుణ్ణి రాముడు వధించాడని గగ్గోలు పెట్టే నాస్తికులు

హేతువాదులు మొదలైనవారు, నిమ్నకులాలవారికి సమానమైన హక్కు ఇవ్వబడటం లేదు అని ఆక్రోశించేవారు, కేవలం ఒక్క రజకుడి మాటకు విలువ నిచ్చి అతడు కూడా నా ప్రజలలో ఒకడు కనుక, అతడి వాక్కే ప్రజావాక్కని భావించి సీతమ్మ పరిత్యాగానికి రాముడు ఒడిగడితే మళ్లీ అదికూడా అన్యాయమన్నారు. ఒకవేళ సీతాపరిత్యాగం జరగకపోతే వారే రాముణ్ణి స్త్రీలంపటుడు, ప్రజల వాక్కుకు విలువనివ్వని నిరంకుశ ప్రభువు అనేవారు. ఒక్క ఓటు సీతమ్మకు వ్యతిరేకంగా పడినా దాన్నే గౌరవించిన ప్రజాస్వామ్యవాది శ్రీరాముడు.

ఎంత ధర్మాచరణైతే మాత్రం ఇంత కఠినంగా ఉండాలా? నిండు చూలాలిని అరణ్యాల పాలుచేయాలా? అని ప్రశ్నించేవారు కూడా ఉన్నారు. ధర్మాచరణ కఠినంగానూ బలంగానూ లేకపోతే దిగజారి పోతుంది. ఇదివరకు రోజులలో కర్తవ్య కర్మను కర్మగా కాక స్వధర్మంగా భావించి ఆనందోల్లాసాలతో ప్రజలు పరిశ్రమించేవారు. తరువాత రోజులలో అదే కేవలం బాధ్యతగా మారింది. బాధ్యత కనుక ప్రేమ కొరవడింది. ముసలి తల్లిదండ్రులకు అన్నం పెట్టడం బాధ్యత అనేవాడు దౌర్భాగ్యుడు. వారికి బాధ్యతతోకాదు, ప్రేమతో అన్నం పెట్టగలగాలి. ప్రేమ బాధ్యత రూపాన్ని సంతరించుకుంటే ఆ ధర్మం పతనమైనట్లే. ఆ తరువాత అది మరింత పతనమై, ఫలాపేక్షతో కర్మ చేయడం మొదలైంది. "ఈ రోజు నా కొడుకును చదివిస్తున్నాను. రేపు వాడు డాక్టరైనాక ప్రాక్టీసు పెట్టి నాకు బాగా సంపాదించి పెడతాడు" అంటాడొక తండ్రి. అది ప్రేమ ఎలా అవుతుంది. ఈ రోజు పెట్టుబడి పెట్టి రేపు ఫలితాన్ని ఆశించే వ్యాపారమౌతుంది. జీతం కొరకు పనిచేయడం కూడా కొస్త నయమే. కానీ తరువాత కాలంలో ఆ స్థాయి ఇంకా పతనమై జీతం కాక లంచం కూడా తీసుకొని పనిచేయడం మొదలు పెట్టారు.ప్రస్తుతం అది మరింత దిగజారిపోయి లంచం తీసుకున్న తరువాత కూడా పనిచేయడం మానేశారు. ధర్మాచరణ కఠినంగా లేకపోతే పై అంతస్తు లో మెట్లమీద జారిపడ్డ రబ్బరు బంతిలా మారుతుంది దాని స్థితి.

ఇదీ సీతాపరిత్యాగంలోని ధర్మపరమైన దృష్టి. ఇక అధ్యాత్మిక దృష్టితో దీన్ని వీక్షించ ప్రయత్నిద్దాం.

"రామో న గచ్ఛతి న తిష్ఠతి నానుశోచ
త్యాకాంక్షతే త్యజతి నో న కరోతి కించిత్,
మాయాగుణా ననుగతో హి తథా విభాతి".

రాముడు కదలడు, నిలుచుండడు, దుఃఖింపడు, ఆకాంక్షింపడు, త్యజింపడు ఇంకే పని చేయడు. ఆయన త్రిగుణాత్మకమైన మాయకాధార భూతుడై, మాయచేత అనుగతుడై ఆ విధంగా అన్ని పనులు చేస్తున్నట్లు భాసిస్తాడు.

ఎవరీ మాయ? మరెవరో గాదు సీతమ్మతల్లి. సీతమ్మే స్వయంగా హనుమంతుడితో ఇలా చెబుతోంది.

"ఏవ మాదీని కర్మాణి మయైవాచరితాన్యపి,
ఆరోపయంతి రామే2స్మి న్నిర్వికారో అఖిలాత్మని".

ఈ పనులన్నీ నేను చేసినప్పటికీ నిర్వికారుడు నిఖిలాత్ముడు అయిన రాముడిలో ఇవన్నీ అజ్ఞాను లారోపిస్తున్నారు.

కనుక ఆధ్యాత్మరామాయణా న్ననుసరించి కూటస్థరూపుడు (కదలిక లేనివాడు) అయిన శ్రీరాముడు కేవలం సీతమ్మవారి ప్రేరణ చేతనే అన్ని కార్యాలు చేశాడు. సీతాపరిత్యాగం కూడా ఆ లీలలలో భాగమే.

ఇక్కడితో సీతాపరిత్యాగ ఘట్ట విశ్లేషణ జరిగింది. ఇక అరణ్యంలో రోదిస్తున్న సీతమ్మవారి విషయమేమిటి?

"అదృష్టవంతుణ్ణి సముద్రంలో పారవేస్తే, నోట చేపను కరుచుకొని పైకి వస్తాడు," అంటోందో అరబ్బీ సామెత.

దుఃఖప్రారబ్ధమెలాగైతే తప్పదో సుఖప్రారబ్ధం కూడా తప్పదు. నేను నలభైరోజులు తిరుమల అడవుల్లో తపస్సు చేసుకుందామని వెళితే, ఒక

మార్వాడీల గుంపు మద్రాసు నుండి అక్కడికి వచ్చి ఆ నలభై రోజులు తులసీరామాయణం మండలం రోజులు పారాయణచేసి నాకు రోజుకొక రకమైన మిఠాయి తినిపించారు. కసరుకాయలతో గడుస్తుందనుకున్న నా తపస్సంతా పూరీ హల్వాలతో గడిచిపోయింది.

సీతామాతకు వాల్మీకి మహర్షి ఆశ్రయం కల్పించాడు. శ్రీరామ స్మరణలో సీతమ్మ అక్కడ కాలం గడుపుతోంది.

బృందావనంలో ఒక మహాత్ముడు ఉండేవాడు. ఆయన "కోకిల-కలరవం" అనే పేరుతో ఒక మధురమైన పుస్తకాన్ని రచించాడు. దానిలో సీతాపరిత్యాగం తరువాత ఒక పెంపుడు కోకిల సీతారాముల మధ్య తిరుగుతూ ఒకరి ప్రేమ సందేశాలు మరొకరికి అందిస్తూ ఒకరి విరహస్థితిని మరొకరికి విడమరచి చెబుతూ ఉంటుంది. ఒకసారి స్థాపితమైనాక ప్రేమ పెరుగుతుందే గాని తరగదు - ఇది ప్రేమ లక్షణం.

ప్రేమ విరహసమయంలోనే అభివ్యక్తమౌతుంది. కానీ నిజానికి ప్రేమ యొక్క జీవితంలో తన ప్రియావియోగం అసలు సంభవం కాదు. నిజమైన ప్రేమ ఎవరి హృదయంలో ఉంటుందో వారికి వియోగ విషయమే తెలియదు. వారి ప్రియతముడు వారి హృదయం నుండి ఎక్కడికి వెళ్లగలడు?

ఒకసారి ఒక వ్యక్తి మహాత్మాగాంధీని "శ్రీరాముడు సీతకు, పాండవులు ద్రౌపదికి, నలుడు దమయంతికి ఇంత అన్యాయం ఎందుకు చేశారు?" అని ప్రశ్నించాడు. మహాత్మాగాంధీ" అన్యాయం వైపు చూడకండి, సీత రాముణ్ణి, ద్రౌపది పాండవులను, దమయంతి నలుణ్ణి ఏవిధంగా అర్థం చేసుకున్నారు, వారికి తమ హృదయంలో ఎటువంటి స్థానం ఇచ్చారు? వారు తమను చాలా కష్టాలపాలు చేసిన తరువాత కూడా వారిపై వీరికి అంతే ప్రేమ గౌరవం ఉందా లేదా అనేది చూడండి" అన్నారు.

కనుక మనం కూడా సీతా పరిత్యాగ ఘట్టాన్ని శ్రీరామచరితమనే గీటురాయి పైన గాక, సీతాచరితమనే గీటురాయి పైన గీసి చూసినప్పుడే

సరిగా అర్థం చేసుకోగలం. అందుకే వాల్మీకి కూడా స్పష్టంగా " సీతాయా శ్చరితం మహత్"అంటాడు. అంటే తాను గొప్పదైన రామచరిత్ర రాయ లేదని, ఉదారమైన సీతాచరిత్రాన్నే రచించానని అంటాడు.

ఇక రాముడు కూడా ప్రజాపక్షాన రాజుగా బద్ధశాసనుడై వ్యక్తిగత ప్రేమ జీవితంలో ఎంత పరితప్తుడైనాడో కేవలం భవభూతి మాత్రమే తెల్పగలిగాడు ఈ విధంగా.

"అనిర్భిన్నో గభీరత్వాదన్త ర్గూఢ ఘనవ్యథః
పుటపాక ప్రతీకాశో రామస్య కరుణో రసః॥
(ఉత్తర రామచరితం 3.1)

కరుణాసాగరుడైన రాముని హృదయం కరిగిన బంగారమే, అది సీతావియోగమనే అగ్నిచేత మరింత పొగలు కక్కుతోంది. కానీ ఆయన దాన్ని పుటంలో దాచిన బంగారంలాగా హృదయంలోనే తొక్కిపట్టాడు.

అసలీ సీతాపరత్యాగ ఘట్టంలో ఎవరెవరి తప్పొప్పులు ఎన్నినా ఎన్నకపోయినా దానివల్ల వచ్చిన ఫలితమేమిటి? దీని వల్ల రెండు రకాల ఫలితాలొచ్చాయి. ఒకటి లవకుశులు గురుకుల వాసులై ఉత్తమ విద్య నభ్యసించగలగడం, రెండు లోకోత్తరమైన రామకథ మధురగాన రూపంలో లోకంలో ప్రచారం కావడం.

Power corrupts man, and absolute power corrupts absolutely-Lord Acton.

"అధికారం మనిషిని చెడగొడుతుంది, అడ్డులేని అధికారం పూర్తిగా చెడగొడుతుంది".

అన్నట్లుగా లవకుశులు రాజభవనంలోనే పెరిగి ఉంటే అధికార గర్వంతో అహంకారులుగా తయారయ్యేవారేమోమరి. అలాకాక అనామకులు గా పెరగడంతో, తపస్సంపన్నుడైన వాల్మీకి మహర్షివద్ద వారు విద్యను, వినయాన్ని, లోకపూజ్యమైన రామాయణాన్ని నేర్చుకోవడమేగాక లోకంలో దాన్ని ప్రచారం కూడా చేశారు.

శ్లో॥ శృణ్వన్తి గాయన్తి గుణన్త్యభీక్షణ
స్మరన్తి నందన్తి తవేహితం జనాః।
త ఏవ పశ్యన్త్యచిరేణ తావకం
భవప్రవాహో పరమం పదాంబుజమ్॥ (భార: 1-8-36)

శ్రోత లభిస్తే భాగవత కథలు వినిపించు, వక్త లభిస్తే వారి నుండి కథ విను. వారివురు లభించకుంటే నీకు నువ్వే ఉపదేశం చేసుకో. ఏది ఏమైనా సంసారంలో రాగద్వేషాలు ఉత్పన్నం చేయని వస్తువును స్మరించండి. దానిలో రసాన్ని ఆస్వాదించండి, ఆనందించండి, అంటుంది భారతం. శ్రీరాముని ధర్మాచరణ ఫలితంగా గురుకులవాసులైన లవకుశులు లోకాని కందించిన మధుర ఫలమిది.

అవతారిక:

ఇంతవరకు శ్రీరామచంద్రుడి స్థితప్రజ్ఞ లక్షణాలు, ధర్మాచరణను వర్ణించిన శ్రుతిమాత ఇక ఆరు ఏడు మంత్రాలలో ఈ భూమిపై రామాయణం ఎలా అవతరించిందో వివరించబోతోంది.

6,7. మంత్రాలు

**పితుర్మాతురధ్యా యే సమస్వరన్నృచా శోచన్తః సన్దహన్తో అవ్రతాన్।**
**ఇన్ద్ర ద్విష్టామప ధమన్తి మాయయా త్వచమసిక్నీం భూమనో దివస్పరి:॥**
**ప్రత్నాన్మానాదధ్యా యే సమస్వరఞ్ఛ్లోక యంత్రాసో రభసస్య మన్తవః।**
**అపానక్షాసో బధిరా అహాసత ఋతస్య పన్థాం న తరన్తి దుష్కృతః॥**

(ఋగ్ : 9-73-5,6)

మాతాపితరులకన్నా ఆప్తహితోపదేష్టారామాయణ రచన చేసే వాల్మీకి దుఃఖితుడై 32 అక్షరాల అనుష్టుప్ ఛన్దాన్ని ఉచ్చరిస్తూ ఆ వ్యాధుణ్ణి భస్మం చేశాడు. అవిద్యా కారణంచేత నానా యోనుల్లో తిరిగే దుఃఖిత ఆత్మకు ముక్తి నిచ్చాడు.

పురాతన వేదాన్ని ఎరిగినవాడై, దివ్యదృష్టి పొందినవాడై ఆయన

మంత్రాన్ని రచించినట్లుగా రామాయణ కావ్యాన్ని నిర్మించాడు. సరియైన నిష్పత్తితో వెలువడిన ఆ శ్లోకం యొక్క అర్థం ఇలాగుంది.

"నదీ ప్రవాహవేగం లాంటి చంచల మనస్కుడా! కార్యాకార్య వివేక హీనుడా! శాంత శ్రవణాదులు లేక సత్యమార్గం నుండి తప్పిపోయిన వాడా! నీ పాప ఫలితంగా నీవు నరకయాతన లనుభవింతువు గాక"

శ్లో॥ ఇతిహాసం మహాశ్చర్య మన్యం రామాయణాభిధమ్।
వాల్మీకి నామ్నా జీవేన తే నైవాన్యేన వా కృతమ్॥
ఏతచ్చద్వాదశం వారం క్రియతే విస్మృతం గతమ్।
ద్వితీయ మేతస్య సమం భారతం నామనామతః॥
స్మరామి ప్రాక్తన వ్యాసకృతం జగతి విస్మృతమ్।
వ్యాసాభిధేన జీవేన తేనైవాన్యేన వా కృతమ్॥

(యోగవాశిష్ఠం)

ఓ మునీంద్రా! ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించే రామాయణమనే ఇతిహాసం ఒకటి ఉంది. అది వాల్మీకి అనే పేరుగల జీవుడి చేతనో లేక అవతారాంతరాలలో అదే పేరు గల్గిన అన్యజీవుల చేతనో ఇప్పటికి పన్నెండు సార్లు వ్రాయబడింది. ఇంతేకాక దీనికి సమానమైనది, వ్యాసుల వారిచే వ్రాయబడింది. ప్రస్తుతం లోకంలో మరచిపోబడింది అయిన భారతమనే ఇతిహాసం మళ్లీ ఏడవసారి రచింపబడుతోంది. ఇది కూడా వ్యాసుడనే పేరుగల జీవుడి చేతనో లేక అవతారాంతర వ్యాసుని చేతనో రచింపబడింది. అని యోగవాశిష్ఠం నిర్వాణ ప్రకరణం పూర్వార్థంలో భుశుండోపాఖ్యానం 22వ సర్గలో వశిష్ఠుల వారితో భుశుండి అనే కాకి చెప్పడం జరిగింది.

శ్లో॥ శ్రీరామచరితం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్।
సాకంచ దీర్ఘతపసా శుశ్రావ సుమహామతిః॥

"శతకోటి ప్రవిస్తరమైన రామచరితం పవిత్రమైంది, దీన్ని దీర్ఘతపస్సు చేత మహాబుద్ధిశాలి వినగలిగాడు" అని వాయుపురాణం మాఘమహాత్మ్య 20వ అధ్యాయంలో కనిపిస్తుంది.

శ్లో॥ శతకోటి సువిస్తీర్ణ మేతద్రామాయణం మహత్।
మల్లోకే విష్ణులోకేచ, సత్యలోకే పరంతప॥

"శతకోటి ప్రవిస్తరమగు మహత్తరమైన రామాయణము నా లోకంలోనూ, విష్ణులోకంలోనూ, సత్యలోకంలోనూ ఉన్నది" అని బ్రహ్మాండ పురాణము 148వ అధ్యాయంలో సనత్కుమార- దక్షిణామూర్తి సంవాదంలో చెప్పబడింది.

ఇలా అనేక పురాణ, ఇతిహాస, వేదాదులలోని అనేక ప్రమాణాలను చూచిన తర్వాత వందకోట్ల శ్లోకాలతో వాల్మీకి మహర్షి చేత రామాయణము రచించబడిందని, అందులోని ఒక భాగమే ఈ వాల్మీకి రామాయణమని, యుగభేదము స్థల లోక భేదాలున్నప్పటికీ అన్ని రామాయణాలకు వాల్మీకి మహర్షే కర్త అని తెలుస్తోంది.

మళ్లీ ఒకానొక జన్మలో బ్రహ్మశాపం వల్ల భూమిపై జన్మించిన వాల్మీకి దుర్వర్తనుడైనాడు.

శ్లో॥ అహం పురా కిరాతేషు కిరాతైః సహవర్ధితః।
జన్మమాత్ర ద్విజత్వం మే శూద్రం చావరతః సదా॥

(ఆధ్యాత్మ: అయో: 6-64)

నేను జన్మతః బ్రాహ్మడి నైనప్పటికీ అరణ్యంలో కిరాతకులతో కలిసి జీవిస్తూ వారితోనే కలిసి తిరుగూతూ, శూద్రాచరణాన్నే కలిగి ఉన్నాను అని వాల్మీకి మహర్షి స్వయంగా చెప్పుకున్నాడు.

నారదుని సత్సంగం చేత ప్రభావితుడైన ఈయన భగవన్నామ స్మరణలో మునిగిపోయాడు. ఆయన చుట్టూ వల్మీకాలు (పుట్టలు) పెరిగాయి. దురాచారులలో కెల్లా దురాచారి కూడా అనన్యంగా (ఆయన తప్ప మరొక దిక్కులేదనే భావంతో) నన్ను చింతించేటట్లయితే అతడిని సాధువుగా భావించండి అని భగవంతుడు గీతలో చెప్పిన వాక్యాలకు ప్రమాణమై నిలిచిన వాల్మీకి రత్నాకరుడి నుండి వాల్మీకిగా మారాడు.

దీర్ఘతపస్సు చేత పవిత్రుడైన ఈ మహర్షి తానానేక జన్మలలో

రచించిన రామాయణాన్ని స్మరించి ఆ గాథను విస్మరించిన ఈలోకానికి దాన్ని తిరిగి అందించవలసి ఉంది. అందుకు ప్రకృతి ప్రేరణ నివ్వవలసి ఉంది.

"స్వనంతి పాదపాశ్చ యే మమానంగప్రదీపనాః
అశోకస్త బకాంగార షట్పదస్వనవిస్వనః
మాం హి పల్లవ తామ్రార్చిః వసంతాగ్నిః ప్రదక్ష్యతి" ॥

చెట్ల కదలిక వల్ల కలిగే ఆకుల గలగలారావాలు, వాటిపై వ్రాలే పక్షుల కలకలారావాలు, ఆయన మదన వేదనను దీపింపజేశాయి. అశోక స్తబకాలనే అగ్ని కణాలు కలది, పల్లవాలనే జ్వాలలు కలది అయిన వసంత మనే అగ్ని అతణ్ణి దహించడం మొదలుబెట్టింది.

అంటూ సీతాపహరణం తరువాత రాముడి విరహవేదనను ఉపమానాలతో అతి మనోహరంగా మనముందుంచుతారు వాల్మీకి. ఇలా కవిత ఉప్పొంగాలంటే ప్రకృతి భావాలతో తాదాత్మ్యం చెందగల రసికత కావాలి. అటువంటి ప్రేరణ వాల్మీకికి లభించింది.

ఒకరోజు భరద్వాజ శిష్య సమేతంగా వాల్మీకి తమసా నదికి స్నానార్థమై వెళ్లగా అక్కడ పాపాత్ముడైన నిషాదుడొకడు రతిక్రీడలో మగ్నమై ఉన్న క్రౌంచ పక్షుల జంటలో మగదానిని బాణంతో కొట్టగా అది రక్తంతో తడిసి క్రిందపడిపోయింది. అదిచూచి ఆడపిట్ట జాలికలిగేట్లుగా అరుస్తూ దానిచుట్టూ తిరగడం మొదలుపెట్టింది. దాని బాధను చూసిన వెంటనే వాల్మీకి నోటి వెంట..

"మా నిషాద, ప్రతిష్ఠాం త్వ మగమశ్శాశ్వతీ స్సమాః,
యత్క్రౌంచ మిథునాదేక మవధీః కామ మోహితమ్",

అనే మాటలు శ్లోక రూపంలో పలికాయి. దాని అర్థం....

ఓ నిషాదుడా! క్రౌంచ మిథునం నుండి కామమోహితమైన మగపక్షిని వధించావు కనుక నీవు చిరకాలం ప్రతిష్ఠను పొందకుందువు గాక.

వాల్మీకి నోటి వెంట పలికిన 32 అక్షరాల ఈ అనుష్టుప్ ఛంద

శ్లోక విషయమే వేదమాత పై 6, 7 మంత్రాలలో సూచిస్తోంది.

Poetry is the spontaneous overflow of powerful feelings
It takes its origin from emotion recollected in tranquility

-Wordsworth

"భావోద్రేకం నుండి తత్కాలం పెల్లుబికే అనుభూతుల సద్యః స్రవంతే కవిత్వం. ఇది స్పందనోద్రేకాల నుండి ప్రభవించినా ప్రశాంత సమయాలలో తిరిగి స్మరించి సేకరించబడుతుంది" అంటాడు వర్డ్స్‌వర్త్.

క్రౌంచ పక్షులపై జరిగిన హింసను నిమిత్తంగా చేసుకొని వాల్మీకి మనస్సులో ప్రభవంచిన భావోద్రేకం రామాయణ రచనకు బీజమైంది.

"వాల్మీకినా చ యత్ప్రోక్తం రామోపాఖ్యాన ముత్తమం
బ్రహ్మలోక స్థితం తచ్చ శతకోటి ప్రవిస్తరం
ఆహృత్య నారదేనైవ వాల్మీకాయ నివేదితమ్"

వాల్మీకి చేత రచింపబడి బ్రహ్మలోకంలో శతకోటి ప్రవిస్తరంగా ఉన్న రామాయణాన్ని నారదుడు తీసుకువచ్చి బ్రహ్మ శాపవశాన మళ్లీ జన్మించిన వాల్మీకికి ఉపదేశించినట్లుగా, స్కాంద పురాణంలోనూ, నారద పురాణం లోనూ కనిపిస్తుంది.

ఈ నారద ఉపదేశం తరువాతే వాల్మీకి స్నానార్థమై తమసా నదికి వెళ్లి ఆ దృశ్యం చూడటం జరిగింది.

ఆశ్రమానికి తిరిగివచ్చిన వాల్మీకికి తన నోటినుండి పలికిన ఆ శ్లోకానికి అనేకార్థాలు గోచరించడం మొదలుబెట్టాయి. 'మా' అంటే లక్ష్మి అని అర్థం. నిషాదుడంటే ఆవిడతో నిషేదనం (కూర్చొనేవాడు) చేసేవాడు అంటే నారాయణుడు అని అర్థం. అంటే "ఓ లక్ష్మీనారాయణా! నువ్వు మండోదరీ రావణులనే దంపతుల నుండి కామమోహితుడైన రావణాసురుణ్ణి సంహరించావు. అందువల్ల అనేక సంవత్సరములు నీవు కీర్తిని పొందగలవు" అని ఒక అర్థం. నిషాద శబ్దానికి ప్రపంచస్థితికి భంగం కలిగించే అధర్మం

అని అర్థం చెప్పే వీలుంది. ఓ అధర్మమా! నువ్వు సీతారాములనే దంపతుల నుండి ఒకరిని హరించావు కనుక, అనేక సంవత్సరాలు నువ్వు స్థిరంగా ఉండకుందువు గాక అని ఇంకొక అర్థం.

ఈ శ్లోకంలో అనేకార్థాలు స్ఫురించడమే కాదు అందులో సప్త స్వరాలు కూడా గోచరిస్తాయని, మొదటి అక్షరాలు క్రౌంచనాదా (మధ్యమం) నికి సంబంధించిన రాగ స్వరాలను సూచిస్తాయని సంగీత విద్వాంసు లంటారు.

కృత్స్నం రామాయణం ప్రాహకావ్యం బాలకయో ర్మునిః
తౌ గత్వా రాఘవ సదశ్చా మశ్వమేధే మహాక్రతౌ
అగాయేతాం కథాం పుణ్యాం తావుభౌ మునిరూపిణౌ

రామాయణ మహాకావ్యాన్ని వాల్మీకి లవకుశల కుపదేశించాడు. వారు మునిరూపధారులై అయోధ్యాపురికి వెళ్లి శ్రీరామచంద్రుడు చేస్తున్న అశ్వ మేధయాగ క్రతువులో చక్కగా దాన్ని గానం చేశారు.

అనడంలో రామాయణంలోని సంగీతం యొక్క ప్రాముఖ్యత కూడా మనకు తెలుస్తుంది.

రామాయణ మహాకావ్యంలో నవరసాలు కనిపించినప్పటికీ కరుణా రస ప్రాధాన్యత గల్గిన ఈ శ్లోకం నుండే జన్మించిన రామాయణం కూడా కరుణారస ప్రధానమైందే.

మూడువందలమంది భార్యలు, ముగ్గురు పట్టపురాణులు కల్గినప్పటికి సంతానం లేని దశరథుడు, గురు అనుగ్రహం కొరకు తాపత్రయపడటం, వసిష్ఠుడు కరుణించడంతో ప్రారంభమైన రామాయణం, తీర్థయాత్రల దర్శనం చేత వైరాగ్యవంతుడై నిద్రహారాలు మాని శుష్కించిపోతున్న రాముణ్ణి, రాక్షససంహారం కొరకు పంపమని అడగటానికి వచ్చిన విశ్వా మిత్రుడి ప్రవేశంతో కరుణా సముద్రంలో ముంచివేస్తుంది. మళ్లీ పసుపు బట్టలతో ఇంటికి తిరిగివస్తున్న రాముడిపై కర్కశంగా విజృంభిస్తున్న కాలరూప పరశురాముడి పాత్రతో కంటికి నీరు తెప్పిస్తుంది. ఇక కైకేయి

వరాలనే వరదలలో కొట్టుకుపోని కఠిన హృదయులుండరు, భరతుడి పరితప్తత కొండ శిలలనే కరిగింపజేస్తుంది. రాముడి వియోగంతో ఆక్రోశించే దశరథుడి అంత్యఘడియలు చకోరాన్ని తలపింపజేస్తాయి. అరణ్యవాసంలో సీతారాముల కష్టాలు అడుగడుగునా కంటికి నీరు తెప్పిస్తాయి. ఇక సీతాపహరణ సమయం నుండి హనుమంతుడు 'చూశా సీతను' అనే వరకు రాముడు కరిగి కరుణామయుడై కనిపిస్తాడు. అందుకే కాళిదాసు కూడా రఘువంశంలో "శ్లోకత్వ మాపద్య మస్యశోక:" క్రౌంచ ద్వంద్వ వియోగం నుంచి ఉద్భవించిన శోకమే శ్లోక రూపాన్ని సంతరించుకుంది అంటాడు.

అసలు భక్తికి, భక్తుడికి కూడా ఆధారమైంది కరుణరసమే. భగవద్గీత లోని భక్తుల లక్షణాలు చూడండి. 1. అద్వేష్టా సర్వభూతానాం అన్ని భూతాల ఎడ అంటే పంచభూత నిర్మితమైన సర్వప్రాణుల యడ ద్వేషం లేకుండా ఉండటం భక్తుడి మొదటి లక్షణం. రావణవధ తరువాత క్రోధితుడైన విభీషణుడు రావణుని శవానికి అంత్యసంస్కారాలు చేయ నిరాకరిస్తాడు. అప్పుడు రాముడతడితో....

మరణాన్తాని వైరాణి నివృత్తం న: ప్రయోజనమ్ ।
క్రియతా మస్య సంస్కారో యమాప్యేష యథా తవ ॥

"మృత్యువు తోటే వైరాలు అంతమైపోతాయి. కనుక శత్రుత్వాలు తిరిగి తోడబోకు. రావణుడు నీకెంతగా సోదరుడో నాకూ అంతే సోదరుడు కనుక అతడి దహన సంస్కారాల కొరకై ఏర్పాటు చెయ్యి" అంటాడు.

తన భార్య నపహరించిన వాడిని కూడా సోదరభావంతో స్వీకరించ గలగటమే ద్వేషరాహిత్యము. ఇక అటువంటి వ్యక్తి ఈ సృష్టిలో ఎవ్వరిని ద్వేషించగలడు?

రెండవ భక్తి లక్షణం - మైత్రీ భావన. "మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన" మైత్రీభావంతో దగ్గరికి వచ్చిన వాణ్ణి ఎట్టి పరిస్థితిలోనూ త్యజించకూడదనేది రాముడి ప్రతిజ్ఞ. విభీషణ శరణాగతి

లోనూ, గుహుడిని ఆదరించటం లోనూ, జయంతుడిని (ఇంద్ర కుమారుడు - కాకాసురుడు అంటారు) క్షమించటంలోనూ ఆ మైత్రీ లక్షణం రామునిలో కనిపిస్తుంది. కాగా మూడవ లక్షణమైన 'కరుణ' యే అన్ని భక్తి లక్షణాలకు ఆధారమైంది. కరుణ లేనివాడు ద్వేషాన్ని వీడలేడు. మిత్రుడు కూడా కాలేడు. పైగా నాల్గవ గుణమైన "మమతా రాహిత్యము" అంటే నాది కాదు అనే భావం కరుణారహితమైనదైతే కర్కశమై, సీతాపహరణం జరిగితే తనకు సీతపై ఎటువంటి మమత్వం లేదు కనుక ఆవిడ కొరకు వెతికే పనికూడా లేదనే కసాయితనంగా మారి ఉండేది. కనుక మమతారహితుడైన రాముడు కేవలం కరుణచేతనే సత్యాన్వేషణలో పురోగమించాడనవలసి వస్తుంది. కనుక కరుణ కేవలం రామాయణ మహాకావ్యరసంగా మాత్రమే కాక భక్తిరసంగా కూడా పేర్కొనవచ్చు.

"పురాతన వేదాన్ని ఎరిగిన వాడై, దివ్య దృష్టి పొందినవాడై ఆయన (వాల్మీకి) యంత్రాన్ని నిర్మించినట్లుగా రామాయణాన్ని రచించాడు" అంటోంది శ్రుతిమాత. అది ఎలాగంటే....

మం॥

**భద్రో భద్రాయ సచమాన ఆగాత్ స్వసారం జారో అభ్యేతి పశ్చాత్**
**సుప్రకేతైర్ద్యుభిరగ్ని ర్వితిష్ఠన్, రుశద్భిర్వర్ణైరభి రామ మస్థాత్॥**

(ఋగ్. 10-3-3, సాయం 1548)

భద్రుడు (రామభద్రుడు) భద్రతో (సీతతో) వనానికి వచ్చాడు. జారుడైన రావణుడు సోదరిని దుష్టబుద్ధితో సమీపించాడు. ఆకాశాన్నంటే హర్మ్యాలు అగ్నికి ఆహుతయ్యాయి. భయంకరమైన వాహినులతో రాముడు (రావణుని) ఎదుర్కొన్నాడు.

ఋగ్వేదంలోనూ, సామవేదంలోనూ కనిపించే ఈ మంత్రమే శ్రీరామకథకు బీజం లాంటిది. దీని నాలుగు పాదాలలోనూ రామకథకు సంబంధించిన నాలుగు ప్రధాన ఘట్టాలు సంకేతించబడ్డాయి.

దీన్ని ఎరిగినవాడై వాల్మీకి వేదసారాన్ని రామాయణంలో నిహితం చేశాడు.

శ్లో॥ తేషు వేదస్థ వర్ణాని హ్యనులోమ విలోమశః
వర్ణ ప్రమాణానుసారేణ బుద్ధిమా నుద్ధరే న్ముదా ॥
(శివపురాణం)

"ఈ రామాయణ శ్లోకాలలో వేదంలోని వర్ణాలే అనులోమ విలోమాలుగా ఉన్నాయి. వర్ణ ప్రమాణానుసారంగా బుద్ధిమంతుడు ఈ మంత్రాలను ఉద్ధరించాలి" అంటుంది శివపురాణం.

ఈ విధంగా వేదసారాన్ని ఎరిగిన వాల్మీకి రామయణాన్ని యంత్రం లాగా నిర్మించాడు.

శ్లో॥ స్వప్యా త్రిదివసం భూమౌహ విష్యాశీ జపేరతః ।
ఇదం మే లిఖితం యంత్రమిష్టం తత్కీదృశం ప్రభో ॥

శుభ ముహూర్తాన ఇష్టదైవాన్ని పూజించి, మంత్రం జపిస్తూ కేవలం హవిష్యాన్నాన్ని భుజిస్తూ మూడు రోజులు నియమంగా భూమిపై శయనిస్తూ "హే పరమాత్మా! నా ద్వారా లిఖించబడ్డ ఈ యంత్రం ఏ విధంగా ఉంటుంది" అని ప్రార్థించాలి. అని మంత్ర మహోదధి యంత్ర నిర్మాణ ప్రకరణంలో చెబుతుంది.

అలాగే అనేక నిగూఢార్థాలు కలిగిన అనుష్టుప్ ఛందశ్లోకం యంత్రంలాగా తననోటి నుంచి ప్రకటించబడగానే - ఇది ఏమిటి? ఇలా ఎందుకైంది? అని ప్రశ్నిస్తూ వాల్మీకి ఆశ్రమం చేరగా ఆయన ముందు చతుర్ముఖ బ్రహ్మ ప్రకటమైనాడు. "పునరన్తర్గతమనా భూత్వా శోక పరాయణః" ఆ ప్రశ్నలే మళ్లీ బ్రహ్మను అడిగి తిరిగి చింతలో నిమగ్ను డైనాడా మహర్షి.

దానిని సరియైన శ్లోకంగా నిర్ధారించి, సరస్వతే దాని ప్రేరకురాలుగా తెలియజేసి, నారదుడి నుండి విన్న కథను ఇక కావ్య రూపంలో మలచమని చెప్పి, అతడేమి వ్రాసినా ఇక అది అనృతం (అసత్యం) గా కారాదని వర మిచ్చి బ్రహ్మదేవుడు అంతర్ధానమైనాడు.

రామాయణ మన్న పదానికి రాముడి నివాసమని అర్థం. ఆరు

కాండలు అంటే ఐదు గదులు కలిగిన యంత్రం లాంటి రామాయణం అనే ఇంట్లో రాముడు నివసిస్తాడు.




"దక్షిణే లక్ష్మణోయస్య" - దక్షిణ దిక్కున నిలచిన లక్ష్మణుడు బాలకాండకు ప్రతినిధి.

సేష సహస్రసీస జగకారన ।జో అవతరెఉ భూమి భయటారన ॥
రఘుపతి కీరతి విమల పతాకా ।దండ సమాన భయ ఉజస జాకా ॥

వేయి తలలు గల్గిన ఆదిశేషుడే ఈ లక్ష్మణుడు. భూ భారాన్ని తగ్గించడానికి ఇలా అవతరించాడు. రామచంద్రుడి పవిత్రమైన కీర్తి అనే పతాకానికి ఈయన దండం (కఱ్ఱ) లాంటి వాడు అంటారు శ్రీ తులసీ దాసు లక్ష్మణ వందన మాచరిస్తూ.

ధ్వజం ఎంత ఖరీదైనదైనా కావచ్చు కానీ దానికి ఉన్న కఱ్ఱ వంకరగా ఉంటే దాని ధర పడిపోతుంది. దండం కఠోరంగా అగుపిస్తుంది. ఎవరికీ తలవంచదు కానీ ఇది అహంకారం మాత్రం కాదు. ఎంత కఠినంగా ప్రవర్తించినా తన తలపై పతాకముంటే అది వందనీయం, దాని ప్రవర్తన లోని కఠోరత అంతా భగవత్ సమర్పితమే. గాలికి రెపరెపలాడుతూ మన కంటికి పతాకం కనిపించినా దానికి ఆధారమైంది మాత్రం ధ్వజమే. అలాగే

లక్ష్మణుడు బాలకాండ రూపంలో ధ్వజమై నిలిచాడు. కాలరూప లక్ష్మణుడు మృత్యుస్థానమైన దక్షిణానికి అధిపతి.

రామచరణ పంకజమన జాసూ ।
లు బుధ మధుప ఇవ తజయిన పాసూ ॥

మకరంద లోభంతో తిరుగాడే తుమ్మెద లాగా ఎవరి మనస్సయితే శ్రీరామచంద్రుడి చరణ కమలాలను నిరంతరం ధ్యానిస్తూ ఉంటుందో అటువంటి భరతుడికి నమస్కారం.

రామరాజ్య స్థాపన అనే దశరథుడి స్వప్నానికి సాకార రూపం ఇవ్వడానికి భరతుడు చేసిన కృషే అయోధ్యకాండ యొక్క సారం.

"ప్రేమ అమి అమందరు బిరహు, భరతు పయోధి గంభీర"

గంభీర సముద్రమైన భరతుడి హృదయంలో దాగున్న రామప్రేమ అనే అమృతం, విరహమనే మంథరపర్వతంతో చిలకబడటం వల్ల ప్రకట మైంది అంటాడు శ్రీ తులసి.

కైకేయి వరాలను నిమిత్తం చేసుకొని ప్రకటమైన రామ వనవాస విహారం భరతుడి హృదయాన్ని కలచివేయకపోతే ఆయన హృదయంలో రాముడిపై ఎంత ప్రేమ ఉందో ఏనాటికీ విదితమయ్యేది కాదు.

సూర్యవంశ రాముడు ఉదయించేది తూర్పునయినా, అస్తమించేది పడమరనే. భరతుడు ఆజ్ఞాపించేట్టయితే అధర్మమైనప్పటికీ తాను తిరిగి రాజ్యం చేపడతానంటాడు శ్రీరాముడు. అంతగా రాముడు భరతుడి వైపు ఒరిగిపోతాడు. పరమాత్మనే తనలో లీనం చేసుకోగల ప్రేమ హృదయుడు భరతుడు. అందుకే సూర్యుని లాంటి రాముడిని తనలో దాచుకోగలిగిన భరతుడు పడమటి దిక్కు.

"వామేచ జనకాత్మజా" రాముడికి వామభాగంలో (ఉత్తర దిక్కున) సీతమ్మ నిలిచి ఉంటుంది.

శ్లో॥ కిం కరిష్యసి రామేణ నిఃస్పృహేణ సదా త్వయి ।
త్వయా సదాలింగితోఽపి సమీపస్థోఽపి సర్వదా ॥

ఇక నీకు రాముడితో ఏంపని? ఆయన ఎప్పుడు నీతో ఉదాసీనంగా ఉంటాడు. సదా నీ వెంట ఉంటూ కూడ, నీ పరిష్వంగంలో ఉంటూ కూడా, అతడికి నీతో స్నేహం కలగలేదు. ఆ నిస్పృహుడితో నీకేం పని? అని రావణుడు అశోకవాటికలోని సీత నుద్దేశించి అంటాడు. ఆధ్యాత్మ రామాయణం లోని ఈ శ్లోకానికి కొందరు టీకాకారులు -

"నీవు సాక్షాత్తు యోగమాయవు, పరబ్రహ్మ రాముడితో నీ సహవాసం, అతడితోనే నీ తాదాత్మ్యం, అయినా ఆయన నీతో అసంగుడు" అని అంతరార్థం చెబుతారు.

రావణాసురుడు శ్రీరాముడిని పరబ్రహ్మగా ఎరిగి కూడా ఆయనను చేరటానికి తన రాక్షస తమోగుణ శరీరం ఉపకరించదని భావించి దానికన్నా పరమాత్మ చేతిలో హతమయి మోక్షం పొందటమే ఉత్తమమని భావించి సీత నపహరించాడని, శ్రీరామ దూషణ నెపంతో ఆయన నిర్గుణతత్త్వ విశ్లేషణ చేస్తున్నాడని కొందరు టీకాకారులు చెబుతారు.

కాబట్టి సదా వామభాగంలో ఉంటూ అరణ్యకాండకు నాయికయై రామాయణ కథాగమనానికి స్ఫూర్తి నిచ్చే సీతమ్మ సాక్షాత్తు యోగమాయ. ఎల్లకాలం రాముడి వెంటనుండే ఈ విద్యామాయ ఉత్తర దిక్కున నిలిచి ఉంటుంది. అంటే సాధకులు బాగా తరించటానికి సహాయపడుతుంది. (ఉత్+తరణం = చక్కగా తరింపజేయటం).

"పురతః మారుతీ" సూర్యవంశ ప్రదీపుడి కీర్తిని చాటే ఆంజనేయ స్వామి తూర్పు దిక్కున నిలిచి కిష్కింధ, సుందరకాండలకు నాయకుడై, "రామదువారే తుమ్ రఖ్‌వారే" రామసాయుజ్యానికి సింహద్వార రక్షకుడై ఉన్నాడు.

మహబీర బినవఉ హనుమానా ।
రామ జాసు జసు ఆప బఖానా ॥

అందరి చేతా కీర్తించబడే శ్రీరాముని చేతనే కీర్తించబడ్డ ఓ ఆంజనేయా! మహావీరా! నీకు వినయంతో నమస్కరిస్తున్నాను అంటాడు తులసి.

మేము నీ వాళ్లము మమ్మల్ని స్వీకరించమని మనం పరమాత్ముని వేడు కుంటాం. ఆయన మనను స్వీకరించాడో లేదో మనకు తెలియదు కానీ ఆంజనేయస్వామికి తానే ఋణపడి ఉన్నానంటాడు శ్రీరామచంద్రుడు, ఇంతగా రాముడి చేత ఆంజనేయస్వామి ప్రేమించబడటానికి కారణం సీతమ్మ వరం అంటారు పెద్దలు.

"కరహు బహుత రఘునాయక ఛోహూ! "

శ్రీరాముడు నీపై కృపజూపు గాక (ప్రేమించుగాక) అంటూ అశోకవాటికలో తనను దర్శించిన ఆంజనేయస్వామికి అమ్మవారు వరమిచ్చారు.

ఈ విధంగా రామసూర్యోదయానికి మూలమై (రఘురాముడి విభూతిని చాటి చెప్పే) చిరంజీవిగా నిలిచిన ఆంజనేయస్వామి తూర్పు దిక్కున రక్షకుడై నిలిచాడు.

"తం వందే రఘునందనం" కుడి ప్రక్కన (దక్షిణం) లక్ష్మణుడు వింజామర వీస్తుండగా, వెనుక వైపు (పడమట) భరతుడు ఛత్రం పట్టగా ఎడమవైపు (ఉత్తరాన) యోగమాయ సీతమ్మ పరివేష్టించి ఉండగా ముందు భాగాన (తూర్పున) చరణసేవ చేస్తూ ఆంజనేయస్వామి కూర్చొని ఉండగా మధ్యలో లంకాకాండ (యుద్ధకాండ) కు ప్రతినిధియై రాక్షస సంహారం చేసిన రఘునందనుడికి నమస్కారం.

ఇదే వాల్మీకి యంత్రం లాగా రామాయణాన్ని రచించిన విధానం.

వాల్మీకి నోట పలికిన "మానిషాద" అనే శ్లోకం కూడా యంత్రం లాగా గుహ్యమై మొత్తం రామాయణ సప్తకాండలను సూచిస్తోంది అంటారు పెద్దలు. అది ఎలాగంటే "మానిషాద" శ్రీనివాసుడా (సీతారామ) అనటంవల్ల సీతాకల్యాణంతో ముగిసే బాలకాండ కథ సూచించబడింది. "ప్రతిష్ఠాం త్వమగమః" అనటం వల్ల పితృవాక్య పరిపాలనం వల్ల లభించిన సుకీర్తిని ప్రతిపాదించే అయోధ్యకాండ సూచించబడింది. "శాశ్వతీస్సమాః" అనటం వల్ల ఋషి సంఘం కొరకు ప్రతినబూని చిరకాలం రాముడు అరణ్యంలో తిరగటం అనే అరణ్యకాండ కథ సూచించబడింది. "క్రౌంచమిథునము"

అనటం వల్ల "కృంచ" ధాతువును తీసుకుంటే కృశించి ఉన్న (అరణ్యా వాసంవల్ల) సీతారాముల ద్వంద్వం నుండి సీతను అవధీః=పీడించావు అనే అర్థం వస్తుంది. దీని ద్వారా సీతారాముల వియోగ దుఃఖాన్ని విశేషంగా వర్ణించే సుందరకాండ కథ సూచించబడ్డాయి. అలాగే మళ్లీ "క్రౌంచ మిథునము" లో క్రౌంచ=కుటిల అనే అర్థం తీసుకోవటం వల్ల రావణ మండోదరులలో కామమోహితుడై సీత నపహరించిన రావణుని అవధీ= సంహార కథ కల్గిన లంకా (యుద్ధ) కాండ సూచించబడింది. తిరిగి "క్రౌంచ మిథునము" లో కామమోహితం=తాపసులను, అరణ్యా ఆశ్రయాలను చూడాలనే కోరిక చేత మోహించబడ్డ సీతను అవధీః= పీడించావు అనే అర్థంతో ఉత్తరకాండ కథ సూచించబడిందని పెద్దలంటారు.

"తస్మాత్తు మిథునాదేకం పుమాంసం పాపనిశ్చయః
జఘాన వైరనిలయో నిషాద స్తస్య పశ్యతః"

సమస్త జీవుల పైన సహజవైరం గల పాపబుద్ధిగల కిరాతకుడొకడు వాల్మీకి మహర్షి చూస్తుండగానే, అది ఆ పక్షుల క్రీడా సమయం అనే తలంపు లేకుండా ఆ రెంటిలో పురుషపక్షిని బాణంతో కూల్చివేశాడు.

జలంధరుడనే రాక్షసుడు విజృంభించి ముల్లోకాలను బాధపెడు తుంటే ఆ విషయం దేవతలు శివుడితో మొరపెట్టుకున్నారు. ఆయన ఆ రాక్షసుడితో తలపడగా ఎంతకాలం యుద్ధం చేసినా, వాణ్ణి చంపడం సాధ్యం కాలేదు. అందుకు అతడి భార్య వృంద (తులసి) పాతివ్రత్యమే కారణమని తెలిసి విష్ణువు జలంధర రూపంలో వెళ్లి ఆమెను కలుస్తాడు. ఈ విధంగా పాతివ్రత్యం అంతం కావటంతో అక్కడ జలంధరుడు శివుడి చేతిలో మరణిస్తాడు. మోసాన్ని గ్రహించిన వృంద తనకు భర్తృ వియోగాన్ని కలిగించిన విష్ణువు కూడా భార్యావియోగంతో బాధపడతాడని శపించి ప్రాణాలు విడుస్తుంది. ఆ వృందా జాలంధరులే తిరిగి క్రౌంచ మిథునంగా జన్మించారు.

నారదుడి ద్వారా రామకథను విన్న వాల్మీకి దాన్నొక కావ్యంగా

మలచబోతున్నాడని ఎరిగి రామాయణ మహాకావ్య రచనకు ప్రధాన రసమైన కరుణ ఆయనలో ఉందో లేదో పరీక్షించటానికి, వృంద శాపాన్ని స్వీకరించ టానికి విష్ణువే స్వయంగా నిషాదరూపంలో అక్కడకు వచ్చి వాల్మీకి చూస్తుండగా క్రౌంచ పక్షి రూపంలో ఉన్న రాక్షసుణ్ని సంహరించి వాల్మీకి ద్వారా శాపాన్ని స్వీకరించాడు.ఆ శాపమే మంగళప్రదమై రామాయ ణావిర్భావానికి మూలమై నిలిచింది.

ఈ విషయమే స్కాంద పురాణ పాతాళ ఖండం అయోధ్యా మాహాత్మ్యం లో వర్ణించబడింది. శాప వాక్యాలను పలికిన హృదయ సంతాపంతో కూడి ఉన్న వాల్మీకి సమీపానికి బ్రహ్మ వచ్చి ఇలా అన్నాడు.

శ్లో॥ ప్రాచేతసేన మునినా రామో రాజీవలోచనః ।
తమసోపవనే శప్తః వేషధృ గ్జానకీపతిః ॥

ఓ వాల్మీకి మునీంద్రా! నిషాద రూపంలో వేటకు వచ్చినవాడు శ్రీరాముడు, కేవలం నిషాదుడు కాడు. శ్రీరామచంద్రుణ్ణి వర్ణించడం వల్ల నీవు పుణ్య శ్లోకుడివి కాగలవు.

ఈ విధంగా అప్రయత్న పూర్వకంగా వాల్మీకి మహర్షి నిమిత్తంగా చేసుకుని బయటకు వచ్చిన అనుష్టుప్ ఛంద శ్లోకం, యంత్రం లాగా గుహ్యమైన రామాయణ మహాకావ్యంగా భూమిపై వెలిసింది.

అవతారిక :

ఏ విధంగా ఈ భూమిపైన రామాయణ మహాకావ్యం వెలిసిందో 6, 7 మంత్రాలలో వర్ణించిన తరువాత ఎందరో కవులు, ఎన్నో కావ్యాలు, ఉత్ గ్రంథాలు వ్రాసిన తరువాత కూడా, శ్రీరామాయణాన్ని వ్రాసిన తరువాతే ఎందుకు తృప్తి పడతారో శ్రుతి 8వ మంత్రంలో వివరించబోతోంది.

8. మంత్రం

**సహస్రధారే వితతే పవిత్ర ఆ వాచం పునన్తి కవయో మనీషిణః ।**
**రుద్రాస ఏషామిషిరాసో అద్రుహః స్పశః స్వంచః సుదృశో నృచక్షసః ॥**

(ఋగ్ - 9-73-7)

జితేంద్రియులు, మనీషులు, కావ్యాలు రచించడంలో సమర్థులైన కవులు నలుదిక్కుల వ్యాప్తమై ఉన్న పరమాత్మయొక్క అనంత ప్రవాహం లో తమ వాణిని పవిత్రం చేసుకుంటారు. అంటే వారు ప్రకృతి తమకు ఇచ్చిన శక్తితో భగవత్కీర్తన చేస్తారు. ఈ కవుల మధ్యన పూజితుడు, ద్రోహరహిత సీతాన్వేషకుడు (ఇతర వానరాల లాగా సీతాన్వేషణను మధ్యలో విడవని వాడు) అద్భుత గమనం కలవాడు, సమ్యకే పరీక్షకుడు (దేవతల ద్వారా పంపగా వచ్చిన సురస చేత బాగా పరీక్షింపబడినవాడు), తన చర్మనేత్రాలతో సీతామాతను దర్శించినవాడు అయిన ఆంజనేయు డున్నాడు. వాల్మీకితో సమానంగా ఈయన కూడా ఒక రామాయణాన్ని రచించాడు.

"రామ్, తుమ్హారా చరిత్రస్వయం హీ కావ్యహై ।
కోయీ కవి బడ్ జాయ్ సహజ సంభావ్యహై ॥

హే రామచంద్రప్రభో! నీ చరిత్రే కావ్యమయ్యా! దాన్ని ఆశ్రయించిన వాడెటువంటి వాడైనా సరే 'కవి' కావడం సహజమైన పరిణామమయ్యా! అంటాడు మైథిలీ శరణ్‌గుప్త "సాకేత్" అనే తన రచనలో. శ్రీరాముడి గుణగణాల చేత ఆకర్షించబడనివారుండరు. అందుకే మురారి అనర్ఘరామాయణంలో

"యదిక్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్య చరితమ్,
గుణైరేతావద్భిః జగతి పునరన్యో జయతి కః"

"రామచరితం ఇదివరకే చాలామంది చేత వ్రాయబడిందని దాన్ని విడిస్తే, మరి అటువంటి గుణగణాలతో శోభిల్లే వారి లోకంలో ఇంకెవ్వరున్నారు?" అంటాడు.

స్వసూక్తీనాం పాత్రం రఘుతిలకమేకం కలయతాం।
కవీనాం కో దోషః సతు గుణగణానా మవగుణః॥

"శ్రీరామచంద్రుణ్ణి ఒక్కణ్ణే తన కావ్య సూక్తులకు పాత్రుడిగా చేసుకోదలిచే కవులలో ఎటువంటి దోషము లేదు! ఇది శ్రీరామచంద్రుడి గుణగణాల

దోషమే" అంటాడు జయదేవుడు ప్రసన్న రాఘవ నాటకంలో.

భోజుడు రామాయణ చంపులో "గంగను లోకానికి తెచ్చిన వాడు భగీరథుడు గదా! అతడి గంగాజలంతో మన పితృదేవతలకు కూడా తర్పణం విడవడమెందుకు అని మానివేసేవారుంటారా?" అంటూ ప్రశ్నిస్తాడు.

మఱల నిదేల రామాయణం బన్నచో
నీ ప్రపంచక మెల్ల నెల్ల వేళ
దినుచున్న యన్నమే తినుచున్న దిన్నాళ్ల
తన రుచి బ్రతుకులు తనవి గాన
చేసిన సంసారమే సేయుచున్నది
తనదైన యనుభూతి తనది గాన
తలచిన రామునే తలచెద నేనును
నా భక్తి రచనలు నావి గాన
కవి ప్రతిభలోన నుండును గావ్య గత శ
తాంశముల యందు దొంబది యైన పాళ్లు
ప్రాగ్వి పశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథా ధృతిని మించి"

అంటారు రామాయణ కల్పవృక్షంలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు.

"జానకీ జాని కథల్ వచింపక యసత్కథలెన్ని రచించెనేనియున్ వాని వివేకమేటికి, వాని కవిత్వ మహత్త్వ మేటికిన్" అంటారు కంకంటి పాపరాజు ఉత్తర రామాయణంలో.

కాశీకి వెళితే అక్కడ అనేక మురుగు కాలవలు వచ్చి గంగలో కలవడం కనిపిస్తుంది.గంగను చేరిన ఆ నీరు కూడా గంగగానే పిలవ బడుతుంది గాని మురుగు నీరుగా వ్యవహరించబడదు.కాబట్టి రాముడి కీర్తిని పెంచడం కొరకు కాదు కవులు, భక్తులు రామాయణాన్ని రచించేది - కేవలం తమ వాణిని పవిత్రం చేసుకోవడానికే వారు ఈ కథను గానం చేస్తారు.

భవసాగర చహపార జొపావా ।
రామ కథాతా కహు దృఢ నావా ॥

భవ (సంసార) సాగరాన్ని దాట దలిచినవారికి, రామకథ దృఢమైన నావ లాంటిది అంటారు శ్రీ తులసీదాసు.

భగతిహేతు బిధి భవన బిహాఈ ।
సుమిరత సారద ఆవహిధాఈ ॥

కవులు స్మరించగానే సరస్వతి భక్తివశమై బ్రహ్మలోకాన్ని విడిచి పరుగెత్తకు వస్తుంది.

సరస్వతి బ్రహ్మను (భర్తను) విడిచి అంటే పాతివ్రత్యాన్ని కూడా త్యాగం చేసి, గోపికలు కృష్ణుణ్ణి చేరవచ్చినట్లుగా రామకథాగానం కొరకు వస్తుంది. సర్వధర్మాలను విడిచి కేవలం పరమాత్మను అందుకునే విధం గనుక రామకథకు సరస్వతి అంత ప్రాధాన్యత నిస్తుంది.

ఇంకొకరకంగా చెప్పాలంటే బిధి (విధి) అంటే వాడి అదృష్టంలో సరస్వతీ కటాక్షం (విద్య) లేకున్నా సరే, ఆ వ్యక్తి రామకథాగానానికి గనుక పూనుకుంటే వెట్టిగొల్లడిని కాళిదాసుగా మార్చినట్లు, లేదా కిరాతకుడి నుండి మహర్షి (వాల్మీకి) ని పుట్టించినట్లు, సరస్వతి అనుగ్రహం లభిస్తుంది.

శ్లో ॥ ఝుటిత జగతీమాగచ్ఛన్త్యాః పితామహవిష్టపా న్మ
హతి పథి యో దేవ్యా వాచఃశ్రమః సమజాయత ।
అపి కథమసౌ ముంచదేనం న చేదవగాహతే రఘుపతి
గుణగ్రామ శ్లాఘా సుధామయ దీర్ఘికామ్ ॥ (ప్రసన్న రాఘవం)

బ్రహ్మలోకం నుండి అత్యంత వేగంతో భూమి మీదికి రావడం వల్ల సరస్వతికి కల్గిన మార్గాయాసం, రఘుపతి గుణగ్రామ కథా రూప అమృతగుండంలో స్నానం చేయనిది తగ్గుతుందా?

కానీ ఇలా శ్రమపడి వచ్చిన సరస్వతికి రామకథాకుండంలో స్నానం చేసే అవకాశం కలగకపోతే?...

"సిరధుని గిరా లగతి పఛితానా "

తల బాదుకొని బాధపడుతుంది.నీచులను పొగడడానికి, యాచించడానికి తనను వాడుకున్న వారిని శపిస్తుందట.

కనుక జితేంద్రియులైన కవులందరూ తమ వాణిని రామకథా గానంలో పవిత్రం చేసుకుంటారు. అలా ఎందరో పవిత్రులైనా కూడా, అందులో ఇద్దరు ముఖ్యులు.

శ్లో॥ సీతారామ గుణగ్రామ పుణ్యారణ్య విహారిణౌ ।
వందే విశుద్ధ విజ్ఞానౌ కవీశ్వర కపీశ్వరౌ ॥

"సీతారాముల గుణసమూహాలనే అరణ్యంలో విహరించే కవీశ్వర (వాల్మీకి) కపీశ్వరు (హనుమంతుడు)లకు నేను నమస్కరిస్తున్నాను" అంటారు శ్రీ తులసీదాసు.

శ్రీ తులసీదాసు జీవితకాలంలోనే ఆయన శిష్యుడు 'రామూ ద్వివేది" రామచరితమానసానికి (తులసీరామాయణానికి) ప్రేమ రామాయణమనే పేర సంస్కృతంలో టీక రచించాడు.

అందులో ఆయన ఒక విచిత్రమైన విషయం వివరిస్తాడు...

"ప్రేమరామాయణం పూర్వం, యత్కృతం వాయుసూనునా,
లిఖిత్వా నఖటంకై స్తత్కటకేషు మహీభృతమ్.
నాటకం శ్రావయా మాస, మునిం ప్రాచేతసం ముదా!
నాభినందిత దాతేన, నిజగ్రంథవిలోపనాత్,
న్యక్షిప న్మారుత: సింధౌ పర్వతాన్ గర్వవర్జిత:
తదేవ తులసీదాస రూపిణా వాయుసూనునా,
సుదేశ భాషయా సర్వం నిబద్ధం, పునరద్భుతమ్ ।
శ్రీరామ చరణాంభోజ ప్రేమదం క్షేమదం నృణామ్."

హనుమంతుడు బృహత్ రామాయణాన్ని నాటక రూపంలో అనేక శిలా ఫలకాల పైన రచించాడు. దాన్ని విన్న వాల్మీకికి దు:ఖం కలిగింది. ఈ రామాయణం గనుక ప్రజల ముందుకు వస్తే తన రామాయణాన్ని ఎవ్వరూ అభినందించరని బాధపడుతుంటే, ఆయనకు ఆనందం చేకూర్చడం కొరకు

..ర్వవర్జితుడైన ఆంజనేయస్వామి కొండల మీద, గండ శిలల మీద వ్రాయబడి ఉన్న తన రామాయణాన్ని అంతటినీ తన వాలంతో చుట్టి సముద్రంలో ముంచివేశాడు. ఆ హనుమంతుడే కలియుగాన తులసీ రూపాన అవతరించి దేశభాషలో (అవధి=అయోధ్యా నగర పరిసరాల్లో మాట్లాడే హిందీ) వ్రాశాడని, ఈ అద్భుత రామాయణం శ్రీరామచరణాలపై ప్రేమ పెంచి, ప్రజలకు క్షేమాన్ని కలిగిస్తుందని" వ్రాశాడు.

శ్రుతిమాత పై మంత్రంలో హనుమంతుడి గుణగానం చేస్తూ ఆయన రచించిన రామాయణాన్ని గూర్చి ప్రస్తావిస్తోంది. మరి ఆయన రామాయణం వాల్మీకి రామాయణం కన్నా మధురంగా ఉండటానికి కారణ మేమిటి? అనే ప్రశ్నకు శ్రుతిమాత తానే జవాబు చెబుతోంది..... "అందుకు కారణం తానే రామాయణంలో ఒక పాత్ర కావడం, స్వయంగా అన్ని విద్యలకు నిలయమైన ఆదిపరాశక్తి సీతామాతను చర్మచక్షువులతో దర్శించడం, ఆవిడచేత అనేక వరాలు పొందటం" అని

మహారాష్ట్ర దేశీయుడైన "ఏక్‌నాథ్ మహరాజ్" ఈ క్రింది వివరించే 31 రామాయణాల భావాన్ని గ్రహించి "భావార్థ రామాయణం" రచించాడు. 1. శివరామాయణం, 2. శైవాగమ రామాయణం, 3. పాంచరాత్రాగమ రామాయణం, 4. గుహ రామాయణం, 5. గుహ్యక రామాయణం, 6. హనుమద్రామాయణం, 7. కూర్మ రామాయణం, 8. వరాహ రామాయణం, 9. కాళికా ఖండాతర్గత రామకథ, 10. మహాకాళీ రామాయణం, 11. స్కంద పురాణం, 12. అగస్త్య రామాయణం, 13. పౌలస్త్య రామాయణము, 14. పద్మపురాణాంతర్గత రామకథ, 15. రవి రామాయణము, 16. అగ్ని రామాయణము, 17. వరుణ రామాయణం, 18. జటాయు రామాయణం, 19. మత్స్య రామాయణం, 20. నందిగ్రామస్థ భరత రామాయణము, 21. మహాభారతాంతర్గత రామకథ, 22. క్రౌంచ ద్వీపస్థ క్రౌంచర్షికృత క్రౌంచ రామాయణం, 23. పవిత్ర రామాయణం, 24. పవన రామాయణం, 25. విభీషణ రామాయణం, 26. నిత్య కథా నిరూపణ రామాయణం,

27. ధర్మర్షికృత ధర్మ రామాయణం, 28. శ్వేతద్వీప నివాసీ శ్వేతకేతు రామాయణం, 29. శివా (భవానీ) రామాయణం, 30. ఆత్మ రామాయణం, 31. జైమినీ రామాయణము.

ఈ విధంగా తయారైన భావార్థ రామాయణంలో ఏకనాథుల వారు సుందరకాండ ప్రసంగంలో "లంకానగరానికి చేరిన ఆంజనేయస్వామి వారికి అంతటా తెల్లపూలే కనిపించాయి" అని వ్రాశాడు. యథాప్రకారము సాయంకాలం ప్రవచనంలో ఆ విషయం చెప్పగా, కథాప్రవచన శ్రవణార్థమై మారువేషంలో వచ్చిన మారుతి లేచి నిలుచుని "అంతా అబద్ధం నాకు అక్కడ అన్నీ ఎఱ్ఱటి పూవులే కనిపించాయి, తెల్లటివి కనిపించలేదు" అన్నాడు. వచ్చినవాడు ఆంజనేయుడని గ్రహించి ఆయన దర్శనం వల్ల హృదయంలోనుండి ఉప్పొంగుతున్న ఆనందానికి ఆనకట్టవేసి, ఏకనాథుడు, లేదు అక్కడ అన్నీ తెల్లటి పూలే ఉన్నాయని వాదించాడట. ఇక ఈ విషయం ఇక్కడ తేలేది కాదని గ్రహించి ఆంజనేయస్వామి ఏకనాథుల వారిని తీసుకొని సాకేతపురానికి వెళ్లాడు. సీతారాముల వారు పర్యవేష్ఠించి యున్న సభాభవనం లోకి ఇద్దరూ అడుగుపెట్టి, తమ సమస్యను శ్రీరామ చంద్రుడి ముందుంచారు. స్వామివారు మాట్లాడక ముందే సీతమ్మ "మీరిద్దరి వ్యాఖ్య తప్పే, అక్కడ ఉన్నవన్నీ నీలం పూలే" అన్నదట. అప్పుడు స్వామివారు నవ్వుతూ అందరినీ సమన్వయం చేస్తూ" ఏకనాథుల వారు వ్రాసింది సరిగానే ఉంది. లంకానగరంలో మొక్కలమీద అన్నీ తెల్లపూలే ఉన్నాయి, కాకపోతే రావణుడిపైన పెరిగిన కోపం కారణంగా ఎరుపెక్కిన కండ్లుగల ఆంజనేయుడికి అవి ఎఱ్ఱగానూ, నా వియోగదుఃఖంతో నన్నే స్మరించే సీతమ్మకు నా వర్ణంలో (నీలంగా) ఆ పూలు కనిపించడం కూడా సహజమే" అన్నారట.

కనుక ఒక్క కవీశ్వర, కపీశ్వరులే (వాల్మీకి, హనుమ) కాదు వారితో పోటీపడి రామకథా కావ్య నిర్మాణంలో తమను తాము పునీతం చేసుకున్న మహానుభావులెందరో!

అవతారిక :

8వ మంత్రంలో భక్తులు, కవులు తమను తాము ఎలా రామకథా సరితలో పవిత్రం చేసుకుంటారో వివరించిన శ్రుతిమాత ఈ కథాగానం యొక్క ఫలితమేమిటో, దీనినుండి విడిపోయిన వారి గతి ఏమిటో 9-10 మంత్రాలలో వివరించబోతోంది.

9, 10. మంత్రాలు

**ఋతుస్య గోపా న దభాయ సుక్రతు స్త్రీ ష పవిత్రా హృద్యన్తరా దధే**
**విద్వాన్త్స విశ్వా భువనాభి పశ్యత్యవా జుష్టాన్విధ్యతి కర్తే అవ్రతాన్ ॥**
**ఋతస్య తన్తుర్వితతః పవిత్ర ఆ జిహ్వాయా అగ్రే వరుణస్య మాయయా**
**ధీరాశ్చిత్తత్స మినక్షన్త ఆశతాత్రా కర్తమవ పదాత్యప్రభుః ॥**

(ఋగ్ 9-73-8, 9)

భగవత్కీర్తన వల్ల ఆత్మతత్త్వ రక్షణ జరుగుతుంది. విద్యాప్రాప్తి వల్ల దీనత, దంభం అంతమవుతాయి. జ్ఞానం, దయ, శౌర్య గుణాలు హృదయంలో నివసిస్తాయి. అతడు ఆత్మజ్ఞుడై సంసారాన్ని వీక్షిస్తాడు, దీనులను రక్షిస్తాడు, యోగం చేత తన కర్మలను ధ్వంసం చేస్తాడు.

ఈశ్వర ప్రాప్తికై తంతు (సాధన) రూప రామాయణం వరుణ పుత్రుడైన ప్రచేతసుని జిహ్వచేత విస్తరించబడింది. ధ్యానవంతులు దీన్ని బాగా గ్రహించి పరమపదాన్ని పొందుతారు. ఎవరైతే ఈ రామకథా విషయంలో ఉదాసీనులై ఉంటారో వారు నరకాన్ని పొందుతారు.

ఆత్మ సాక్షాత్కారమైన జ్ఞానికి దీనత, దంభం రెండూ అంతరిస్తాయి. దీనత అనేది న్యూనతాభావం వల్లనూ, దంభం అనేది గర్వం చేత కలుగుతుంది. ఈ రెంటినీ అతి అనే చెప్పవచ్చు. తాము ఇతరుల కన్నా గొప్పవారం అనుకునే గర్విష్టులు ఇతరులను హింసించడం లో ఆనందాన్ని పొందుతారు. తాము ఎందుకూ పనికిరామనుకునే దీనభావం కలవారు ఇతరుల చేత హింసించబడటంలో ఆనందాన్ని పొందుతారు.

జ్ఞానస్థితి సాధారణమైనదేగాని అసాధారణమైంది కాదంటారు శాండిల్యుల వారు. ఎందుకంటే అది అందరిలోనూ ఉండే సహజస్థితి. అది పొందిన తరువాత పొందామని కూడా అనలేము. అది ఎల్లప్పుడూ, మన స్వభావంగా ఉన్నదని అప్పుడు తెలుస్తుంది. కనుక అతడిలో గర్వం కలుగదు. దీనత వదిలిపోతుంది. దంభం, దీనత రెండు కూడా అజ్ఞాని యొక్క స్థితులే.

అతడి హృదయంలోని ఈ స్వరూపజ్ఞానం దయ, శౌర్యం అనే రెండు రూపాల్లో ప్రపంచంలో ప్రకటమౌతుంది. జ్ఞానం వస్తువుకాదు, దాన్ని మనం ఇతరులకు చూపలేము. గొప్పగా ఉపన్యాసాలు ఇవ్వడం గానీ, శాస్త్రాలను వల్లించడం గానీ జ్ఞానం కాదు, కేవలం అది పాండిత్యమే. ఒక వ్యక్తి జ్ఞాని అవునో కాదో తెలుసుకోవడానికి ప్రపంచంలో ప్రకటమయ్యే అతడి గుణాలనే పరీక్షించాలి. మహాత్ముడి యొక్క జ్ఞానం సాటివారిపైన దయరూపంలోనూ, అధర్మాన్ని ఎదుర్కొనడంలో శౌర్య రూపంలోనూ ప్రకట మౌతుంది. ఈ లక్షణాలన్నీ రాముడిలో కనిపిస్తాయి.

"సిలా, సాప సంతాప విగతభయి, పరసత పావనపావు దయీ సుగత, సౌనహేరి హరషహియ - చరన ఛు ఎకొ, పఛితావు".

గౌతమపత్ని అహల్య తన పాద స్పర్శవల్ల శాపవిముక్తి పొందితే, సంతోషించడానికి బదులు, ఆ ఋషిపత్నిని కాలితో తాకితినే అని బాధ పడ్డాడట రాముడు. ఇదీ దంభరాహిత్యం.

"మైనారి అపావన ప్రభు జగపావన రావనరిపు జన సుఖదాఈ"

"స్వామీ! నేను అపవిత్రమైన స్త్రీని, జగత్తును పావనం చేసే ప్రభువులు మీరు, జనులకు సుఖాన్నిచ్చే ఓ రావణ శత్రువా! నీకు వందనం".

అంటూ తనకు నమస్కరిస్తున్న అహల్యను చూసి రాముడు సిగ్గుతో కుంచించుకుపోయాడట. అందుకు కారణమేమంటే, "అయ్యో! నేను వ్యభిచరించిన కారణం చేతనే కదా వృంద (తులసి) చేత శాపం పొంది

శిలగా (శాలిగ్రామం) మారింది. అదే కారణం చేత శిలగా మారిన అహల్యను ఉద్ధరించగల పవిత్రత నాలో ఉన్నదా?" అని సింహావలోకనం చేసుకోవడం మొదలెట్టాడట రాముడు.

తనలోకి తాను ఇలా తొంగి చూచుకోవడాన్నే స్వాధ్యయనం (స్వ= తనను, అధ్యయనం=చదవడం) అంటారు. లౌకికుడి దృష్టి వస్తుగతమై బహిర్ముఖంగా ఉంటుంది. అధ్యాత్మికుడి దృష్టి స్వగతమై అంతర్ముఖంగా ప్రవహిస్తుంది. అందువల్ల ఇతరుల మంచి చెడులు నిర్ణయించడంలో స్వదోషాలు మరిచే లౌకికుడిని దంభం ఆవరిస్తుంది. తనపైనే తనకు దృష్టి ఉన్న ఆధ్యాత్మికుడిని జాగరూకత వల్ల దంభం కబళించదు.

"కేవట మీతకహే సుఖమానతి - వానరబంధు బడాయీ"
హింసారత నిషాద తామసవపు - పసుసమా వనచారి.
ఛేంట్యో హృదయలగాయి ప్రేమబస - నహికుల జాతివిచారి
"జటాయు కీధూర్ి జటాన సో ఝూరీ!"
"ప్రభు తరుతర కపిడారపర, తేకియ ఆపు సమాన్
తులసీ కహూన రామసో, సాహిబ సీల నిధాన్".

బెస్తవాడైన గుహుడు మీ స్నేహితుడన్నాగాని, వానరులంతా మీ చుట్టాలన్నాగానీ ఎంతో ఆనందించేవాడు రాముడు. మృగాలను చంపుతూ, మాంసం తింటూ తామస ప్రవృత్తులై తిరిగే పశువుల లాంటి వనచారులను ప్రేమవశుడై, జాతి కుల విచక్షణ చేయక ఆలింగనం చేసుకునేవాడు. అంతేకాదు రావణుడి చేత హింసించబడి నేలకొరిగిన జటాయువు శరీరాని కంటిన ధూళిని తన జటతో శుభ్రం చేశాడు. చెట్టు క్రింద కూర్చున్న రాముడు చంచలప్రవృత్తులై తన నెత్తిమీద చెట్టుకొమ్మల్లో తిరుగాడే వానరులను సన్మానించి తనతో సమాన స్థాయినిచ్చాడు. (వారంతా రాముడి సేవకులమని చెప్పుకున్నా, రాముడు మాత్రం వారిని మిత్రులుగానే ఆదరించాడు).

ఇదీ దంభ రాహిత్యమంటే, అయితే సహాయమవసరమైనప్పుడు

దీనులైన ప్రజలు తమకన్నా నీచులకు ఉన్నతస్థానమిచ్చి నెత్తిన పెట్టుకోవడం ప్రపంచంలో సహజంగా కనిపించే విషయమే. కానీ రాముడలా దీనుడై వానరాలను నెత్తినపెట్టుకోలేదు. కేవలం వారిని దంభరాహిత్యం వల్ల అలా ఆదరించాడు. అందుకే తులసీదాసు రాముడిని ఒకచోట ఇంత స్నేహశీలుడిగా దంభరహితుడిగా వర్ణించినప్పటికీ మరొక చోట.....

"లవ, నిమేష, పరమానుజుగ, బరుష, కల్పనరచండ
భజసిన మనతెహి రామకో, కాలజాసు కోదండ!"

"శ్రీరాముడికి కాలమే కోదండం! క్షణాలు, నిముషాలు, సంవత్సరాలు, యుగాలు, కల్పాలు ఆయన సంధించే బాణాలు! ఓ మనసా! అటువంటి రాముడిని ఎందుకని భుజింపవు?'' అంటాడు.

అంటే ప్రాణులంతా కాలం చేతిలో ఆడించబడే తోలుబొమ్మలయితే, ఆయన కాలాన్నే తన చేతబట్టుకొనే భువనేశ్వరు డన్నమాట. అటువంటి వాడికి దీనత ఎక్కడిది?

ఈ విషయాన్నే ఇక్కడ శ్రుతిమాత దీనత అంతమై పోవడం లేదా శౌర్యం ఉత్పన్నం కావడం అనీ, దంభం అంతం కావడం లేదా దయ ఉత్పన్నం కావడం అని వర్ణిస్తోంది. ఈ లక్షణాలన్నీ కల్గిన రాముణ్ణి కీర్తించడం వల్ల (రామకథను సేవించడం వల్ల) భ్రమర కీటక న్యాయం ద్వారా ఆ సాధకులు రామ స్వరూపులౌతారని చెబుతోంది.

యోగం చేత తన కర్మలను ధ్వంసం చేసిన ఈ సాధకులు, ఆత్మజ్ఞులై సంసారాన్ని వీక్షిస్తారు. ప్రపంచ వ్యవహారంలో రామ రూపులైన వీరు రాముడి లాగా దీనులను రక్షిస్తారు.

"నాథ దసానన కరమైభ్రాతా! నిసిచర వంస జనమసురత్రాతా ।
సహజ పాపప్రియ తామసదేహా! జథాఉతాకహి తమపరనేహా" ॥

ఇక్కడ విభీషణుడు రాముడితో తన దీనత్వాన్ని విన్నవించు కుంటున్నాడు. పరమాత్మను చేరడానికి కావలసిన అర్హతలు 1. పవిత్రమైన జన్మ, 2. చక్కని స్వభావం, 3. సత్సంగ సేవనం, 4. సాధన.

కానీ తనకు నాలుగూ లేవంటున్నాడు విభీషణుడు."నేను జన్మించింది రాక్షసవంశంలో కనుక నాది పవిత్రమైన జన్మకాదు. ఎప్పుడూ పాపం చేయాలనే ఇచ్ఛే నాకు కలుగుతూంటుంది. కనుక స్వభావం కూడా శుద్ధమైంది కాదు. ఇక నా సహవాసమేమో రావణాసురుడితో, ఈ దుస్సంగమే తప్ప సత్సంగం అసలే లేదు. పోనీ సాధన చేద్దామంటే తమోగుణ పూరితమైన ఈ శరీరం అందుకు సహకరించదు, కనుక సాధన కూడా మృగ్యం".

మరి ఏ అర్హతలు లేని నీవెందుకయ్యా నా దగ్గరికి వచ్చావు? అని రాముడు ప్రశ్నిస్తే, "దైన్యప్రియత్వాత్" మీరు దీనులను ప్రేమించేవారని "మై హరి పతితపావన సునే" - పతితులను పవిత్రం చేసేవారని (ఉద్ధరించేవారని) విని వచ్చాను" అన్నాడు విభీషణుడు.

"దోషోయద్యపి తస్య స్యాత్ సతా మేత దగర్హితమ్"

ఒకవేళ శరణాగతుడిలో ఏదైనా దోషం ఉన్నప్పటికీ, ఆ దోషికి కూడా ఆశ్రయం ఇవ్వడం సత్పురుషుల లక్షణం" అంటూ రాముడు దీనుడైన విభీషణుణ్ణి రక్షించాడు.

ఎవరైతే రామకథాసరితలో తమ వాణిని పవిత్రం చేసుకుంటారో వారికి రాముడి యొక్క ఈ లక్షణాలన్నీ అబ్బుతాయంటోంది శ్రుతిమాత.

"ఈశ్వరప్రాప్తికై తంతు (సాధన) రూప రామాయణం అంటోంది వేదం. ఈశ్వర ప్రాప్తికై చేయవలసిన సాధన ఏమిటి? - అంటే జవాబు "స్వాధ్యాయం" అంటే తనను తాను అధ్యయనం చేసుకోవడం. ఈ ప్రపంచంలో ఏదైనా సాధించాలంటే మనస్సును ఆ పనిలో, లేదా, ఆ వస్తువులో ప్రవృత్తం చేయాలి. అందులోనే మనస్సు నిలిపి ఏకాగ్రతతో కృషి చేస్తే ఈ ప్రపంచంలోని ఏ వస్తువునైనా సాధించవచ్చు. ఇది వస్తుగతమైన సాధన.ఇక ఈశ్వర ప్రాప్తి కావాలంటే మాత్రం ఇలా అనేక విషయాలలో ప్రవృత్తమై ఉన్న మనస్సును వెనక్కు లాగి నివృత్తం చేసి తనలోనే ఉన్న పరమాత్మను అందుకోవడానికి ప్రయత్నించాలి. ఇది స్వగతమైన సాధన.

"ముకుర మలిన అరు నయన బిహీనా ।
రామ రూప దేఖహి కిమి దీనా ॥

పాపం! అద్దము, కండ్లు రెండూ లేని ప్రజలు రాముణ్ణి ఎలా చూడగలరు? అని ప్రశ్నిస్తాడు తులసీదాసు.

సాధారణంగా కండ్లున్న ప్రతివాడికి ప్రపంచము, ఇందులోని అన్ని వస్తువులు, ప్రాణులు కనిపిస్తాయి. కానీ మన కండ్లలో మనకు మన రూపం కనిపించదు కదా? కనుక పర దర్శనానికి కండ్లు సరిపోయినప్పటికీ స్వదర్శనానికి (అదే ఈశ్వర దర్శనం) అద్దం కూడా కావాలి. అందుకే తులసీదాసు బాలకాండలో గురువందన మాచరిస్తూ...

"గురుపద రజమృదు మంజుల అంజన ।
నయన అమియ దృగ దోష బిభంజన" ॥

"కంటిలో దోషాల నన్నింటినీ అంజనం లాగా అంతం చేసే శ్రీ గురుచరణరజాన్ని నేను ఆశ్రయిస్తున్నాను" అంటాడు. ఈ విధంగా ఈశ్వర ప్రాప్తి సాధనలో ప్రథమసోపానమైన నయనశుద్ధి జరగగా తులసీదాసు బాలకాండ రచనను ముగించి మళ్లీ అయోధ్యకాండ ప్రారంభంలో -

దోహా ॥శ్రీగురు చరణ సరోజ రజ నిజమన ముకుర సుధారి ।
బరనౌ రఘుబర బిమలజస జోదాయక ఫలచారి ॥

"శ్రీగురు (బ్రహ్మతత్త్వోపదేశియైన గురువు) చరణకమల ధూళితో మనస్సనే అద్దాన్ని శుద్ధిచేసుకొని (పురాతన కాలంలో లోహ దర్పణాలను వాడేవారు, అప్పుడప్పుడు పలుచగా వాటిపై తుప్పు వస్తే దాన్ని మెత్తటి మట్టితో శుభ్రపరిచేవారు) చతుర్విధ ఫలితాలను (ధర్మ,అర్థ, కామ, మోక్ష) ఇచ్చే రామాయణాన్ని గానం చేస్తాను" అంటారు. కనుక మన మనస్సు అద్దం లాగా శుద్ధమైననాడు, దృష్టి అంతర్ముఖ మైననాడు ఈశ్వరప్రాప్తి కలుగుతుంది.

రామాయణ రచన సాగించే సాధకులు ధ్యానవంతులై ప్రతి రామాయణ పాత్రను ఒక అద్దంగా భావించి అందులో తమ ముఖాన్ని చూసుకుంటూ

అంతర్ముఖత్వాన్ని పొందటం ద్వారా ఈశ్వర స్వరూపులౌతారు. అది ఎలాగంటే?....

"వంచన రాముదేవి గొని వచ్చిన యట్టులు గాదు రోరి న
క్తంచర! నన్ను నాహవ ముఖంబున డాయుట" లన్న
"నయ్యరే క్రించ సహోదరన్ గరము గీడ్పడి మానవుచేత బొంచియే
యించుట గాదులే నను జయించుట నీకు" నటంచు నవ్వినన్
(భాస్కర రామాయణం).

రావణ సుగ్రీవు లిరువురూ యుద్ధానికి తలపడుతూ పరస్పరం ఒకరి నొకరు దూషించుకుంటున్నారు.... దొంగ తనంగా రాముణ్ణి మోసం చేసి సీతను ఎత్తుకు రావడం కాదురా నన్ను యుద్ధంలో జయించడమంటే" అని సుగ్రీవుడంటే "పౌరుషం చాలక చెట్టు చాటున నక్కిన మానవుడితో అన్నను సంహరింపజేయడం కాదురా నన్ను జయించడమంటే' అంటూ రావణుడు సుగ్రీవుణ్ణి దెప్పిపొడుస్తున్నాడు.

మన దృష్టి ఎప్పుడూ ఇతరుల మీదే ఉంటుంది, ఎప్పుడూ మనకు ఇతరుల దోషాలే కనిపిస్తాయి, మన దోషాలు కనిపించవు. అందుకు కారణం మన ఇంద్రియాలన్నీ బహిర్ముఖమై ఉండటమేనంటుంది కఠోపనిషత్తు. సాధారణమైన ఈ లోకంరీతే మనకు పై రెండు రామాయణ పాత్రలలో కనిపిస్తుంది.

ఇక అంతర్ముఖత్వం పొందిన ఇంకొక రామాయణ పాత్ర భరతుడు - ఆయన భావతరంగాలెలా ఉన్నాయో చూడండి -
దోహా ॥రామ బిరోధీ హృదయ తే ప్రగట కీన్హబిధి మోహి ।
మో సమానకో పాతకీ బాది కహుఉ కఛుతోహి ॥

విధాత నన్ను రామవిరోధివైన నీ (కైకేయి) కడుపున పుట్టించాడు. (అంటే నన్ను కూడా రామవిరోధిగా లోకానికి చూపాడు) నాతో సమానమైన పాపి ఈ లోకంలో ఎవరున్నారు? నేను నిన్ను వ్యర్థంగా దూషించాను.

(నా కారణం చేత రాముడు అడవుల పాలైనాడు, కాని నీవల్ల కాదు).

అంటూ తనతో సంబంధం లేకుండా జరిగిపోయిన అనర్థ సంఘటనలో కూడా తన దోషమే తప్ప అన్యుల దోషాన్ని చూడని అంతర్ముఖి భరతుడు.

రామకథా సరితలో స్నానమాడిన సాధకులు సుగ్రీవ స్థాయి నుండి ఎదిగి భరతుడిలా అంతర్ముఖత్వాన్ని పొందుతారు.

"రామాయణం" అన్న పదానికి రాముడి అయనం (ప్రయాణం) అని అర్థం చెప్పవచ్చు. రాముడు చేసిన ప్రయాణాలలో ముఖ్యమైనవి రెండు. విశ్వామిత్రుడి చేత యాగ రక్షణకు కొనిపోబడి వివాహితుడై అయోధ్యకు తిరిగిరావడం ఒక ప్రయాణం. కైకేయి వరాల కారణంగా అరణ్యానికి వెళ్లిన 14 సంవత్సరాలకు రావణ సంహారానంతరం అయోధ్యకు చేరడం రెండవ ప్రయాణం. ఈ రెంటిలో మొదటిది సమర్పణ సాధనను తెలియ జేస్తుంది. ఈ ప్రయాణానికి బీజం నాటుతూ కనిపించే మొదటి పాత్ర విశ్వామిత్రుడు. ఆ రోజులలో తపస్సుకు వైరాగ్యానికి ప్రతిరూపంగా నిలిచిన వాడు విశ్వామిత్రుడు. కొన్నివేల సంవత్సరాల సాధనలో మళ్లీ మళ్లీ పతన మౌతూ లేచి నిలబడుతూ కామం, క్రోధం, లోభం మొదలైన దుర్గుణాలను ఒక్కొక్కదాన్ని దాటుతూ, సృష్టికి ప్రతిసృష్టి చేస్తూ, అప్రతిహతమైన దివ్యాయుధాలను శక్తులనూ సాధించుకుంటూ, చివరికి అతులనీయ శక్తిమంతుడై, తన ప్రత్యర్థియైన వసిష్ఠ మహర్షి చేతనే బ్రహ్మర్షి స్థానాన్ని పొందినట్లుగా అంగీకరించబడినవాడు విశ్వామిత్రుడు. కానీ ఆయన జీవితంలో ఇంకా ఏదో అసంపూర్తి ఉంది. ఆ అపూర్ణత ఆయనకు ముల్లులా గుచ్చుకుంటోంది. కానీ అసలా అసంపూర్తి ఏమిటో కూడా రాముడి పూర్ణత్వం ఎదురయ్యే వరకు ఆయనకు తెలియలేదు.

సమాధిస్థితుడైన విశ్వామిత్రుడికి అయోధ్యలో ఈశ్వరు డావిర్భవించాడనే విషయం అవగతమైంది. అయినా ఇంకా సందేహం ఆయన్ను విడువలేదు. యజ్ఞాన్ని నిమిత్తంగా బెట్టుకొని దశరథుణ్ణి యాచించి రామలక్ష్మణులను వెంటబెట్టుకు వస్తుండగా దారిలో తాటక ఎదురొచ్చింది. రాముడు

పరమాత్మ అవునో కాదో తెలుసుకోవడానికి ఇది మంచి తరుణం, ఎందు కంటే తాను కేవలం ఈశ్వరుడి చేతిలోనే అంతమవ్వాలనే వరం దాని కున్నది. రాముడు ఆవిడను హరించగలిగితే ఆయన పరమాత్మే అనే విషయం విదితమౌతుంది. ఎన్నో దివ్యాస్త్రాలు సాధించుకున్న విశ్వామిత్రుడి కి కూడా సాధ్యముకాని పని అది. ఆయన ఆజ్ఞతో రాముడు కేవలం ఒకే బాణంతో దాన్ని సంహరించాడు.

"దీన జాని తెహి నిజపద దీన్హా"

దానికి తన పరమపదాన్ని ప్రసాదించాడు. విశ్వామిత్రుడికి దశరథుడిపై ఆ క్షణంలో ఈర్ష్య కలిగింది. తాను ఏ పరమాత్మ ప్రాప్తి కొరకైతే క్షాత్రం విడిచి అష్టకష్టాలపాలై అఖండ తపశ్చర్యతో బ్రాహ్మణ్యాన్ని సాధించుకున్నాడో స్వయంగా ఆ పరమాత్మ ఏ తపస్సు లేక భోగలాలసుడై మూడువందల ముగ్గురు భార్యలు, అఖండ ధనసంపత్తి సుఖాలను అనుభవించే క్షత్రియ దశరథుడి ఇంట ఆజ్ఞలు పాలించే తనయుడై పుట్టాడు, అని విశ్వామిత్రుడికి అవగతమైంది. ఆ క్షణంలోనే తన లోపమేమిటో కూడా అర్థమైంది. తాను అత్యంత వైరాగ్యంతో సమస్త సంపదలు రాజ్యభోగాలు వదిలాడు, కానీ తనను ఇంకా త్యాగాహంకారం, తపో అహంకారం పట్టి పీడిస్తూనే ఉన్నాయి. వస్తువుల నంటే త్యాగం చేయగలం గానీ, వాటిని త్యాగం చేసిన అహం కారాన్ని ఎలా వదలడం? కేవలం దాన్ని పరమాత్మ చరణాల వద్ద సమర్పించడం వల్లే అది సాధ్యమౌతుంది.

"విద్యానిధి కహు విద్యాదీన్హీ"

విశ్వామిత్రుడు తనవద్ద ఉన్న సమస్త విద్యలను రాముడికి సమర్పించాడు. ఆ సమర్పణలో ఆయన ధన్యతను, పూర్ణతను, తృప్తిని, శాంతిని అనుభవించాడు. అదే ఆ సమర్పణే సాధనలో చరమస్థాయి. విశ్వామిత్ర యాగరక్షణానంతరం, రామలక్ష్మణులు మిథిలా నగరాన్ని చేరారు. ఆ నగరరాజు జనకుడి సాధన వేరు, ఆయన సమర్పణ గీటురాయి వేరు. భూమి దున్నిన కర్మఫలితంగా సీత అనే ఫలం లభించింది. ఆవిడను

కూడా సమర్పించిననాడు జనకుడు ధన్యుడౌతాడు. కానీ ఆవిడను స్వీకరించగల అర్హుడెవరు?

"కస్మై దేవాయ హవిషా విధేమ"

ఈ హవిస్సును (ఆహుతిని) ఏ దేవతకు సమర్పించాలి? చిన్నతనంలోనే అవలీలగా శివధనుస్సును ఎత్తిన సీతను, శివధనుస్సు ఎక్కుపెట్టగల ధీరుడికే సమర్పించాలి అని ఆయన సంకల్పించాడు.

జనక, పరశురామ పాత్రలు రెండూ చాలా విచిత్రమైనవి. జనకుడు రాజు అనగానే సహజంగా స్ఫురించే విషయాలు యోద్ధ, విజేత, పరిపాలనాదక్షుడు అని. కానీ ఆ గుణాలే కాక ఆయనలో ఒక ఋషికి ఉండే గుణాలైన జ్ఞానం వైరాగ్యం మొదలైనవి కనిపిస్తాయి. ఇక పరశురాముడు ఋషి అనగానే జ్ఞాన వైరాగ్యాదులు గుర్తుకురాగా ఆయనలో అవి మటుమాయమై రాజుల గుణాలైన రాజనీతి, దండన, యుద్ధం మొదలైనవి కనిపిస్తాయి. జనకుడు జ్ఞానం వల్ల, శాస్త్రం ద్వారా సంఘోద్ధరణ చేసి అధర్మాన్ని పరిమార్చవచ్చని యోచిస్తే, పరశురాముడు దండన ద్వారా (దుష్టులను శిక్షంచడం ద్వారా) శస్త్రం ద్వారా అధర్మాన్ని రూపుమాపవచ్చని నమ్ముతాడు. ఇంతకూ సమాజం సమస్యకు జవాబు శస్త్రమా? శాస్త్రమా? ఈ రెంటి సమన్వయం శ్రీరామచంద్రుడు. అందుకే విశ్వామిత్రుడి వెంట ఉన్న రాముడిని చూడగానే జనకుడు.....

కహ హునాథ సున్దర దౌఉ బాలక ।
మునికుల తిలక కి న్రపకుల పాలక ॥

వీరు మునికుమారులా? రాజకుమారులా? చెప్పండని విశ్వామిత్రుణ్ణి అడుగుతాడు. ఇలా విరుద్ధ ధర్మాలకు ఆటపట్టై నిలిచేది కేవలం పరబ్రహ్మ కాని మానవమాత్రుడు కాడు అనే సత్యాన్ని గుర్తిస్తాడు. ఈ సృష్టి అంతా పరమాత్మ నుంచి వచ్చినప్పుడు పరమాత్మ కానిదేది? విసర్జించదగినదేది? ధర్మం ఆయన హృదయం నుండి వస్తే, వీపు నుండి అధర్మం వచ్చిందని చెబుతుంది పురాణం. కనుక శస్త్రమైనా, శాస్త్రమైనా పరమాత్మ సమర్పణ

లోనే స్వచ్ఛమై పరిపూర్ణమౌతుంది.

కానీ తాటక వధ జరగనంతవరకు రాముడు దేవుడవునా కాదా అనే అనుమానం విశ్వామిత్రుడిని పీడించినట్లు, శివధనుర్భంగం కానంత వరకు రాముడి భగవత్త్వాపై గల సంశయం జనకుణ్ణి వీడలేదు. అందుకే సభలో అనేకమంది రాజులు శివధనస్సును ఎత్తలేక సిగ్గుతో తలవంచుకోగా......

త జహు ఆస నిజ గృహ జాహూ ।
లిఖాన న బిధి వైదేహి వివాహూ ॥
జా జనతెఉ బిను భట భుబి భాఈ ।
తౌపను కరి హోతెఉ న హసాఈ ॥

"ఇక మీరు ఆశవిడిచి ఇండ్లకు వెళ్లండి, వైదేహి నుదుట కల్యాణరేఖే గీయ లేదేమో బ్రహ్మదేవుడు! భూమి అంతా వీరులు లేక శూన్యంగా మారిందని తెలిసి ఉంటే నేనీ ప్రతిజ్ఞచేసి నలుగురిలో నవ్వులపాలై ఉండేవాడినే కాను" అంటాడు జనకుడు.

అదే సభలో రాముడున్నాడనే సంగతి ఆయన మరిచాడు, లేదా రాముడు పరబ్రహ్మ అనే విషయంలో ఇంకా సందేహమన్నా విడిపోలేదు. భగవద్గీతలో జ్ఞాని పరిభాషను "ఆ జ్ఞాన స్థితిలో నిలిచిన మహాత్ముడు పర్వతమంత దుఃఖం కలిగినా విచలితుడు కాడు" అంటూ చెప్పడం జరిగింది. మరి జ్ఞానిగా పేరు పొందిన జనకుడికి ఇంత నిరాశ ఎందుకు? ఇన్నాళ్లుగా ఆదిపరాశక్తిని తన ఒడిలోనే పెంచిన జనకుడి జ్ఞానంలో కలిగిన లోపం ఏమిటి? వీటన్నిటికీ జవాబు ఒక్కటే - అదే సమర్పణా రాహిత్యం. శివధనుర్భంగంతో సంశయవిచ్ఛేదం కాగా, సీతా సమర్పణతో ఆయన సాధన పరిపూర్ణమైంది.

ఇక సీతా పరిణయం తరువాత రాముడు అయోధ్యకు కదిలి వెళుతుండగా పరశురాముడు ఎదురౌతాడు. ఇద్దరి మధ్యా చాలాసేపు సంభాషణ నడుస్తుంది. రాముడు పరమాత్మ అనే విషయం అర్థమైనా పరశురాముణ్ణి ఇంకా సందేహం పట్టి పీడిస్తూనే ఉంది. సందేహ నివృత్తి కొరకు....

రామ రమాపతి కం ధనులేహూ ।
ఖేం చహు మిటై మోరసందేహూ ॥

"రామా! ఈ విష్ణుధనుస్సును తీసుకో, దీన్ని ఎక్కుపెట్టి నా సందేహాన్ని తీర్చు" అంటాడు. రాముడు విష్ణుధనుస్సును ఎక్కుబెట్టగానే....

"దేఖి రామ బలు నిజ ధనుదీన్హా"

రాముడిలోని పరమశక్తిని గ్రహించి విష్ణుధనుస్సును ఆయనకు సమర్పించి, సంతుష్టుడై పరశురాముడు వెళ్లిపోయాడు.

ఈ ముగ్గురు మహామహులు శస్త్రధారులు, జ్ఞానులు, తపస్సంపన్నులు కూడా. వ్యక్తిగతంగాగానీ, సామాజికపరంగా గానీ సమస్యలకు జవాబులను పొందలేకపోయారు. వారివల్ల రామరాజ్య స్థాపన జరగలేదు, రావణసంహారం జరగలేదు. వ్యక్తిగతంగా వారు తృప్తిని శాంతిని కూడ పొందలేదు.

రామభక్తి జహ సురసరి ధారా ।
కరమకథా రబినందని బరనీ ॥

గంగానది భక్తిగానూ, యమునా నది కర్మగానూ వర్ణించబడ్డాయి. యమున చాలా విశాలమైనది అయినప్పటికీ అది మధ్యలోనే గంగ అనే భక్తిలో కలిసిపోతుంది. కర్మయోగానికి ప్రతిరూపమైన సూర్యుడి కుమార్తె యమునానది. కానీ ఆవిడ భక్తి అనే గంగలో కలిసి సముద్రుడి లాంటి రాముడిని చేరే వరకు శాంతిని తృప్తిని పొందలేదు.

ఈ విధంగా రామాయణ పాత్రలు మనకు పరమాత్మను చేరే సాధనను చూపుతున్నాయి. ధ్యానవంతులై దీన్ని బాగా గ్రహించినవారు పరమపదాన్ని పొందుతారు. ఎన్ని సాధనలు, తపస్సులు చేసినా ఈ రామకథా సారాన్ని ఎవరైతే గ్రహించలేదో, ఈ కథావిషయంలో ఉదాసీనులై ఉంటారో, వారు నరకాన్ని పొందుతారు. అంటే తృప్తి, శాంతి, కృతకృత్యత లేక ఇక్కడే ఈ లోకంలోనే నరకప్రాయమైన అసంతృప్తికి లోనౌతారు.

"హృదయ ధర్మమనే లోతుగల సన్మతి అనే భూమిలో, వేద పురాణాలనే సముద్రసారాన్ని ఆకర్షించి సాధుజనులనే మేఘాలు శ్రీరాముడి

సత్కీర్తి అనే మంగళకరమైన మనోహర మధుర జలాన్ని వర్షిస్తాయి. సగుణ లీలా వర్ణనమే ఆ జలగతమైన స్వచ్ఛత. అది సకల కలుషహారి. అవర్ణ నీయమైన ప్రేమభక్తే ఆ నీటిలోని మధురశైత్యం. ఆ సరోవరపు నీరు సుకృతాలనే వరి చేలకు, శ్రీరామభక్తుల జీవితాలకు జీవనం. కర్ణరంధ్రాల ద్వారా, మేధ అనే భూమిని తడిపి, ఆ పావనజలం మానసాన్ని చక్కటి రుచులతో నింపి స్థిరంగా ఉంచుతుంది. నాలుగు సంవాదాలు దానికి నాలుగు అందమైన ఘట్టాలు" అంటూ రామాయణ రూపకాన్ని శ్రీతులసీ దాసు వర్ణిస్తాడు. కనుక రామకథ తంతు (సాధనా) రూపమైనదే కాని సాధారణమైన కథకాదు.

ఇది ప్రాచేతసుడి జిహ్వాచేత విస్తరించబడిందంటున్నది వేదం. వాల్మీకికి ఋక్షుడు, భార్గవుడు, ప్రాచేతసుడనే మరో మూడు పేర్లు కూడా ఉన్నాయి. వాల్మీకి వరుణపుత్రుడనడానికి ఒక పురాణకథ ఆధారంగా కనిపిస్తుంది. వరుణుడికి హరితుడనే పేరుగల కొడుకు ఉండేవాడు. వరుణుడొకసారి సనకసనందనాది మహామునులను సత్సంగానికి ఆహ్వానించాడు.వాళ్లు రామకథను చెప్పుకుంటూ ఉండగా హరితుడు తన పెంపుడు నెమలితో కేరింతలు కొడుతూ ఆడుకుంటున్నాడు. ఆ పక్షి కూతలకు,ఇతడి కేరింతలకు కథ భంగమైన కారణంగా సనత్కుమారుడు కోపించి "పక్షితో ఆడుకుంటూ రామకథకు విఘ్నం కలిగించావు కనుక నువ్వు కిరాతకుడివైపో"అని శపించాడు. వరుణుడు బాధపడి శాపోపశమనం కోసం వేడుకోగా, ఆయన "ఓయీ! భృగువంశంలో నీ సోదరుడు ప్రచేతసుడనే ముని ఉన్నాడు.ఇప్పుడాయన దండకారణ్యంలో తపస్సు చేసుకుంటున్నాడు. అతడికి నీ పుత్రుడు కుమారుడై పుడతాడు. వేద వేదాంగపారంగతు డౌతాడు, కానీ శాపకారణంగా దుర్వృత్తనుడై కిరాతకు డౌతాడు. తిరిగి నారదుడి ప్రభావం వల్ల రామనామ మహిమవల్ల పవిత్రుడై, మునియై రామాయణాన్ని రచించగలడు" అని చెప్పాడు.

కొంతకాలానికి ప్రచేతసుడి కొడుకై పుట్టిన ఈ పిల్లవాడు రత్నాకరుడని

పిలవబడ్డాడు. ప్రచేతసుడి కొడుకు గనుక ప్రాచేతసుడని పిలవబడ్డాడు. తపస్సు తరువాత వల్మీకాల (పుట్టలలో) నుండి బైటికి వచ్చాడు కనుక వాల్మీకి నామంతో ప్రసిద్ధుడైనాడు. అతడి జిహ్వ చేతనే రామాయణం విస్తరించబడింది.

అవతారిక :

ఇప్పటివరకు పది మంత్రాలలో రామకథకు ఉపోద్ఘాతాన్ని ఇచ్చిన వేదమాత 11వ మంత్రం నుండి రామావతార కారణాన్ని వివరించి రామకథ ను ప్రారంభించబోతోంది.

11. మంత్రం

**తాం సు తే కీర్తిం మఘవన్మహిత్వా యత్త్వాభీతేరోదసీ అహ్వ యేతామ్।**
**ప్రావోదేవాగ్ం ఆతిరో దాసమోజః ప్రజాయై త్వస్యై యదశిక్ష ఇన్ద్ర ॥**
(ఋగ్. 10-54-1)

హే రామా! రాక్షసులచే పీడించబడ్డవారై పృథ్వీలోకవాసులు మీ సహాయతను అర్థించగా, మొదట మీ చేత పాలించబడ్డ జయ విజయులనే పార్షదులు, రావణాదుల రూపంలో తిరస్కరించబడ్డారు. వారిని వధించే నెపంతో మనుష్యరూపంలో మీరు రాజులై ఇతర ప్రజలకు వర్ణాశ్రమ ధర్మబోధ చేశారు.

శ్రీ మహావిష్ణువు రాముడిగా ఈ భూమిమీద అవతరించడానికి పురాణాలు, ఇతిహాసాలు అనేక కారణాలు చెబుతున్నాయి. ఇక్కడ వేదం అందులోని ఒక ముఖ్యమైన కారణం మనముందుంచుతోంది.

ప్రఖ్యాతమైన ఈ జయవిజయుల కథలో కేవలం వారి వ్యక్తిగతమైన గాథ మాత్రమే కాదు, జీవుడు పరబ్రహ్మనుండి వేరైన కథయొక్క సంకేతం కూడా కనిపిస్తుంది. ఉపనిషత్ భాషలో జీవేశ్వరులు నిత్యసఖులు, కానీ ఈ సామ్యత్వాన్ని సరిగా అర్థం చేసుకోని కారణం చేతనే జీవుడు హీనతా గ్రంథికి లోనై, అభిమానాన్ని ప్రదర్శిస్తాడు. తన నిర్వికార స్థితి నుండి

పతనమై అనేక జన్మలు రాక్షస ప్రవృత్తితో బాధపడతాడు. స్వవికారబద్ధుడై ఈ జీవుడు చివరికి భగవత్కృపతో ముక్తుడౌతాడు. సూచనప్రాయంగా ఈ విషయాన్ని తెలియజేసేదే జయవిజయుల గాథ.

వైకుంఠలోక (మనస్సు హీనత్వానికి లోనుకాని ప్రదేశం వైకుంఠం) ద్వారపాలకులు జయవిజయులు. సారూప్యముక్తి చేత భగవత్ తద్రూపులై జీవిస్తున్న వారి మనస్సులు కుంఠితమవడం (హీనత్వానికి లోనవడం) మొదలెట్టాయి. భగవద్దర్శనాభిలాషులు తీవ్ర ఉత్కంఠతతో వేగంగా (తీవ్రంగా) లోపలికి వెళ్లిపోయేవారెవరూ ఈ పార్షదులను పట్టించుకునేవారు కారు. దానితో ఈ వచ్చేవారు అంతా తమను ఉపేక్షిస్తున్నారనే భావం జయ విజయులకు కలుగసాగింది. భగవత్ సౌందర్యానికి ఏ మాత్రమూ తీసిపోక, సమరూపులమై ఉన్న మనను వీళ్లు పట్టించుకోకపోవడం అవమానకరం. కనుక మనం మన స్థాయిని నిరూపించుకోవాలి అని వారు ప్రయత్నించడం మొదలుబెట్టారు. భగవద్దర్శనానికి వచ్చినవారిని అడ్డగించడం మొదలుబెట్టారు. మృత్యులోక ద్వారపాలకులు సురక్షావ్యవస్థ కొరకు నియోగించబడతారు.వారు అనధికారులు లోపలికి ప్రవేశించకుండా జాగ్రత్తపడుతూ ఉంటారు. కానీ వైకుంఠ ద్వారపాలకులకు ఆ శ్రమలేదు. అసలు అక్కడికి ఏ అనధికారీ రాలేడు. కనుక కేవలం ఆగంతకులకు స్వాగతం పలకడానికే వారు నియోగించబడ్డారు. అయినప్పటికీ వారు ఉపేక్షా వృత్తి ధరించిన వాళ్లే, వచ్చిన వాళ్లను అడ్డగించడం మొదలుబెట్టారు. వారు ఒకరోజు స్వయంగా విష్ణుపత్ని లక్ష్మినే అడ్డగించ ప్రయత్నించారంటుంది పురాణం.ఇది వారి అంతర్మనం లోని మాత్సర్యానికి ప్రతిరూపం. ఇతరులైనా వారి వైపు అప్పుడప్పుడు దృష్టి సారించేవారు కాని, లక్ష్మీదేవి మాత్రం వారివైపు కన్నెత్తి కూడా చూచేదికాదట. అది వారికెంతో బాధాకరంగా ఉండేది. ఈ మాత్సర్యంలో పడి వారు తాము పరమాత్మ సేవకులమనే విషయం మరచి ప్రతిద్వంద్వులము (పోటీదారులము) అనుకోవడం మొదలెట్టారు. ముందు వారే హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా

మారినప్పుడు భూదేవిని అపహరించడం, రావణకుంభ కర్ణులుగా ఉన్నప్పుడు సీతనపహరించడం, శిశుపాల దంత వక్త్రులుగా ఉన్నప్పుడు రుక్మిణిని వివాహమాడ ప్రయత్నించడం మొదలైనవన్నీ ప్రతిక్రియ రూప భావదశలే అనవచ్చు.

ఇంకో రకంగా చెప్పాలంటే వారు ఈడెపస్ స్థితికి లోనైనారనవలసి వస్తుంది. ఈడెపస్ కథనాధారంగా చేసుకొని డా॥ సిగ్మండ్ ఫ్రాయిడ్ (మనో విజ్ఞానవేత్త) ఈ భావదశకు ఈడెపస్ స్థితి అని పేరుపెట్టాడు. గ్రీకు గాథల్లో కెల్లా అత్యంత విషాద భరితమైంది ఈడెపస్ కథ. ఆయన తీబ్జ్ రాకుమారుడు. తండ్రి లేయాస్, తల్లి జాకాస్టో. ఆయన పుట్టగానే దివ్యవాణి లేయాస్ "నీ పుత్రుడు నిన్ను సంహరిస్తాడు" అని చెప్పింది. దాంతో ఆ బిడ్డ కాళ్లు చేతులు కట్టించి పర్వతాగ్రం మీద వదిలిపెట్టిస్తాడు. ఒక గొల్లవాడికి ఆ బిడ్డ దొరకగా వాడికి ఈడెపస్ అని పేరు పెట్టుకుంటాడు "ఈడెపస్" అంటే వాచిన పాదం అని అర్థం.

తరువాత ఆ బిడ్డను కోరిన్త్ రాజు స్వంత బిడ్డలాగా పెంచాడు. ఈడెపస్ పెద్దవాడైన తరువాత దివ్యవాణి అతడితో "నువ్వు నీ తండ్రిని చంపి తల్లిని పెండ్లాడతావు"అని చెప్పింది. ఈ పాపిష్టి కర్మ నుండి తప్పించు కోవడానికి అతడు ఇంటి నుండి పారిపోతాడు. ఎందుకంటే కోరిన్త్ రాజే తన తండ్రి అనుకునేవాడు అతడు.

తీబ్జ్‌కు వెళ్లే మధ్య మార్గంలో వృద్ధుడొకడు ఎక్కివస్తున్న రథం ఎదురౌతుంది. ఆ రథసారథి ఈడెపస్‌ను దారి యిమ్మని అసభ్యంగా ఆజ్ఞాపిస్తాడు. వాడి దురుసుతనానికి మండిపడ్డ ఈడెపస్ వారితో తలపడి ఇద్దరినీ చంపేస్తాడు. ఆ చనిపోయిన వృద్ధుడు ఎవరో కాదు ఇతడి తండ్రే. ఈ విధంగా దివ్యవాణిలో మొదటి భాగం పూర్తి అయ్యింది.

ఇదే సమయంలో తీబ్జ్‌ను భయంకరమైన స్ఫింక్స్ (స్త్రీ తల సింహం శరీరం గల ఒక పెద్ద జంతువు) ఆవహించింది. అది దారిలో వచ్చేపోయే వారిని నిలదీసి ప్రశ్నిస్తుంది. జవాబు చెప్పలేనివారిని తినేస్తుంది. తీబ్జ్

ప్రజలు దాన్ని జయించిన వారికి సింహాసనాన్ని, రాణిని ఇస్తామని ప్రకటిస్తారు.

స్ఫింక్స్ అడిగిన "ఉదయం నాలుగుకాళ్లతో, మధ్యాహ్నం రెండు కాళ్లతో, సాయంత్రం మూడు కాళ్లతో నడిచే జంతువు ఏది?" అనే ప్రశ్నకు ఈడెపస్ వెంటనే" ఆ జంతువు మనిషి, ఉదయం అంటే బాల్యం. బాల్యంలో శిశువు రెండుకాళ్లు రెండు చేతులతో పాకుతాడు. మధ్యాహ్నం అంటే నడివయస్సు రెండు పాదాలతో నడుస్తాడు. సాయంత్రం అంటే వృద్ధాప్యం ఈ వయస్సులో కఱ్ఱ అవసరం కనుక రెండు కాళ్లతో కఱ్ఱను కలిపితే మూడుకాళ్లు అని జవాబు చెబుతాడు. దానితో స్ఫింక్స్ తల రాతికేసి కొట్టుకొని చనిపోతుంది.

ఈడెపస్ రాజై, రాణి పాణిగ్రహణం చేస్తాడు. ఆమె ఆయన తల్లే. ఈ విధంగా దివ్యవాణి పలుకుల్లో రెండోభాగం పూర్తి అయ్యింది. వారికి నలుగురు పిల్లలు కూడా కలిగారు. దేశంలో ప్లేగు మహమ్మారి వ్యాపించింది. తండ్రిని చంపి తల్లిని వివాహమాడిన ఈడెపస్‌ను దేశం నుండి వెళ్లగొడితే గాని అరిష్టం తొలగిపోదని దివ్యవాణి చెప్పింది. జరిగిన వికృత కర్మకు తట్టుకోలేక ఈడెపస్ కండ్లు పొడుచుకుంటాడు. ఆ అంధుణ్ణి ప్రజలు దేశం నుండి వెళ్లగొడతారు. ఆయన కూతురు యాంటిగని ఆయనను జీవితాంతం కనిపెట్టుకొని ఉంటుంది.

పిల్లవాడు శైశవంలో తండ్రిని ద్వేషించి, తల్లిని ప్రేమించడమనే సహజ ఉద్వేగదశకు డా॥ ఫ్రాయిడ్ ఈ కథ ఆధారంగా ఈడెపస్ స్థితి అని పేరు పెట్టారు.

ప్రతిపిల్లవాడు శైశవంలో ఇటువంటి భావదశకు లోనవుతాడనే సిద్ధాంతాన్ని ఫ్రాయిడ్ ప్రతిపాదించాడు. సభ్య సమాజంలో ఇది ఎంతో కోపాన్ని, అలజడిని కలగజేసింది. ఇంకా మోటుగా చెప్పాలంటే ప్రతివాడు తన తల్లిలో భార్యను చూస్తాడు (కామిస్తాడు) అని ఆయన సిద్ధాంతం. శ్రీరామకృష్ణ పరమహంస భార్యలో కూడా తల్లిని చూడవచ్చు అనే

విషయాన్ని నిరూపించాడు. కానీ ఇంతకూ ఈ ఇరువురిలో ఎవరు చెప్పింది సబబు?

తూర్పు దేశాలు మానవుడి స్థితిని ఒకకోణం నుండి చూస్తే పడమటి దేశాలు మరొక కోణం నుండి చూశాయి. డార్విన్ కోతినుండి మనిషి పుట్టాడు అంటే జంతువు స్థాయి నుండి మానవుడు ఎదిగాడు అని చెబితే ఫ్రాయిడ్ శారీరకంగా ఎదిగిన మాట నిజమే కాని మానసికంగా అతడింకా జంతువే అని సిద్ధాంతీకరించాడు. ఇది పడమటిదేశాల ఆలోచనా విధానం. ఇక మన ఋషుల ఆలోచనలెలా ఉన్నాయో చూడండి..... ప్రాణి జంతువు నుండి ఎదిగి మనిషిగా మారలేదు, దైవత్వంలో నుండి జారిపోయి జంతువ ుగా మారాడు, క్రమంగా ముందు మనిషిగానూ తరువాత దేవుడిగానూ మారాలి అన్నారు. ఈ రెండూ, దృష్టికోణాలలో భేదమే గాని చెప్పిన విషయం మాత్రం ఒక్కటే.

ఏదైన వస్తువు మనవద్ద ఉన్నప్పుడు మనకు దాని విలువ అర్థంకాదు దాన్ని పోగొట్టుకున్న తరువాతే అర్థమౌతుంది. మనం ఆరోగ్యంగా ఉన్నప్పుడు దాని స్మరణే మనకు ఉండదు. జ్వరం వస్తేనే అంతకు ముందు ఎంత హాయిగా ఉండిందో అవగతమౌతుంది. తలనొప్పి లేకపోతే తల మరిచిపోతాం, వేసుకున్న బూటులో ఏ కంకరరాయో పడితే కాలి యొక్క స్మరణ ఉంటుంది. అలాగే వైకుంఠంలో భగవంతుడితో సమాన మైన రూపం కలిగి ఉన్న జయ విజయులలో అరిషడ్ వర్గాలు ప్రవేశించాయి. వారికి వైకుంఠనివాసంలోని మాధుర్యం ఏమిటో అవగతం కాలేదు. భగవంతుడితోనే పోటీ పడటం మొదలుబెట్టారు. ఈ వికృతత్వాన్ని లక్ష్మీనారాయణులు పట్టించుకోలేదు కానీ, బీజప్రాయంగా ఉన్న ఈ కుంఠితత్వం విస్ఫోటకమైంది. ఒకరోజు వారు సనత్కుమార, సనత్సుజాత, సనక, సనందనులనే చిరంజీవులైన ఋషులను ద్వారం వద్ద ఆపి, భగవద్దర్శనం చేసుకోనివ్వలేదు. క్రోధితులైన ఆ ఋషులు వారిని మూడు జన్మల వరకు రాక్షసులై పొమ్మని శపించారు. జరిగింది గ్రహించిన

పరమాత్మ లక్ష్మీసమేతుడై స్వయంగా తానే ద్వారం వద్దకు వచ్చాడు. (క్రోధావేశానికి లోనైన సనత్కుమారాదులు వైకుంఠంలోకి ప్రవేశించే అర్హతను కోల్పోవడమే అందుకు కారణమని కొందరు పెద్దలంటారు).

తన సేవకులు మూడు జన్మలు ఎత్తవలసి వస్తే వారి ఉద్ధరణకు తాను నాలుగు జన్మలెత్తడానికి సిద్ధపడతానని పరమాత్మ ఋషులకు తెలియజేశాడు. సేవకుడి దోషానికి యజమాని కూడా బాధ్యుడే కనుక తాను కూడా శిక్ష అనుభవించి దండశాసనాన్ని నిలుపుతానన్నాడు పరమాత్మ.

అరిషడ్ వర్గాలలో ప్రతిజన్మలోనూ ఒక అవగుణం చొప్పున ఆ యిద్దరు అన్నదమ్ములు అంతం చేసుకొని తిరిగి పరంధాముణ్ణి చేరారు. మొదటి జన్మలో హిరణ్యాక్ష హిరణ్యకశ్యపులై జన్మించారు. హిరణ్యాక్షుడు లోభావతారం. వాడు మొత్తం భూమినే దొంగిలించాడు. వ్యక్తి నివసించడానికైనా తన జీవనావసరాలు తీర్చుకోవడానికైనా భూమి యొక్క ఒక చిన్న ముక్క ఉంటే చాలు. ఈ భూమి పైని సమస్త సంపద (లక్ష్మి) ఏ విధంగానైతే పరమాత్మ భార్యగా చెప్పబడుతోందో, ఈ భూమి కూడా ఆయన రెండవ భార్యగా పేర్కొనబడుతోంది. మనమంతా వారి పుత్రులం. ఆ తల్లి స్తన్యపానం చేసే హక్కు మాత్రమే మనకుంది గానీ, మొత్తం ఆక్రమించి ఆవిడను సొంతం చేసుకో ప్రయత్నించకూడదు, అలాచేస్తే అది లోభంగా చెప్పబడుతుంది. మొత్తం భూమినంతా తన హస్తగతం చేసుకున్న వాణ్ణి సంహరించడానికి పరమాత్మ వరహావతారం ఎత్తాడు. లోభం సూకర వృత్తి. లోభానికి లోనైన వ్యక్తి స్వసుఖాన్ని, స్వజన సుఖాన్ని కూడా పణంగా పెట్టి పంది బురదగుంటనే స్వర్గంగా భావించినట్లు ఆ వ్యక్తి ధనసంపత్తే సర్వస్వంగా భావించి బ్రతుకుతాడు. దుష్టుడి మనోవృత్తికి తగిన శిక్ష విధించాలి కనుక పరమాత్మ వరహావతారం ఎత్తాడు.

హిరణ్యాక్షుడి సోదరుడు హిరణ్యకశిపుడు. మొదటివాడి కండ్లు ఎల్లప్పుడు బంగారం మీద ఉంటే, రెండో వాడు బంగారాన్నే చుట్టుకున్నాడు.

ఇది మనో ప్రవృత్తి. అహంకారం లోభానికి పెద్దన్న. లోభం ద్వారానే వ్యక్తి అహంకారాన్ని సంతుష్టం చేసుకుందామని ప్రయత్నిస్తాడు. అహంకార సంరక్షణ కోసమే సంపత్తి అవసరమౌతుంది. అహంకారానికి మదమనే పేరు సార్థకమైంది. త్రాగిన వ్యక్తి సత్యాన్ని మరుస్తాడు, అలాగే అహంకారి పూర్వవృత్తాంతాన్ని అనుభవాలను మరచి మళ్లీ అవే తప్పులు చేస్తాడు. హిరణ్యాక్షుడికి పట్టిన గతి నుండి హిరణ్యకశిపుడు ఏమీ నేర్చుకోలేక పోయాడు. వీడు ఇంకా ముందుకు వెళ్లి పరమాత్మ ఆస్తిని హస్తగతం చేసుకోవడం మాత్రమే గాక అసలు భగవంతుణ్ణే అంతం చేద్దామని చూస్తాడు, స్వయంగా తానే భగవంతుడి లాగా పూజింపబడాలని చూస్తాడు. ఈ అహంకారం మృగప్రవృత్తి. మనిషి శారీరకంగా ఎదిగి రెండు కాళ్లపైన నిలబడగలిగినా మానసికంగా వాడు పశువే. ఈవిషయం చూపడానికే నృసింహావతారంతో పరమాత్మ ఆవిర్భవిస్తాడు. డార్విన్, మృగం నుండి మానవుడు పరిణతి చెందిన విధానాన్ని గూర్చి చెబుతూ మధ్యలో నాకు ఒక పరిణామం తెలియలేదు అంటాడు. ఆ పరిణామమే మృగమానవుడు. పూర్తి మానవత్వంలోనూ అహంకారం లేదు, పశుత్వంలో కూడా అహంకారం లేదు. అహంకారం గల ప్రతి వ్యక్తి మృగ మానవుడే (ఇంకా ఎదుగుతున్నవాడే).

రెండవ జన్మలో వీరిద్దరూ రావణ కుంభకర్ణులై పుట్టారు. రావణుడు కామానికి ప్రతిరూపం. తృప్తిగా కామాన్ని అనుభవించినప్పటికీ కూడా వాడికి పతనావస్థ కలిగేది కాదు. ఎందుకంటే "ధర్మా విరుద్ధో భూతేషు కామో2స్మి" ధర్మానికి విరుద్ధం కాని కామం స్వయంగా పరమాత్మయొక్క విభూతి కనుక. ప్రకృతి సిద్ధంగా ఉండే స్త్రీ పురుష సంయోగం కాక స్వలింగ మిథునమైతే అది ధర్మానికి వ్యతిరేకం. అందుకే అది ఎయిడ్స్ లాంటి మహమ్మారికి దారితీసి మొత్తం మానవుల మనుగడకే ప్రమాదకారి గా తయారవుతోంది. స్త్రీని భోగవస్తువుగా భావించి మానవత్వాన్ని విడిచి ఆవిడ శరీరానికి విలువకట్టడం కూడా (వ్యభిచారం కూడా) అధర్మమే.

మూడవది పశుబలంతో స్త్రీని లొంగదీసుకోవడం. అధర్మపరమైన ఈ మూడు రీతులలో ఎవరైతే ప్రవర్తిస్తాడో వాడికి పతనం తప్పదు. రావణాసురుడు శూరుడుగానూ ఎంతో అందగాడుగానూ ప్రసిద్ధుడైనాడు. స్వయంగా వాణ్ణి వలచి వచ్చిన స్త్రీలెందరో ఉన్నారు. కానీ ఎప్పుడైతే వాడు ఆ మూడు అధర్మరీతులలో ప్రవర్తించాడో అప్పుడే శాపాలు పొంది చివరికి మరణించవలసి వచ్చింది.

రావణాసురుడి తమ్ముడు కుంభకర్ణుడు, ఇది మోహావతారం. వాడు నారదమహర్షి ద్వారా రాముడు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడని తెలుసుకొని కూడా నిద్రాప్రమాదాలకు లోనై రావణుడికి ఆ విషయం చెప్పాడు. రావణుడు అధర్మప్రవర్తనలో ఉన్నాడని తెలిసికూడా వాడివైపే యుద్ధం చేయతలపెడతాడు."మోహేన అంధ కేన్హా కేహి కేహి" మోహం గుడ్డివాణ్ణిగా మార్చని దెవడిని? అంటే మోహం అందరినీ కండ్లున్న గుడ్డివాళ్లగా చేస్తుంది. చూస్తూకూడా, ధర్మాధర్మ విచక్షణ ఉండి కూడా ధర్మాన్ని ఆచరించ లేకపోవడమే మోహం అంటాడు తులసీదాసు. ఈ ఇరువురిని అంతం చేయడం కొరకు రామావతారం ఆవిర్భవించింది. మనిషికి సంపూర్ణ మానవత్వం సిద్ధించిననాడే కామం, మోహం అంతమౌతాయి. రాముడు అమానుష విగ్రహుడు కాడు, మానుష విగ్రహుడు. పదహారు కళలతో మానవత్వం ఉట్టిపడినవాడు.

మూడవ జన్మలో ఆ పార్షదులిద్దరూ శిశుపాల దంతవక్త్రులై జన్మించారు. వారిద్దరు మాత్సర్య, క్రోధాలకు ప్రతి రూపాలు. శిశుపాలుడు రుక్మిణిని వివాహమాడటం కోసం ఆమె అన్న రుక్మితో స్నేహం చేశాడు. కానీ రుక్మిణి కోరికపై కృష్ణుడు ఆవిడను అపహరిస్తాడు. దానితో శిశుపాలుడి మాత్సర్యం పెల్లుబికింది. అది యుధిష్ఠిరుడి రాజసూయ యాగంలో ప్రకటమైంది. పార్షదులలో నెలకొన్న ఈర్ష్యా మాత్సర్యబీజాలు ఇక్కడ మహావృక్షాలై కనిపిస్తాయి. మాత్సర్యమున్నచోట క్రోధం అనివార్య మౌతుంది. ఈ రెండు దుర్గుణాలు ధ్యానంలో దైవత్వాన్ని సంతరించు

కొన్నవారికి మాత్రమే పూర్తిగా వదులుతాయి. అందుకే తక్కిన నాలుగు అరిషడ్వర్గాలను జయించిన మహాత్ములలో కూడా సామాన్యంగా ఈ రెండు మిగిలి ఉంటాయి. తక్కినవన్ని పవిత్ర ధార్మిక జీవనం వల్ల అంతమైనాయి గాని ఇవి రెండూ మాత్రం కేవలం ధ్యానంవల్ల అంత మవవలసిందే తప్ప ఇంకొక మార్గం లేదు. ధర్మాధర్మ ద్వంద్వాలకు కూడా అతీతమైన పూర్ణ దైవత్వ అవతారం కృష్ణుడు. ఆయన చేతిలోగాని ఈ ఇద్దరు అంతం కాలేదు.

ఈ విధంగా తమ స్వరూపస్థితి నుండి పతనమై పశుప్రాయులై అరిషడ్ వర్గాలకు లోనైన జీవుల ఉద్ధరణ కొరకై పరమాత్మ ఈ భూమిపై అవతరిస్తూ ఉంటాడు. రాక్షస సంహారం కొరకు ఆయన అవతరించినట్లు కనపడ్డా ముఖ్యకారణం మాత్రం ఆ నెపంతో జీవులు వర్ణాశ్రమ ధర్మాల కోట గోడలలో తమ సంస్కారాలను అంతం చేసుకునే మార్గం చూపడానికే అంటుంది వేదం.

వర్ణం అంటే వర్ణించబడేది, వర్ణించదగ్గది అని అర్థం చెప్పుకోవచ్చు. ఇది సాంఘికమైన కట్టుబాటు. ఆశ్రమం అంటే శ్రమ లేకుండా తమ సంస్కారాలను అంతం చేసుకోవడానికి ఏర్పడ్డ వ్యవస్థ అని అర్థం చెప్పుకోవచ్చు. ఇది స్వాత్మికమైన కట్టుబాటు.

భారతీయ ఋషుల దృక్పథంలో జన్మనుండి మరణం వరకు అవధి మాత్రమే జీవితం కాదు. వారు, జీవుడు అనేక జన్మలు పొందుతూ క్రమిక వికాసంలో పశుత్వం నుండి దైవత్వాన్ని పొందటానికి కావలసిన వైజ్ఞానికమైన ఏర్పాటు ఒకటి చేశారు. అదే వర్ణం. ఇది నాలుగుగా విభజింపబడి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలుగా పిలవబడింది. ఇది ప్రారంభించబడినప్పుడు ప్రస్తుతం చెలామణిలో ఉన్న నీచభావనలుగాని, దురాచారాలుగాని అందులో ఉండేవి కావు. త్రిగుణాలు స్పష్టంగా శరీరంలోని రంగుగానూ, ముఖకవళికలు, ఇచ్ఛస్వరూపంగానూ ప్రకట మౌతూ వారు ఏ వర్ణానికి చెందినవారో అవగతమౌతూ ఉండేది. ఆయా

వర్ణాల వారికి ఇతర వర్ణాల ప్రజలతో సంబంధబాంధవ్యాలు నిషేధించి, వేరుగా నివసించడానికి వారికి ప్రత్యేక వాడలు ఏర్పాటు చేసి, వారి స్వభావ ప్రవృత్తులనుబట్టి వారు చేయవలసిన సామాజిక, వ్యక్తిగత కర్మలు, సాధనలు నిర్ణయించేవారు. ఆయా నియమాలన్నీ వారి స్వభావాలకు అనుగుణంగా ఉండేవి కనుక ఎవరూ వాటిని వ్యతిరేకించేవారు కాదు.

ఒక జీవుడు పరిణతి చెందుతున్న కొద్దీ క్రమంగా తల్లిదండ్రులను అంతకన్నా ఉన్నత వర్ణాలలో ఎన్నుకుంటూ, అనేక జన్మలలో సాధనలో పురోగమించేవారు. శూద్రులు, తమోగుణ ప్రధానులు కనుక వారికి సూక్ష్మమైన సాధనగానీ కర్మగానీ పనికి రాదు. అందుకొరకై సాంఘిక సేవను, సేవక వృత్తిని, శారీరక శ్రమ జీవనాన్ని వారికి పనిగా చెప్పిచెప్పి అదే కర్మలో ఫలాపేక్ష లేకుండా ఉండే ప్రవర్తనను సాధనగా నిర్ణయించారు. ( ఆ తరువాతి కాలంలో వారిని బాగా అణగదొక్కడానికి వారిని పీల్చిపిప్పి చేయడానికి ఇతరులకు అది బాగా ఉపయోగపడిన మాట వాస్తవం) ఎక్కువ శాతం తమోగుణం, రెండవస్థాయిలో రజోగుణం, అత్యల్ప స్థాయి లో సత్వగుణం కలవారికి, ఈ కర్మ సాధన రెండూ గూడా వ్యక్తిగతంగానూ సాంఘిక వ్యవస్థకు కూడా బాగా ఉపకరించాయి.

ఇక తమో, రజోగుణాలు సమాన స్థాయిలో ఉండి, సత్వ గుణశాతం కొంత పెరిగిన వైశ్యులకు కృషి(వ్యవసాయం), గోరక్షణ, వాణిజ్య(వ్యాపారం) కర్మలుగా నిర్ణయించారు. వారిలో లోభ ప్రవృత్తి పెరగకుండా ఉండటం కొరకు దానం వారి సాధనగానూ నిర్ణయించారు. ఈ ఏర్పాటు వారికీ, సంఘానికి కూడా బాగా ఉపకరించింది. (డబ్బుకొరకు పరిపాలకులు వారిపై ఎక్కువగా వత్తిడి తేవడం వల్లను, వారిలో లోభప్రవృత్తులు పెరగడం వల్లను, వారు వ్యాపారంలో మోసాలు చేసి సంఘద్రోహం చేయడం మొదలు బెట్టారు. పరోక్షంగా వారు నిమ్నకులాలను దోపిడీకి గురిచేస్తుంటే, వారు ప్రత్యక్షంగా వీరిని దోచి దొంగతనం తమ వృత్తిగా మార్చుకున్న వారున్నారు ఇందులో...

ఇక ప్రథమ స్థానంలో రజోగుణం, రెండో స్థానంలో సత్వ గుణము, మూడవ స్థానములో అత్యల్పంగా తమోగుణమున్న క్షత్రియులకు జాతి యొక్కపాలనను, ధర్మానికి పాల కు అడ్డువచ్చే వారిని దండించే అధికారం ఇవ్వబడ్డాయి. ఇక వారికి సాధనలుగా ప్రజాసంక్షేమానికి ఉపకరించే సాంఘిక సేవ, కుల పురోహితుల నుండి శాస్త్ర అధ్యయనం, దేశరక్షణ కొరకు ప్రాణత్యాగం చేయగల నిస్వార్థపరత్వం చెప్పారు. ఇవి వారికి వ్యక్తిగత అభివృద్ధికి సాంఘిక వ్యవస్థకు ఉపకరించాయి. (బలం చేతిలో ఉన్న వీరు అహంకరించడంవల్ల,కులగురువుల మార్గదర్శకత్వాన్ని పాటించక పోవడంవల్ల ప్రజాధనాన్ని స్వార్థానికి ఉపయోగించడం వల్ల వ్యవస్థ పతన మైంది).

ఇక ప్రథమస్థాయిలో సత్వగుణం, రెండవ స్థాయిలో అత్యల్పంగా రజోగుణం, కేవలం గంధమాత్రంగా తమోగుణం కలిగిన బ్రాహ్మలకు వేదాధ్యయనం, పౌరోహిత్యం, ఉపాధ్యాయ వృత్తి కర్మలుగాను ధ్యానం సాధనగానూ నిర్ణయించబడ్డాయి. ఇది వారి వ్యక్తిగత సాధనకు సాంఘీక వ్యవస్థకు బాగా సహకరించాయి. (శాస్త్రం, వేదాలపైన గుత్తాధిపత్యం వహించడానికి ఇతరులకు బోధించక పోవడంవల్ల తమోగుణాలు పెరిగి సాధన చేయక వీరు పతనమైనారు).

శూద్రుడిగా పుట్టిన ఒక జీవుడు జీవితాంతం కర్మయోగం చేయడం వల్ల సహజంగానే తమోగుణం తగ్గి వైశ్య వర్ణంలో తన తల్లిదండ్రులను వెతుక్కుంటూ వెళ్లేవాడు. అలా క్రమంగా ఎదిగి బ్రాహ్మణ జన్మలో తన సాధన సక్రమంగా ముగించుకున్న ఆ జీవుడు "యోగినామేవ కులే భవతి ధీమతాం" యోగుల వంశంలో పుట్టి చరమ సాధనలు ముగించుకుని జీవత్వాన్నే వదిలి దైవత్వాన్ని పొందేవాడు కానీ "ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ య దీదృశమ్". ఇటువంటి జన్మలోకంలో చాలా అరుదైనది అంటుంది గీత. నిజమే మరి ఓనమాలు దిద్దటానికి 1000 మంది పిల్లలు కూర్చుంటే పి.హెచ్.డి. వరకు ఎంతమంది పిల్లలు వస్తారంటారు?

పైగా వారి సంస్కారానికి సరిపోయే తల్లిదండ్రులు దొరకవద్దా! అంత గొప్ప యోగ సంస్కారాలు కలిగిన వ్యక్తులు సామాన్యంగా వివాహానికే సుముఖులు గారు. ఒకవేళ సుముఖులైనా వారిలో ఉన్న శుద్ధసత్వగుణం కారణంగా సంసారం చేయరు. ఇకమరి వారి గర్భంలోకి ప్రవేశించడానికి ఆత్రుతపడే ఉన్నత జీవులకు దారేది? అందుకే అటువంటివారి జన్మ ఈ లోకంలో దుర్లభం అంటాడు గీతాచార్యుడు.

వీరేకాదు హిట్లర్ లాంటి కిరాతకుడు పుట్టాలన్నా అంత దుర్మార్గులైన సంస్కారాలు గల తల్లిదండ్రులు దొరకడం కష్టం. ఏవోకొన్ని పాళ్లలో అన్ని సంస్కారాలు కలగాపులగంగా ఉన్న జీవులకు తల్లిదండ్రులు త్వరగా లభిస్తారు. పైగా వర్ణవ్యవస్థ ఛిన్నాభిన్నమవుతున్న ఈ రోజులలో ఇది మరింత సులభం."జాయతే వర్ణ సంకరః" అన్న అర్జునుడి వాక్కు ఇప్పుడు మనకు స్పష్టంగా కనిపిస్తుంది. ఈ వ్యవస్థ సరిగ్గా ఉన్నప్పుడే "అనేక జన్మ సంసిద్ధః తతోయాతి పరాంగతిమ్" అనేక జన్మలలో సాధనలో సిద్ధమైన జీవుడు చివరికి పరమగతిని పొందుతాడు అనే విషయం సార్థకమౌతుంది.

ఇప్పటివరకు చెప్పింది వర్ణవ్యవస్థ. ఇక ఆశ్రమ వ్యవస్థ మళ్లీ నాలుగుగా విభజింపబడింది. అవే బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాస ధర్మాలు. ఏ వర్ణంలో వారైనా సరే ఇరువది ఐదు సంవత్సరాల వరకు బ్రహ్మచర్య వ్రతంలో ఉండి ఉపనయన దీక్షను పొంది, ధర్మాధర్మ విచక్షణను శాశ్వత ధర్మాలను, మారే సాంఘిక ధర్మాలను, నిత్యజీవనోప యోగమైన కుల వృత్తులను ఆనంద సుఖ జీవనానికి కావలసిన సమస్తమైన విజ్ఞానాన్ని క్షుణ్ణంగా అధ్యయనంచేసి గృహస్థాశ్రమంలో ప్రవేశించి సాంఘిక బాధ్యతలు, వైయక్తిక ధర్మాలు నిర్వర్తిస్తూ, ప్రకృతి ప్రేరణలో కలిగే కామోద్రేకాన్ని తృప్తి పరుస్తూ కనీసం పాతిక సంవత్సరాలు గృహస్థాశ్రమంలో ఉండి గురుకులాల నుండి తిరిగి వచ్చిన తమ పిల్లలకు వివాహాలు చేసి బాధ్యతలు వప్పజెప్పి భార్యా సమేతంగా వనాలకు ప్రస్థానం చేసే వారు. అక్కడ వైరాగ్యం చరమస్థాయి దాకా పెరిగేవరకు సాధన చేసి సన్యాస దీక్ష వహించి ధ్యానంలో

తరించేవారు.

గృహస్థాశ్రమంలోనే అతుక్కుపోయి తక్కిన రెండు ఆశ్రమాలు పాటించకుండా ప్రజలు బహిర్ముఖులౌతున్న రోజులలో శ్రీ ఆదిశంకరాచార్యుల వారు బ్రహ్మచర్యం నుండే సన్యాసగ్రహణ పద్ధతులను ప్రవేశపెట్టారు.

సంక్షిప్తంగా ఇది వర్ణాశ్రమ ధర్మాల యొక్క వివరణ. ఇందులో ఒకరు ఉన్నతులని గాని, నిమ్నులనిగాని ఆలోచించే దురాచారాలు అస్పృశ్యత లాంటి మనవత్వరహిత అలవాట్లుగాని అలనాడు లేవు. ఒక ఇల్లు కట్టాలంటే ఇంటికి ప్లాన్ వేసే ఇంజనీరు, దానికి కావలసిన డబ్బు చేకూర్చే యజమాని, నిలబడి కట్టించే సూపర్‌వైజర్, కట్టే కూలిపని వారు అందరూ అవసరమే. అందులో ఏ ఒక్కరికి ప్రాధాన్యతనిచ్చి తక్కివ వారిని ఉపేక్షించలేము. ప్లాన్‌వేసే ఇంజనీరు ఏ.సి. రూములో కూర్చుని పనిచేస్తుంటే కూలివాడు మండుటెండలో రాళ్లెత్తక తప్పదు. కానీ వారంతా కలిస్తేనే కట్టడం పూర్తయ్యేది. టీకి కావలసిన టీ పొడి, పంచదార, నీళ్ళు, పాలు కావలసిన మోతాదులో కలిసినప్పుడే అందులో రుచి ఉత్పన్నమయ్యేది. ఈ సాంఘిక వ్యవస్థలన్నీ అలా ఏర్పడినవే గాని ఏ ఒక్క జాతినో తొక్కిపట్టడానికి కాదు. కాకపోతే మౌలికమైన ఆచారాలు, ధర్మాలు, వ్యవహార జగత్తులో కొందరి స్వార్థానికి బలి అవడం మాత్రం చరిత్రలో ఎరిగిన విషయమే.

ఈ విధంగా తమ స్వరూప స్థితి నుండి పతనమై పశుప్రాయులై అరిషడ్వర్గాలకు లోనైన జీవుల ఉద్ధరణకొరకై పరమాత్మ ఈ భూమిపై అవతరిస్తూ ఉంటాడు. రాక్షస సంహారం కొరకు ఆయన అవతరించినట్లు కనపడ్డా ముఖ్యకారణం మాత్రం ఆ నెపంతో జీవులు తమ సంస్కారాలను అంతం చేసుకునే మార్గం చూపడానికే అంటుంది వేదం.

అవతారిక :

భగవదవతారానికి వర్ణాశ్రమ ధర్మరక్షణను కారణంగా చెప్పిన వేదమాత నారాయణ తత్త్వాన్ని ఆయన కరుణ, ప్రేమను ఈ మూడు

మంత్రాలలో వివరించబోతోంది.

12, 13, 14. మంత్రాలు

**ఆ సూర్యో యాతు సప్తాశ్వః క్షేత్రం యదస్యోర్వియా దీర్ఘయాథే।**
**రఘుః శ్యేనః పతయదంధో అచ్ఛాయువా కివిర్దీదయ ద్గోషు గచ్ఛన్**
**(ఋగ్ : 5-45-9)**

**విష్ణురిత్థా పరమమస్య విద్వాంజాతో బృహన్నభి పాతి తృతీయమ్ ।**
**ఆసా యదస్య పయో అక్రత స్వం సచేతసో అభ్యర్చన్త్యత్ర ।**
**(ఋగ్ : 10-1-3)**

**అత ఉత్వా పితుభృతో జనిత్రీరన్నా వృధంప్రతి చరన్త్యన్నైః ।**
**తా ఈం ప్రత్యేషి పునరన్యరూపా అసి త్వం విక్షు మానుషీ షుహోతా**
**(ఋగ్ : 10-1-4)**

ఈ శ్రేష్ఠ, దీర్ఘ, సమున్నత సంసారంలో సూర్యవంశంలో పరమాత్మ శరీరాన్ని ధరించాడు. రఘు వంశంలో అన్నమయ శరీరాన్ని ధరించి పృథ్వి పైన విచరించడం మొదలుబెట్టాడు.

శ్రీ మహావిష్ణువు స్వయంగా పరబ్రహ్మ పరమాత్మ అయిఉండి కూడా, గుణాతీతమైన తృతీయశరీరాన్ని ధరించాడు. క్షీరసాగరంలో స్థిరమైన ఈ తృతీయ విష్ణురూపాన్నే ఉపమన్యుడు మొదలైన భక్తులు పూజిస్తారు. ఈ విధంగా భక్తుల కోరికపై, దుష్టశిక్షణార్థమై ఆయన అవతరించాడు.

ఈ కారణాల చేత శ్రీ మహావిష్ణువును తప్పక తల్లియని, తండ్రియని, వర్ధకుడని అనవచ్చును. ఒక రూపంలో నీవు ఆరాధయత్రివి, ఇంకొక రూపంలో ఆరాధ్యరూపానివి. నీవు మానవులలో యజ్ఞాది సదాచార ప్రవర్తకుడవు.

పదకొండవ మంత్రంలో రాక్షసులచే పీడించబడ్డ పృథ్వీలోకవాసుల కొరకు శ్రీ మహావిష్ణువు రాముడై అవతరించాడని చెప్పిన శ్రుతి, 13వ మంత్రంలో దుష్టశిక్షణార్థమై అవతరించాడని అంటుంది. అందుకు కారణం ఏమిటి?

శ్రీరామచంద్రుడు దండ కారణ్యంలో ఋషుల ముందు.... ।

దోహా॥ నిసిచర హీన కరఉ మహి, భుజ ఉఠాయి పనకీన్హ ।
సకల మునిన్హకే ఆశ్రమన్హి జాయి జాయి సుఖ దీన్హ ॥

రెండు చేతులెత్తి ఈ భూమిపైన నిశాచరుడనేవాడు లేకుండా చేస్తాను అని ప్రతిజ్ఞ చేశాడు. ప్రతి ఆశ్రమానికీ వెళ్లి ఆయా ఋషులకు ధైర్యం చెప్పి వారి సేద తీర్చారు.

కానీ ఆయన విభీషణుణ్ణి, ప్రహ్లాదుణ్ణి, బలిచక్రవర్తి మొదలైన రాక్షసులను సంహరించలేదు. పైగా ఇంద్రుడి అంశతో రావణ విరుద్ధంగా జరిగే సంఘర్షణలో పరమాత్మకు సహాయపడటం కొరకు జన్మించిన వారిని సంహరించాడు. పైగా వాలి వానర జాతివాడే గాని రాక్షసజాతి వాడు కాడు.

కనుక పరమాత్మ వాడిన రాక్షస, అసుర, నిశాచర పదాలు కేవలం ఒక జాతికి సంబంధించినవి కావడానికి వీల్లేదు. ఆ విషయం స్పష్టం చేయడానికే 13వ మంత్రంలో దుష్టశిక్షణార్థమై అనే పదం వాడాడు.

మానసరామాయణంలో నిశాచర పదానికి శివుడు చెప్పిన అర్థం చూడండి...

బాఢే ఖల బహు చోరజు ఆరా! జేలంపట పరధన పరదారా ।
మానహి మాతు పితానహి దేవా! సాధున సన కరవావహి సేవా ॥
జిన్హ కే యహ ఆచరన భవానీ! తే జానహు నిసిచర సబ ప్రానీ ॥

దుష్టులు, దొంగలు, జూదరులు విపరీతంగా పెరిగి పోయారు. ఎవరైతే ఇతరుల సంపత్తిపైనా, స్త్రీలపైనా దృష్టి పెడతారో, ఎవరైతే తల్లిదండ్రులను, దేవతలను ఆదరించరో, ఎవరైతే సాధువులతో సేవలు చేయించు కుంటారో, ఓ పార్వతీ! వారి నందరినీ నిశాచరులుగా తెలుసుకో.

కనుక దీనితో ఆచరణ భ్రష్టులైన దేవతలు కూడా నిశాచరులే. ఉన్నత సంస్కారం, ఆచరణ కల్గిన రాక్షసులైనా దేవతల క్రిందికే

వస్తారుగానీ, ఇందులో జాతి వివక్షత అనేది లేదు. అసురారిగా పేరుగాంచిన రాముడు తనపై బాణ ప్రహారం చేయగా ఈ సందేహంతోనే వాలి రాముణ్ణి......

"మై బైరీ సుగ్రీవ పి ఆరా! అవగున కవననాథ మొహి మారా?"

నేను మీకు శత్రువునా? సుగ్రీవుడు మీకు మిత్రుడా? ఏ విధంగా? ఏ కారణంచేత మీరు నన్ను కొట్టారు?" అంటూ ప్రశ్నిస్తాడు. ఆయన యొక్క ఆచరణ అవతార ఉద్దేశ్యంతోగానీ, వ్యవహారికంగా గానీ ఎటుచూసినా సరిగ్గా కనిపించడం లేదు. ఎందుచేత ఆయనాపని చేశారు అని అతడి భావన.

అప్పుడు రాముడు...

అనుజ-బధూ భగినీ సుత నారీ! సును సఠ కన్యాసమ ఏ చారీ॥
ఇన్హహి కుదృష్టి బిలోక ఇజోఈ । తాహి బధై కఛు పావనహోఈ॥
మూఢ తొహి అతిసయ అభిమానా । నారి సి భావన కరసినకాన ॥
మమభుజబల ఆశ్రిత తెహి జానీ । మారా చహసి అధమ అభిమానీ ॥

"ఓరీ శఠుడా! విను మరదలు, కోడలు, చెల్లెలు కన్నబిడ్డలతో సమానమైన వారు. వీరిని ఎవరైతే కుదృష్టితో చూస్తారో వారిని చంపినా పాపం లేదు.మూర్ఖుడా! నీ భార్య నా అవతారరహస్యాన్ని చెప్పినా, అభిమానంతో దాన్ని పెడచెవిన బెట్టావు. పైగా నా భుజబలాన్ని ఆశ్రయించా డని తెలిసి కూడా సుగ్రీవుణ్ణి నువ్వు చంపుదామని చూశావు" అంటాడు.

భగవంతుని ఆజ్ఞతోనే ఆయన కార్యంలో సహాయం చేయడం కొరకు బ్రహ్మచేత ప్రేరితులై పుట్టిన దేవతల అంశావతారాలు ఈ వానరులు. కానీ తాను వచ్చిన కార్యాన్నే మరచిపోయి, వాలి రావణుడితో మైత్రి నెరపుతున్నాడు.పైగా తమ్ముడి భార్యను బలవంతంగా లాక్కున్నాడు. రాముడే స్వయంగా పరమాత్మ అని తార చెప్పినా, వాడు ఆయన శరణు పొందలేదు. పైగా సుగ్రీవుడు శ్రీరాముడి ఆశ్రితుడని తెలిసికూడా చంప ప్రయత్నించాడు. ఇవన్నీ అహంకార లక్షణాలు. రాక్షస ప్రవృత్తి గల వానిని

రాముడు రాక్షసుడిగానే భావించాడు.

ఆ తరువాత సుగ్రీవుడు కూడా వాలి భార్య తారను తన సొంతం చేసుకున్నాడు కదా, మరి అతనిని రాముడెందుకు శిక్షించలేదు అని కొందరు ప్రశ్నిస్తారు. రాముడు సుగ్రీవుణ్ణి ఈ విషయంలో శిక్షించక పోవడానికి రెండు కారణాలున్నాయి. ఒకటి తార స్వయంగా తాను సుగ్రీవుణ్ణి వలచి అతడి భార్యగా ఉండటానికి ఇష్టపడింది. రెండు అలా అన్న చనిపోతే తమ్ముడికి అన్న స్త్రీలు భార్యలవడం అనేది వారి సంప్రదాయం. ఈ ఆచారం కేరళలోనూ (పంపా దగ్గర అడవులలోనూ) ఉత్తర హిందూస్థానం లోని హర్యానా ప్రాంతం లోనూ, జాట్‌లు అనే వ్యవసాయదారులలో ఇప్పటికీ కనిపిస్తుంది. ఇవన్నీ వ్యవహారిక సాంఘిక ధర్మాలు.

ఇక జన్మతః రాక్షసుడైన విభీషణుణ్ణి రాముడు ఆదరించిన విధం చూద్దాం....... కపటం లేకుండా విభీషణుడు పరమాత్మకు స్పష్టంగా తన పరిచయాన్ని ఇస్తున్నాడు...

"నాథ దసాననకమై భ్రాతా। నిసిచర బంస జనమ సురత్రాతా"

హే ప్రభో! దేవతలను పీడించే నిశాచర వంశంలో నేను జన్మించాను, పదితలల వాడైన రావణాసురుడి తమ్ముణ్ణి నేను.

శ్లో॥ న ధర్మనిష్ఠో2స్మి న చాత్మవేదీ న భక్తిమాం స్త్వచ్చరణారవిన్దే ।
అకిన్చనో అనన్యగతిః శరణ్య త్వత్పాదమూలం శరణం ప్రపద్యే ॥

"నేను ఆత్మజ్ఞానిని కాను, భక్తుడిని కూడా కాను, నాలో ధర్మనిష్ఠకూడా లేదు. నేనొక అకించనుడిని. (కించిత్తు కూడా ఏమీ లేనివాణ్ణి) నా వద్ద ఎటువంటి సాధన సామాగ్రి కూడా లేదు, మీ చరణారవిందాలు తప్ప నేను మరియొక గతిని ఎరుగను".

ఇంత సరళుడై, కపటరహితుడై, పసివాడిలాగా నిర్దోషుడై నగ్నంగా (ఏమీ దాచుకోక) పరమాత్మ ముందుకు వచ్చాడు కనుకనే పరమాత్మ

స్వీకరించాడు. ఈ సరళత దేవతా లక్షణమే గాని రాక్షస లక్షణం కాదు.

అందుకే శ్రీరాముడు.....

శ్లో ॥ సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।
అభయం సర్వభూతేభ్యో దదామ్యే తద్ వ్రతం మమ ॥

"నేను నీ వాణ్ణి నన్ను రక్షించు" అంటూ ఎవడైతే శరణాగతిని పొందుతాడో నేనతణ్ణి సమస్తప్రాణుల నుండి అభయుణ్ణి చేస్తాను.

"జోనరహోఇ చరాచర ద్రోహీ । అవైసభయ సరన తకి మోహీ ॥
కోటి బిప్ర బధ లాగహి జాహూ । ఆఏ సరన తజ ఉ నహి తాహూ"

ఈ చరాచర సృష్టికి ద్రోహం చేసిన వాడైనా సరే, కోటి మంది విప్రులను వధించినవాడైనా సరే, నా శరణాగతిని పొందినట్లయితే అతడిని రక్షిస్తాను, అంటాడు పరమాత్మ. చేసిన పనిలో చెడును గ్రహించగల వివేకం వచ్చినప్పుడే ఎవడికైనా పశ్చాత్తాపం కలుగుతుంది. ఆ పరితాపాగ్నే పరమాత్మ శరణాగతుడిగా మారుస్తుంది. ఆ పరితాపమే వాడి పాపాలన్నింటినీ దహించి వేస్తుంది. ఈ వివేకం దేవతా లక్షణమే గాని రాక్షస లక్షణం కాదు.

రాక్షసులను నిశాచరులంటారు. అంటే రాత్రులలో చరించేవారు (తిరిగేవారు) అని అర్థం. పగలు ధనార్జన కొరకు పరిశ్రమించడం రాత్రిపూట విశ్రమించడం అనేది ప్రకృతి నియమం. వక్రమార్గాల ద్వారా ధనార్జన చేయదలచిన వారు ఈ నియమాన్ని ఉల్లంఘిస్తారు. దొంగలు, జూదరులు ఈ జాతికి చెందినవారు. సులభమార్గంలో ఎక్కువ ధనాన్ని ఆర్జించడానికి జరిగే ప్రయత్నం ఇది. ఇతరులు పగలు పరిశ్రమించి దాచుకున్న ధనాన్ని ఏ శ్రమాలేకుండా అయాచితంగా పొందటానికి వీరు ప్రయత్నిస్తారు. రావణుడిలో ఈ రెండు లక్షణాలూ ఉన్నాయి.

"సోదససీస స్వాన కీ నా ఈ ।
ఇత ఉత చితఇ చలాభడి హాఈ" ॥

"ఎవరి పేరు చెబితే మూడు లోకాలు కంపిస్తాయో అటువంటి రావణుడు

దొంగకుక్కలాగా సీతాపహరణార్థమై భయపడుతూ, అటు ఇటూ చూస్తూ ఆశ్రమంలోకి ప్రవేశించాడు".

ఈ దొంగబుద్ధి కారణంగానే శూరుడైన వాడి లోకి భయం ప్రవేశించింది.

"జా మమ చరన సకసి సఠనారీ । ఫిరహి రాము సీతామైహారీ" ॥

"ఓరి, మూర్ఖుడా (రావణా)! ఒకవేళ నీవు నా ఈ చరణాన్ని లేపగలిగేటట్లయితే, నేను సీతను ఓడిపోయినట్లే లెక్క, యుద్ధం చేయకుండానే శ్రీరాముడు వెళ్లిపోతాడు".

అని అంగదుడనగానే జూటరబుద్ధిగల రావణుడు, మూడు లోకాలను జయించి ఉన్నవాడైనప్పటికీ, తన నిండు సభలోనే అశేష సభాసదుల మధ్య శత్రుదూత కాళ్లు పట్టుకోవడానికి వెరువలేదు.

ఈ రెండు (దొంగతనం, జూదం) రాక్షస ప్రవృత్తులతో పాటు రావణుడలో, సాధువైన విభీషణుడితో సేవ చేయించుకోవడం, తండ్రి లాంటి అన్నను (కుబేరుని) లంకానగరం నుండి తరిమేసి అతడి పుష్పక విమానం లాగివేసుకోవడం, దేవతల (ప్రకృతి శక్తులైన వాయువు, వరుణుడు మొ॥) చేత ఊడిగం చేయించుకోవడం మొదలైన అనేక అసురప్రవృత్తులు కనిపిస్తాయి. కనుక జన్మతః ప్రాణులు ఎవరు అనే విషయం పట్టించుకోక కేవలం ఆసురీప్రవృత్తిగల ప్రాణులను సంహరించడం కొరకే శ్రీమహావిష్ణువు రాముడై ఈ భూమిపై అవతరించాడు.

'అగ జగమయ సబ రహిత బిరాగీ । ప్రేమతె ప్రభు ప్రగటఇ జిమి ఆగీ"॥

ఈ చరాచర జగత్తంతా ఆయన స్వరూపమే. అయినప్పటికీ ఆయన వాటన్నింటి నుండీ వేరుగానే ఉన్నాడు. ఆయన నిరపేక్షుడు. ప్రేమతో పిలిస్తే ఆయన అగ్నిలాగా ప్రకటమౌతాడు. అగ్ని నాలుగు రకాలుగా ప్రకటమౌతుంది. 1). స్ఫూర్తి : వర్షాకాల మేఘాల నుండి, ఒక్క క్షణం ప్రత్యక్షమయ్యే మెరుపు తీగ. ఇది అత్యంత చంచలమైనది క్షణికమైనది. 2). ఆవేశం : నీటిని వేడి చేస్తే ఆ నీటికి అగ్నియొక్క ఆవేశం కలుగుతుంది.

అగ్ని నుంచి దూరంచేసిన కొంతకాలానికి అది మళ్లీ చల్లబడుతుంది. కానీ, స్ఫూర్తి కన్నా ఇది ఎక్కువ కాలం నిలుస్తుంది. 3). ప్రవేశం : లోహాన్ని అగ్నిలో వేసి కాలిస్తే ఆ లోహంలోకి అగ్ని ప్రవేశిస్తుంది. ఈ లోహాన్ని అగ్ని నుండి దూరం చేసిన తరువాత చల్లబడేమాట వాస్తవమే గాని. ఆవేశం కన్నా ప్రవేశం నిర్గమనానికి కొంత ఎక్కువ కాలం పడుతుంది. 4). ఆవిర్భావం : అరణుల మథనం నుండి గాని, చెకుముకి రాళ్ల నుండి గాని (ఈ రోజులలోనైతే అగ్గిపుల్ల, లైటరు మొ॥) ఉత్పన్నమైన అగ్నిజ్వాల.

ఇలాగే పరమాత్మ కూడా నాలుగు రకాలుగా ప్రకటమౌతాడు కనుక పరమాత్మను అగ్నితో పోల్చడం జరిగింది. 1). నృసింహావతారం స్ఫూర్తి అవతారం. 2). పరశురామునిది ఆవేశావతారం. 3). మైత్రేయుడనే ఋషి బుద్ధుడిగా పుట్టాడు. 4). శ్రీరాముడు, శ్రీకృష్ణుడు మొదలైనవారు ఆవిర్భావ అవతారాలు. శ్రీరామకృష్ణ పరమహంసాదులు నిత్యావతారాలు.

అగ్నిని యజ్ఞానికైనా ఉపయోగించవచ్చు, శవదహనానికైనా ఉపయోగించవచ్చు. కానీ స్వయంగా అగ్ని నిరపేక్షమైంది (ఎటువంటి అపేక్ష - కావాలని గానీ, వద్దని గానీ లేకపోవడం) నిర్దోషమైంది, అందుకే పాపపుణ్యాలకు, శుచి అశుచులకు అతీతమైన అగ్ని ఉదాహరణ ఇక్కడ పరమాత్మ విషయంలో ఇవ్వబడింది.

భూమి, నీరు, గాలి మొదలైన భూతాలలాగా అగ్ని ఎప్పుడూ ప్రకటమై ఉండదు. ముందు అప్రకటంగా ఉండి వర్తమానంలో ప్రకటమై పని తీరిపోగానే తిరిగి మాయమౌతుంది. ఇవన్నీ పరమాత్మ యొక్క అవతార లక్షణాలే. పైగా అగ్ని అన్ని రూపయుత ద్రవ్యాలలోనూ దాగి సర్వవ్యాపకమై ఉంటుంది. తేజం లేనిదే రూపం ఉండదు. (రూపం అగ్నియొక్క తన్మాత్ర) అలాగే పరమాత్మ రూపం కూడా తేజోమయం, సర్వవ్యాపకం. అగ్ని అవ్యక్తంగా ఉన్నప్పుడు కనిపించక (రూపములేక) ప్రకటమైనప్పుడు (రూపంతో) కనిపించి మళ్లీ తన రూపరహిత స్థితికి వెళ్లిపోతుంది. అలాగే పరమాత్మ కూడా నిర్గుణనిరాకారుడై ఉండి

గుణాతీతుడై ఉండి కూడా భక్తులు ప్రేమతో ఇచ్చిన పిలుపుకారణంగా రూపాన్ని ధరించి కొద్దిరోజులు లీలలు చేసి తన యథా నిర్గుణ నిరాకార స్థితిలోకి వెళ్లిపోతాడంటోంది శ్రుతి. కానీ ఇలా ఈ విశాలభూమిపై మానవశరీరంతో విచరిస్తున్నప్పటికీ, ఏ వస్తువు లేదా ప్రాణిపైన రాగంగానీ, ద్వేషంగానీ లేక తన స్వరూప స్థితిలోనే ఉంటాడు.

"భవ వారిధి మంథర" సంసార సాగరంలో మంథరాచలం లాంటి పరమాత్మ! అంటూ దేవతలు ఆయనను స్తుతించారు. ఈ సంసార సాగరాన్ని దాటలేక మునిగే జనులు కోట్లమంది ఉన్నారు. ఏ కొద్దిమందో దీన్ని తరించినవారు (దాటిన వారు) కూడా ఉన్నారు. కానీ ఇంతవరకు దానిలోతు తెలుసుకున్నవారు మాత్రం ఈ సృష్టిలో ఎవరూ లేరు. కానీ, సముద్రం లోతు తెలుసుకోగల మంథరాచలం లాగా ఈ సంసార సాగరం లోతు ఒక్క పరమాత్మకే (కూర్మావతారంలో దీని లోతు తెలుసుకున్నాడు కనుక) తెలుసు.

శ్లో॥ పృష్ఠే భ్రామ్యదమన్ద మన్దర గిరి గ్రావాగ్ర కండూయనా
న్నిద్రాలోః కమఠాకృతే భగవతః శ్వాసానిలాః పాన్తు వః ।
యత్సంస్కార కలనువర్తన వశాద్ వేలానిభే నామ్భసాం
యాతాయాత మతన్ద్రితం జలనిధేర్నాద్యాపి విశ్రామ్యతి ॥

వీపుపైన మందరాచలం తిరుగుతూ ఉండటం వల్ల కలిగిన ఆనంద సౌఖ్యాల కారణాన నిద్రాలోలుడైన శ్రీ కూర్మభగవానుడి ఉచ్ఛ్వాస, నిశ్వాసలు భారమై క్షీరసాగరంలో ఉవ్వెత్తున తరంగాలు లేచి అవి ఉప్పెనను సృష్టించాయి.

ఈ సంసారం ఆ భగవంతుడికి ఒక కేళీవిలాసమే అనడానికి పై భాగవత శ్లోకమొక ప్రమాణం. ఈ విషయాన్నే వేదం శ్రేష్ఠమైన, దీర్ఘమై గొప్పదైన ఈ సంసారంలో సూర్యవంశంలో పరమాత్మ శరీరాన్ని ధరించాడు అంటోంది.

రామావతారంలో పన్నెండు కళలున్నాయి. కృష్ణావతారంలో

పదహారు కళలున్నాయి. అయినా ఈ రెండు అవతారాలు పూర్ణావతారాలే, అది ఎలాగంటే సూర్యుడికి పన్నెండు కళలు. అంధుకే ఆ వంశంలో ఆవిర్భవించిన రాముడు 12 కళలతోనే పూర్ణుడైనాడు. అలాగే చంద్రుడికి పదహారు కళలు. ఆ వంశంలో అవతరించిన కృష్ణుడికి పదహారు కళలు. ఒక రూపాయిలో నాలుగు పావలాలు ఉంటాయన్నా, పదహారు అణా లుంటాయన్నా ఒకటే. పదహారు అణాలు నాలుగు పావలాలతో సమానమే గాని ఎక్కువ కాదు. ఈ రెండు రకాలుగా వర్ణించబడ్డది కేవలం ఒక రూపాయే.

రావణుడు మనుష్య, వానర జాతులతో తప్ప అన్యులెవరిచే మరణంలేకుండా వరం పొందివున్నాడు. కనుక సూర్యవంశంలో అన్నమయ శరీరాన్ని ధరించి పరమాత్మ మర్త్యుడై అవతరించాడు అంటోంది వేదం.

"గగన గిరా గంభీర భఇ హరని సోక సందేహ"

దేవతలు, భూదేవి యొక్క శోక సందేహాలు తీరేట్లుగా గంభీర ఆకాశవాణి వినిపించింది.

సూర్యవంశంలో అన్నమయ శరీరంతో పరమాత్మ ఆవిర్భవించడానికన్నా ముందు, తమ కష్టాలు తీర్చడానికి ఆవిర్భవించమని ప్రార్థిస్తున్న దేవతలకు, భూదేవికి భయ శోక సందేహాలు తీరేట్లుగా పరమాత్మ శబ్దబ్రహ్మగా అవతరించాడు.

ఈ గుణగ్రామ (సమూహ) జగన్మంగళ రూపాన్నే (శబ్దబ్రహ్మను) అశ్వినీ నక్షత్రంగా శాస్త్రాలు చెబుతున్నాయి. ఈ అశ్వినీ నక్షత్రంలో ఒకేసారిగా మూడు తారలు మెరుస్తాయి. దేవతల స్తుతిలో కూడా మూడు రూపాలున్నాయి. 1. క్షీరశాయి (ఆదిశేషుడు), 2. ఆ పైన పవ్వళించిన శ్రీ మహావిష్ణువు. 3. ఆయన నాభికమలంలో ఆసీనుడైన బ్రహ్మ (తన సవతి అయిన భూదేవి స్తుతి చేయవచ్చింది కాన ఆవిడ పొడగిట్టని లక్ష్మీదేవి స్వామి చరణసేవాస్థలం నుండి అంతర్ధానమైంది). ఈ మూడింటి కలయికలో ఏర్పడ్డ అశ్వినీ నక్షత్రాన్ని అశ్వముఖ ఆకృతి కలదిగా వర్ణిస్తారు.

బ్రహ్మవిద్య యొక్క ప్రథమ ఉపదేష్ట హయగ్రీవ భగవానుడు శబ్దబ్రహ్మగా కొనియాడబడతాడు. ఈ అవతారాన్నే వేదం "తృతీయ విష్ణురూపంగా" ఇక్కడ వర్ణిస్తోంది.

ఈ విధంగా రక్షకుడై నిలచిన శ్రీమహావిష్ణువును తల్లిగాను, తండ్రిగాను, వర్ధకుడిగాను పేర్కొనవచ్చునటుంది వేదం.

"పితాహమస్య జగతః మాతా ధాతాపితా మహః"

"ఈ జగత్తుకు తండ్రిని, తల్లిని, కర్మ ఫలదాతని, తాతని నేనే" అని స్వయంగా పరమాత్మే చెప్పాడు.

తల్లిలా హృదయగతమైన ప్రేమను యిచ్చి, తండ్రిలా శరీరపోషణ చేసి, తాతలాగా బుద్ధికి కావలసిన జ్ఞానాన్ని అందించే వర్ధకుడిలాగా ఆ పరమాత్మ కాక మరెవరు ప్రవర్తించగలరు?

పరమాత్మకు "మహాయజ్ఞః" అని పేరు, మహత్+అయ+జ్ఞః, అయ=శుభావహమైన విధి, దానిని "జ్ఞః"=తెలిసినవాడు-అంటు, శుభప్రదమైన విధులను నిర్వహించడం, నిర్వహింపజేయడం తెలిసినవాడని అర్థం. "మహాహవిః" అనికూడా ఆయనకు పేరు - అంటే యజ్ఞాలలో హవిస్సులను అందుకోవడానికి, భక్తుల కష్టాలు తొలగించడానికి పిలవబడే వాడని అర్థం. కనుకనే, ఆయనను ఆరాధ్యరూపుడని, యజ్ఞాది సదాచార ప్రవర్తకుడని వేదం చెబుతోంది.

అవతారిక :

12, 13, 14 మంత్రాలలో విష్ణుత్వము అవతార తత్త్వ విశ్లేషణ చేసిన వేదం 15, 16, 17 మంత్రాలలో పుత్రకామేష్టి యాగాన్ని, యజ్ఞ వైశిష్ట్యాన్ని, పరమాత్మ ఆవిర్భావాన్ని వర్ణిస్తోంది.

15, 16, 17. మంత్రాలు :

**అమన్దాన్ త్స్తోమాన్ప్రభరే మనీషా సింధావధి క్షియతో భావ్యస్య ।**
**యో మే సహస్ర మమిమీత సవాన తూర్తో రాజాశ్రవ ఇచ్ఛమానః ॥**

(ఋగ్ : 1-126-1)

**ఉపోప మే పరా మృశ మా మే దభ్రాణి మాన్యథాః ।**
**సర్వాహమస్మి రోమశా గన్ధారీణా మివావికా ॥**

(ఋగ్ : 1-126-7)

**స జాతో గర్భో అసి రోదస్యో రగ్నే చారు ర్విభృత ఓషధీషు ।**
**చిత్రః శిశుః పరి తమాంస్యక్తూన్ప్ర మాతృభ్యో అధి కనిక్రదద్గాః ॥**

(ఋగ్ : 10-1-2)

దశరథమహారాజు ఇచ్చిన దానం చేత సంతుష్టులైన రోమశ (ఋష్య శృంగ) దంపతుల సంవాదం ఇక్కడ చెప్పబడుతోంది. "యజ్ఞం ద్వారా కీర్తిని ఇచ్చగించిన, నన్ను వేయి గోవుల దానంతో సంతుష్టపరచిన రాజుకు, మనుష్యభావంతో ప్రాప్తించిన ఐశ్వర్య యుక్తులైన, సముద్రాన్నే దహింప చేయగల ప్రపుత్రులు కలిగేలా సంకల్పిస్తాను".

ఈ విధంగా కక్షీవంతుడైన ఋషి (ఋష్యశృంగ) పుత్రుణ్ణి ప్రసాదించే సంకల్పం చేయగా, యజ్ఞానికి పత్నీసమేతంగా కూర్చుని ఉన్న దశరథ మహారాజుకు ఇలా బోధించాడు.... దృఢవ్రతుడవై నా సమీపాన కూర్చుని నన్ను ధ్యానించు. నేను రోమాలతోనే సమస్త దోషాలను దూరం చేయగలను. ఎంతో లోభం కలిగిన గాంధారి (గాంధార దేశ యువతి) లోభ రహితం చేయబడింది. మనోమయమైన సంకల్పమేదైనా నేను చేయగలను.

ఓ అగ్నీ! నీవు పృథ్వికి, ఆకాశానికి మధ్య ఉత్పన్నమైనదానవు. మాతా, పితృల శరీరాలలో శుక్రశోణితాల కలయిక వల్ల గర్భం నుండి ఉత్పన్నమైన దానవు కావు. మంత్రజ్ఞుల ద్వారా అజ్ఞేయ చరు రూపాన్ని ధరించిన సుందర ఆశ్చర్యమయ శిశువు కౌసల్యాది మాతలను పొంది రుదనం చేశాడు.

చిత్రలేఖ అనే ఒక అప్సరస ఇంద్రసభలో నృత్యం చేస్తుంటే, ఆ నాట్య ప్రదర్శనాన్ని చూడటానికి దేవ, యక్ష, కిన్నెర, కింపురుషులతో బాటు అనేక ప్రాణులు కూడా కదలి వచ్చాయి. అలా కొన్ని అందమైన లేళ్లు కూడా వచ్చాయి. ఆవిడ మైమరచి వాటినే చూస్తూ ఇంద్రుడిని నిర్లక్ష్యం

చేసింది. దానితో ఆయనకు కోపం వచ్చి "ఆసక్తితో మృగాలను చూచావు కనుక మృగివై పుట్టమ" ని శపించాడు. చిత్రలేఖ శాపవిమోచనం చేయమని కోరుకుంటే, విభాండక మహర్షి వీర్యం వల్ల పుత్రుడిని పొందిన తరువాత నీకు శాపవిమోచన మవుతుందని ఇంద్రుడు చెప్పాడు, అని విచిత్ర రామాయణంలో కనిపిస్తుంది.

కశ్యపుడి పుత్రుడైన విభాండక మహర్షి (విగత భాండుడు మోహ భాండం బద్ధలైనవాడు) బ్రహ్మచర్యంతో తపస్సు చేసుకుంటుండే వాడు. ఒకరోజు ఆయన నదిలో స్నానం చేస్తుండగా ఊర్వశి ఆయన కంటబడింది. ఆ సుందరిని చూసిన ఆయనకు మనస్సు విచలితమై రేతఃస్కలనమైంది. మృగిరూపంలో నీళ్లు తాగుతున్న చిత్రలేఖ నీటితో పాటు విభాండకుడి వీర్యాన్ని కూడా తాగేసింది. దానివల్ల ఆ మృగి కొంత కాలానికి ఒక పిల్లవాణ్ణి కని శాపవిమోచనం కలుగగా చిత్రలేఖగా మారి ఇంద్రలోకానికి వెళ్లిపోయింది.

ఒకచెట్టు కింద ఏడుస్తున్న ఆ పిల్లవాణ్ణి చూసి, విభాండకుడు దివ్యదృష్టితో ఈ పిల్లవాడు తన కుమారుడే అని తెలుసుకొని, ఆశ్రమానికి తెచ్చి పెంచుకోవడం మొదలుబెట్టాడు. ఆ పిల్లవాడి తలమీద ఒక శృంగం (కొమ్ము)ఉండటంతో అతడు శృంగీఋషి (ఋష్యశృంగుడు) గా పిలవబడ్డాడు. మృగి గర్భాన జన్మించాడు గనుక ఈయనకు తలమీద కొమ్ము ఉండింది అని కొందరంటే, లేదు అధిక తపస్సు చేత అలా కొమ్ము మొలిచిందని కొందరంటారు. ఈయన శరీరం నిండా అనేక రోమాలుండేవి కనుక ఈయన రోమశుడిగా పిలవబడ్డాడు. (ఖడ్గమృగం వెంట్రుకలే కొమ్ముగా మారతాయి) కక్షీవాన్ అని కూడా ఈయనకు పేరుండేది. కక్షీవాన్ అన్న పదానికి పాపం దూరం చేసేవాడని, వీపుమీద బరువు మోసేవాడని (ఆయన సమిధలు మోసుకురావడం చూసిన వారెవరో ఆ మాట అని ఉంటారు), శుష్కవనంలో నివసించేవాడని, నీరు తరచుగా గల ప్రదేశంలో ఉండేవాడని అనేకార్థాలు చెప్పుకోవచ్చు.

దశరథుడు ఇంద్రలోకానికి వెళ్లే తొందరలో దారిలో ఉన్న సురభిని (గోమాతను), తారాక్ష్యమునిని పట్టించుకోకపోవడంతో, వారికి కోపం వచ్చి "దశరథుడికి సంతానం కలుగకపోవుగాక" అని శపించారు. దశరథుడు స్వర్గలోకం నుండి తిరిగి వచ్చేప్పుడు వారిని కలిశాడు. ఆయన అనునయ వినయాలను చూసి విన్న మీదట ఆ ముని తనిచ్చిన శాపం విషయం తెలిపి, దాన్ని మార్చి ముందు దశరథుడికి ఒక కుమార్తె కలుగుతుందని, ఋష్యశృంగుడు ఆయన అల్లుడవుతాడని, ఆయన దశరథుడిచేత చేయించే పుత్రకామేష్ఠి యజ్ఞం వల్ల నలుగురు కుమారులు పుట్టగలరని చెప్పాడు. అలాగే కొంతకాలానికి దశరథుడికి ఒక కుమార్తె కలిగింది. శాంత అనే ఆ అమ్మాయికి యుక్తవయస్సు రాగానే ఆయన స్వయంవరం ప్రకటించాడు. క్షత్రియవంశ నిర్మూలనకై తలపెట్టిన పరశురాముడికి ఈ విషయం తెలిసి కోపోద్రేకాలతో సభామంటపానికి వచ్చి దశరథుని సంహరించబోగా, వసిష్ఠ మహర్షి అడ్డువచ్చి ఆయనను శాంత పరిచాడు. శాంతను బ్రాహ్మణుడికిచ్చి చేసేట్లయితే వారివల్ల క్షత్రియవంశం వృద్ధికాదు కనుక తాను అడ్డురానననడంతో - అలాగే జరుగుతుందని మాటిచ్చి, ఆయనను శాంతపరచి పంపడం జరిగిందని విచిత్రరామాయణం వల్ల తెలుస్తోంది.

దివిరథుడి కుమారుడైన ధర్మరథుడి తనయుడు రోమపాదుడు. ఆయన మొదటిపేరు చిత్రరథుడు, ఆయన అంగదేశాన్ని పాలించేవాడు. ఆయన సంతానప్రాప్తి కొరకై బ్రహ్మవేత్తలను సంతుష్ఠపరచదలచి అనేకంగా దానాలు చేయడం మొదలుబెట్టాడు. ఒక బ్రాహ్మణుడు ధనం తీసుకొని ఇంటికి వెళ్లి మళ్లీ తన కొడుకుని తీసుకొనివచ్చి అతడికి ఒక ఆవును దానంగా ఇమ్మని అడగ్గా, బ్రాహ్మణులకు ఆశ ఎక్కువంటూ రోమపాదుడు నవ్వాడు. దాంతో ఆ బ్రాహ్మణుడికి కోపం వచ్చి 'నీ దేశంలో అనావృష్టి కలుగుతుంది' అని శపించి వెళ్లిపోయాడు.

అంగదేశంలో అనావృష్టి కలిగి అసంఖ్యాకంగా ప్రాణులు చని

పోతున్నారు. భూమి బీటలువారింది. ఎండి మోడులైన చెట్టుమీద, పశువుల కళేబరాలమీద రాబందులు కూర్చుని పీక్కు తింటున్నాయి. నక్కల ఊళలతో దిక్కులు ప్రతిధ్వనిస్తున్నాయి. ప్రజల బాధలు చూడలేక దీనినుండి బైటపడే మార్గం చెప్పమంటే, ఋష్యశృంగుడి రాకతో అన్నీ సర్దుకుంటాయని కొందరు చెప్పారు. ఏ కారణం చూపక ఋష్యశృంగుణ్ణి ఇక్కడికి రప్పిస్తే మహర్షి విభాండకుడికి కోపం వచ్చి ఎక్కడ శపిస్తాడో అని భయం కలిగింది. కానీ తనయుడిని వివాహనిమిత్తమై తీసుకువెళ్లినట్లు చెబితే ఆయన కోపగించడు కనుక, ఆయనకిచ్చి వివాహం చేయడానికి రోమపాదుడు తన మిత్రుడైన దశరథుడి కుమార్తె శాంతను తనకు పెంపకానికి ఇవ్వమని అడిగాడు. భవిష్యత్తు నెరిగిన దశరథుడు ఆనందంగా తన కుమార్తెను మిత్రుడికి ఇచ్చాడు.

ఋష్యశృంగుడు పుట్టిననాటి నుంచి అడవులలో తిరుగుతూ ఉండే వాడు (అందుకే ఆయనకు కక్షీవాన్ అని పేరువచ్చింది). ఆయన తన తండ్రిని దర్శింపవచ్చే ఇతర మునులను తప్ప ఇంకెవరినీ చూసి ఉండలేదు. ఎప్పుడూ తపస్సులోనే కాలం గడుపుతూ ఉండటం వల్ల ఎక్కడికీ వెళ్లేవాడు కాదు. ఆయనకు స్త్రీజాతి ఒకటి ఉన్నదనే విషయమే తెలియదు....

ఉ. శాంతుడు ఋష్యశృంగుడను సన్ముని యున్నయెన్ ధరిత్రికిన్
సంతత వర్షణంబగు భృశం బగునట్టి వరంబు దొల్లి వృ
త్రాంతకుచే దయం బడసె సమ్మకి గావున ఋష్యశృంగువే
దాంతని వేది రా బనుపు యంగ మహీశ్వర నీదు నేర్పునన్ ॥
(భార. ఆదిపర్వం)

అటువంటి ఆ ఋష్యశృంగుడి పాదం ఎక్కడ పడితే అక్కడ వర్షం పడుతుంది. అలా ఆయనకు ఇంద్రుడు వరమిచ్చాడు. ఆయనను రప్పించండి, అంటూ మంత్రులు రోమపాదుడికి సలహా ఇచ్చారు. స్త్రీ విషయమే ఎరుగని ఆ మునిబాలుణ్ణి రప్పించడానికి చతురత గల్గిన సుందరాంగులను అడవికి పంపడం జరిగింది.

ఒంటరిగా సమిధల కోసం అడవిలోకి వచ్చిన ఋష్యశృంగుడి వద్దకు వాళ్లు ఎంతో మనోహరంగా పాడుతూ వెళ్లారు. వారి గాత్ర మాధుర్యాన్ని, రూపలావణ్యాన్ని ఆయన ఆశ్చర్యంగా చూశాడు. వారు ఆయనతో చనువుగా మాట్లాడుతూ తినడానికి రకరకాల తీపి పదార్థాలు పెట్టారు. ఆయన అమాయకంగా చూస్తూ వారికి నమస్కరించి ఋషి పుంగవుల్లారా! మీరెక్కడివారు? మీ ఆశ్రమాలెక్కడ ఉంటాయి? మీరు నాకిప్పుడు పెట్టిన తియ్యని పండ్లు ఏ చెట్లకు పండుతాయి? మీరింత అందమైన కోమల శరీరాలతో ఎలా ఉన్నారు?

"మాకు కొమ్మొక్కటి మస్తకమ్మునను
మీకు కొమ్ములు రెండు మెరసె రొమ్మునను"

(రంగనాథ రామాయణం)

అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు. వారు నవ్వుతూ వారి ప్రశ్నలకు జవాబులు చెప్పి విభాండక ఋషి వస్తాడనే భయంతో "రేపు మేము మళ్లా వస్తాము, నీవు సిద్ధంగా ఉంటే మా ఆశ్రమానికి తీసుకువెళతా"మని చెప్పి వెళ్లారు.

తెలియని ఆవేదనకు గురియైన ఋష్యశృంగుడు రెండవరోజు వాళ్ల వెంట అంగదేశానికి వెళ్లిపోయాడు. ఆయన అడుగుపెట్టగానే ఆ రాజ్యంలో ధారాపాతంగా వర్షం కురిసింది. ఋషి పుత్రుడొచ్చాడని తెలియగానే రోమపాదుడు సాదరంగా ఆయనను తీసుకుపోయి శాంతనిచ్చి పెండ్లి చేశాడు. తరువాత రోమపాదుడి కోరికపై ఋష్యశృంగుడు ఇంద్రుని గూర్చి ఇష్టిచేయించగా ఆయనకు చతురంగుడనే కుమారుడు కలిగాడు. రాబోయే సూర్యసావర్ణి కాలంలో ఈ ఋష్యశృంగుడు సప్తఋషులలో ఒకడు కాబోతున్నాడంటుంది భాగవతం.

అక్కడ రోమపాదుడు రాజ్యం సుభిక్షమైపోయి, ఇటు అల్లుడు, అటు కుమారుడు లభించగా ఆనందపడుతుంటే ఇక్కడ దశరథుడు పుత్రులులేక విలపిస్తున్నాడు.

"బ్రహ్మచర్యేణ ఋషిభ్యో, యజ్ఞేన దేవేభ్యః
ప్రజయా పితృభ్య, ఏషవా అన్నృణోయః"

బ్రహ్మచర్యం చేత ఋషుల ఋణం, యజ్ఞం చేత దేవఋణం, బిడ్డలను కనడం చేత పితృఋణం తీర్చాలని చెబుతోంది శ్రుతి.

శ్లో॥ పుత్రేణ లోకాన్ జయతి, పౌత్రేణానం త్యమశ్నుతే ।
అథ పుత్రస్య పౌత్రేణ, నాకమే వాధిరోహతి ॥

(బోధాయన స్మృతి)

పుత్రులచేత లోకాలను జయించు, మనవళ్లచేత అనంత సుఖాలనుభవించు, ముని మనవడి చేత స్వర్గాన్ని అధిరోహించమని, స్మృతులు చెబుతున్నాయి.

"బైగలాని మోరే సుత నాహి! "

సమస్త సంపదలతో తులతూగే శౌర్యవంతుడైన దశరథుడికి కూడా గ్లాని తప్పలేదు. అయ్యో! నాకు కొడుకులు కలగలేదే అని చింతించాడట ఆయన.

సరే ఇక సంతానం కొరకు అశ్వమేథయాగం చేద్దామని తలపెట్టి కూడా, సుమంత్రుడి సలహాతో అంగరాజ్యానికి వెళ్లి తన అల్లుడు ఋష్యశృంగుడిని బిడ్డ శాంతని తీసుకొని వచ్చాడు.

దశరథుడిచ్చిన దానాలతో సంతుష్టుడైన మహర్షి ఆయనకు సంతానం కలిగేటట్లుగా సంకల్పించాడు. హోమియోపతి వైద్యంలో దాదాపు 14 వందల మందులున్నాయి. కానీ వైద్యమంతా ఈ మందులపై గాక, ఇచ్చే వైద్యుడిమీదే ఆధారపడి ఉంటుంది. మంచి అనుభవజ్ఞుడైన వైద్యుడు రోగిని జాగ్రత్తగా పరీక్షించి (అది ఎన్ని సంవత్సరాల నుండి నిలిచి ఉన్న మొండి జబ్బైనా సరే) మందువాడితే ఒకే మాత్రతో ఆ జబ్బు తగ్గిపోతుంది. అలాగే పుత్రకామేష్ఠి ఎంత గొప్పయజ్ఞమైనా కూడా నిజానికి ఋష్యశృంగుడి లాంటి మహాఋత్విక్ చేత సంకల్పించబడింది కనుకనే దశరథుడికి సంతానం కలిగింది. ఆయన తన రోమాలచేతనే (రోమం అన్న పదానికి కిరణం అని కూడా అర్థమున్నది) దశరథుడి సమస్త పాపాలు అంతం

చేసి స్వయంగా పరమాత్మే ఆయన పుత్రుడై పుట్టే అర్హతను కలగజేశాడు.

"భగతి సహిత ముని ఆహుతి దీన్హై।
ప్రగతి అగిని చరుకరలీన్హై" ॥

ఋష్యశృంగమహర్షి భక్తితో ఆహుతు లివ్వగా, అగ్నిదేవుడు చరును (హవిష్యాన్నాన్ని) చేత పుచ్చుకొని ప్రత్యక్షమైనాడు.

ఇక్కడివరకు వర్ణించిన వేదం, ఇక్కడ అగ్ని యొక్క ప్రాచుర్యాన్ని వివరిస్తున్నది. మాతా పితృల అనుసంధానంలో ఉత్పన్నమయ్యేవారు అన్నమయ శరీరధారులైన పుత్రులు. ఆకాశము పృథ్వియొక్క అనుసంధానంలో ఉత్పన్నమయ్యేది అగ్ని. అనాదిగా పరమాత్మ స్వరూపంగా ఎంచబడి పూజించబడుతున్న భూతం అగ్ని. పంచభూతాలలో మరి ఏ ఇతర భూతానికీ ఈ స్థానం లభించలేదు. అందుకు అనేక కారణాలున్నాయి. 1). నీరు నిమ్న స్థానాలకు ప్రవహిస్తుంది, భూమి జడమై స్థిరంగా గమ్యరహితంగా ఉంటుంది, ఆకాశం ఏ ఇంద్రియానికి అందక ఉంటుంది, చంచలమైన వాయువుకు కూడా గమ్యం లేదు - కాని అగ్ని ఊర్ధ్వగామి అది ఎప్పుడూ పైకే వెళుతుంది. అగ్నిని తలక్రిందులుగా పట్టుకున్నాసరే అది కిందికి పోదు, పైకే వెళుతుంది. ఇది ఊర్ధ్వగామియై చేతనాన్ని స్మరింప చేస్తుంది. 2). నీరు నీచస్థానాలకు వెళ్లినా అక్కడే నిలిచి మనకు కనిపిస్తుంది, నిరంతరం ఒకే స్థలంలో ఉండటం వల్ల అది దుర్గంధం కూడా ఇస్తుంది (నీరు స్వభావతః స్వచ్ఛం, గంధరహితం అయినా భూమి ఇతర పదార్థాల సంయోగం వల్లనే దుర్గంధం) కానీ అగ్నిపైకి వెళ్లి అదృశ్యమౌతుంది, ఆకారం నుండి నిరాకారానికి అది ప్రయాణిస్తుంది. 3). తనలో ఏది వేసినా శుద్ధమైనదాన్ని మిగిల్చి అశుద్ధమైన దాన్నంతా కాల్చివేస్తుంది. 4). ఇంధనాన్ని కాల్చిన తరువాత తానుకూడా మిగలదు. ఇది గురువు చేసేపని. శిష్యుణ్ణి ఆకారం నుండి నిరాకారానికి పంపి (అహంకార రహితుడిని చేసి) తాను కూడా అందులో లీనమౌతాడు. ఇతరులను దహించి తాను సుఖపడదామనుకునేవాడు దుర్మార్గుడు, తాను అంతమైనా ఇతరులు సుఖపడా

లనుకునేవాడు సన్మార్గుడు. ఒకటి అధర్మమైతే ఇంకొకటి ధర్మం - కానీ ఆధ్యాత్మతత్త్వం "ధర్మాధర్మ వివర్జిత పంథా" ధర్మాధర్మాలకు అతీతమైన మార్గం. ఇదే అగ్నియొక్క స్వభావం.

"సనః పితేన సూనవేగ్నే సూపాయనోభవ
సచస్వా నః స్వస్తయే।" (ఋగ్ : 1-2-9)

"ఓ అగ్నీ! తండ్రి ఎలాగైతే స్వయంగా పుత్రుడిని చేరవస్తాడో, అలాగే నీవు మాకు చాలా సులభంగా లభిస్తావు. నీవు మాకు శుభాల నిత్తువుగాక".

"యహ హబి బాంటిదేహు నృప జాఈ ।
జథా జోగ జెహి భాగ బనాఈ" ॥

పాయస పాత్రను చేత ధరించి ప్రత్యక్షమై అగ్నిదేవుడు, "హే రాజన్! ఈ ప్రసాదాన్ని నీ పట్టపురాణులకు యోగ్యతను, అవసరాన్ని దృష్టిలో పెట్టుకొని పంచిపెట్టు" అన్నాడు.

అసలు యజ్ఞం ఒక వితరణ (పంచిపెట్టే ప్రక్రియ. వ్యక్తి ఎప్పుడయితే స్వార్థంతో వ్యక్తిగత ఆకాంక్షలను సంపూర్ణం చేసుకోవడానికి కర్మ చేస్తాడో, ఆ కర్మలు స్వభావతః ఇతరుల స్వార్థపూరిత కర్మలకు విఘాతాలై నిలుస్తాయి. కానీ అవే కర్మలు తన కొరకు గాక సమష్టి (అందరి) కొరకు చేసినప్పుడు వితరణ ప్రక్రియ యోగ్యతను, అవసరాన్ని బట్టి జరుగుతుంది. ఆ ప్రక్రియ ఎవరినీ బాధపెట్టదు. తాను ఒంటరిగా కర్మ చేసినప్పుడు దాని ఫలితం కూడా తానే ఒంటరిగా పొందాలని ఆలోచిస్తాడు మానవుడు. కానీ ఇది ఒక భ్రాంతి. ఒంటరిగా చేసేది, చేయగలిగింది అయిన కార్యమేదీ ఈ ప్రపంచంలోనే లేదు. ప్రకృతి యొక్క క్రియాకలాపాలలో ప్రతి అణువులోను సమష్టి సామూహిక సహకారం కనిపిస్తుంది. యజ్ఞంలో అగ్నికి ఇతర దేవతలకు ఆహుతు లివ్వడంలో గల తాత్పర్యం ఇదే. ప్రకృతి సహకారాన్ని అర్థిస్తూ వ్యక్తి చేసే ప్రార్థన ఈ యజ్ఞం. లేదా సమష్టి తనకిస్తున్న సహకారానికి ఇది కృతజ్ఞత తెలిపే విధానం. ఏ వస్తువునన్నా మనం ఇచ్చినప్పుడు అది వస్తురూపంలో పరివర్తితమై అది మనకు మళ్లీ లభిస్తుంది.

వస్తు సంగ్రహంలో తామేదో పొందినట్లు, పంచిపెట్టడంలో పోగొట్టుకున్నట్లుగా సాధారణంగా కనిపిస్తుంది. కానీ అది నిజం కాదు. రైతు ధాన్యాన్ని గాదెలో దాచుకుంటే అన్న రూపంలో అది సమాప్తమై పోతుంది, కానీ అదే కొన్ని గింజలయినా భూమిలో చల్లితే అంతకు ఎన్నోరెట్లు అధికంగా ఫలితం వస్తుంది. అందుకే "తిన్నది నీది కాదు, పంచిందే నీది" అని చెప్పబడింది.

దీన్నే గీతాచార్యుడు "పరస్పరం భావయంతః" మీరు దేవతలకు (ప్రకృతి శక్తులకు), వారు మీకు పరస్పరం ఇచ్చి పుచ్చుకోవడంలో "ఏవం ప్రవర్తితం చక్రం" ఈ ప్రక్రియ చక్రంలా కొనసాగుతుంది అంటాడు. ఇలా ఆహుతి రూపంలో అగ్నిలో వేయబడ్డ అన్నం వ్యర్థం కాలేదు - ప్రతిదానంగా అగ్నిచరు (పాయసం)ను ప్రసాదించాడు.

చూడండి - అగ్నిలో వేసింది అన్నం. పొందింది పాయసం. ఇలా అగ్ని పాయసం అందించడమే గాక "అవసరాన్ని యోగ్యతను బట్టి నీ పట్టపురాణులకు దాన్ని పంచు" అని సలహా కూడా ఇచ్చాడు. ఇందుకు కారణమేమిటి? కైకేయితో దశరథుడి వివాహమయ్యే సమయంలో కేకయరాజుకు ఆయన పౌత్రులకే రాజ్యాన్ని ఇచ్చేట్టుగా దశరథుడు మాట ఇచ్చాడు. ఈ స్థితిలో కౌసల్యకు పాయసం వల్ల సంతానమైతే రఘుకుల రీతి ననుసరించి ఆవిడ పెద్దభార్య కనుక ఆవిడ సంతానానికే రాజ్యార్హత ఉంటుంది. ఈ విధంగా సింహాసనం యొక్క ఉత్తరదాయిత్వం వివాదగ్రస్త మౌతుంది. కనుక ఇటువంటి సమయంలో పాయసం కేవలం కైకేయికే ఇస్తే సరిపోతుందనే భావం దశరథుడి మనసులోకి ప్రవేశించే అవకాశం ఉంది. అలా ఏ ఒక్క వ్యక్తికో లాభాన్ని చేకూర్చే స్వార్థ ప్రక్రియ యజ్ఞంగా పిలవబడదు. అందుకే నీ ఇష్టానిష్టాలు, నీ పూర్వపు వచనాలతో బద్ధుడివి కాకుండా, న్యాయంగా అర్హతలను (పరమాత్మను గర్భాన ధరించగల యోగ్యత) ప్రజల యొక్క అవసరాన్ని ప్రజలు కోరుకునే ధర్మాత్ముడైన రాజును ఏ తల్లి ఇవ్వగలదో ఎరిగి పాయసాన్ని పంచమన్నాడు.

ఏదైనా పంచేటప్పుడు, అది అందరికి సమానంగా ఇవ్వడం న్యాయం అనిపిస్తుంది. కానీ అది నిజం కాదు. ఆకలిని బట్టి భోజనం వడ్డించాలి. కొందరు ఎక్కువ తినేవాళ్లుంటారు. కొందరు తక్కువ తినేవారుంటారు. అందరికీ సమానంగా పంచడం వల్ల కొందరు అర్ధాకలితో లేచిపోవలసి వస్తుంది, కొందరికి అజీర్తి కలగడంగాని లేక పదార్థం వ్యర్థం చేయడం గానీ జరుగుతుంది. కనుక అందరికీ శుభాన్ని చేకూర్చే భావనను ప్రేమ అన్నారేగానీ అందరినీ సమానంగా చూసే ప్రక్రియను ప్రేమ అనలేదు. నిజమైన ప్రేమలో సమానత్వం లేదు, సర్వజన శ్రేయస్సు ఉంది, దీన్నే యజ్ఞం అన్నారు.

దీన్ని దృష్టిలో ఉంచుకునే దశరథుడు పాయసాన్ని పంచాడు. ఈ పాయసం పంచబడిన గాథలు ఒక్కొక్క రామాయణంలో ఒక్కొక్క రకంగా ఉంది. ఇవన్నీ కల్పాంతర గాథలు, మచ్చుకు మూడు చూద్దాం.

వాల్మీకి రామాయణాన్ని అనుసరించి, శ్రీమహావిష్ణువు తనను నాలుగు భాగాలుగా చేసుకొని దశరథుడిలో ప్రవేశించాడు. దశరథుడు పాయసంలో అర్ధభాగాన్ని కౌసల్యకు, మిగిలిన దాంట్లో అర్ధభాగాన్ని సుమిత్రకు, ఆ మిగిలిన దాంట్లో అర్ధభాగాన్ని కైకేయికి ఇచ్చి, మిగిలిన పాయసాన్ని తిరిగి సుమిత్రకిచ్చాడు. ఇక శిశువులు జన్మించిన విధానం ఇలా ఉంది. విష్ణువులో అర్ధభాగం రాముడై పుట్టాడు, చతుర్థ భాగం భరతుడై పుట్టాడు, అర్ధభాగం లక్ష్మణ, శత్రుఘ్నులై పుట్టారు. జన్మఘట్టం లోని ఈ మూడు అంశాలకు ఏకవాక్యత కుదరడం లేదు. విష్ణువు తనను భాగించుకున్న తీరు వేరు, రాజు పంచి యిచ్చిన తీరు వేరు. వారిలో ఉన్న విష్ణ్వంశల తీరు వేరు. ఈ క్రింద చూడండి...

| | శ్రీరామ | లక్ష్మణ | భరత | శత్రుఘ్న | మొత్తం |
|---|---|---|---|---|---|
| విష్ణువు తనను భాగించుకున్న తీరు | ¼ | ¼ | ¼ | ¼ | 1 |
| పాయసం భాగింపబడిన తీరు | ½ | ¼ | 1/8 | 1/8 | 1 |
| శిశువులలో విష్ణ్వంశ ఉన్నతీరు | ½ | ¼ | ¼ | ¼ | 1¼ |

పైగా రాముడు అర్ధవిష్ణ్వాంశలో, భరతుడు నాలుగవ వంతుగా లక్ష్మణ శత్రుఘ్నులు అర్ధవిష్ణ్వాంశగా ఉంటే, మొత్తం ఒకటి కాక, ఒకటిపైన నాలుగవ వంతుగా కనిపిస్తోంది. దీనికి పరిష్కారమేమిటి?

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే॥

అది పూర్ణం, ఇది పూర్ణం. ఎందుకంటే పూర్ణం నుండి పూర్ణమే ఉత్పన్నమౌతుంది. అలాగే పూర్ణం నుండి పూర్ణం తీసివేయగా పూర్ణమే మిగులుతుంది అంటుంది ఉపనిషత్తు. ఆ పరమాత్మ అందరిలోనూ అవ్యక్తంగా (కనపడక) పూర్ణంగానే ఉన్నాడు. కానీ వారివారి యోగ్యతను బట్టివారిని అనుగ్రహిస్తున్నాడు. అయితే సాధనలో వారి వారి స్వయం కృషిని బట్టి వారి గుండా ఆయా స్థాయిలో ఆయన ప్రకటమౌతున్నాడు. విష్ణువు తనను భాగించుకున్న తీరు సమానంగా ఉంది. (ఇది అస్తిత్వ సత్యం) కానీ అర్హతను బట్టి పాయసం పంచబడింది. (ఇది యోగ్యత ననుసరించిన అనుగ్రహం) మళ్లీ పరమాత్మ ప్రకటమైన తీరువేరు (ఇది సాధన ననుసరించిన ఫలితం).

ఇక ఒకటిని మించి ఇంకొక నాలుగవ వంతుగా కనిపించే పరమాత్మ తత్త్వ విషయం -

"స భూమిం విశ్వతో వృత్వా, అత్యతిష్ట ద్దశాంగులం"

ఆ విరాట్ పురుషుడు సంపూర్ణ విశ్వాన వ్యాపించి ఆపైన పది అంగుళాలు పెరిగాడు అంటుంది వేదం. పంచతత్త్వాలతో తయారయ్యింది ఈ సృష్టి జడ చేతనాలన్నింటికి ఆ ఐదు తత్త్వాలే మూలం. ఈ తత్త్వాలకు నాశనం లేదు ఇవి యథాతథంగా ఉంటాయి. కాకపోతే వీటితో తయా రయిన జడచేతనాలన్నీ తమ రూపాలను మారుస్తూ ఉంటాయి. చెట్టు తగలబడి పోతే అందులోని అగ్నితత్త్వం సమష్టి అగ్నిలోనూ, భూతత్వం భూమిలోనూ, ఆకాశతత్వం ఆకాశంలోనూ వాయుతత్వం వాయువులోనూ, జలతత్వం జలంలోనూ కలిసిపోతుంది. అక్కడ ఆ రూపం కనబడదేగాని, ఆ రూపం

ఏ తత్వాలతోనయితే తయారయ్యిందో అవి యథాతథంగా ఉంటాయి. ఈ ప్రకృతి నియమాలకు ఎవరూ ఎదురీదలేరు. ఈ విషయాన్ని చూపడానికే రాముడు దారి అడుగుతే సముద్రుడు అది తన స్వభావానికి విరుద్ధమని కావాలంటే వంతెన నిర్మించుకొని దాటమని చెప్పడం కనిపిస్తుంది. అలాగే విప్రనారాయణుడి బాధను పోగొట్టడానికి గర్భగుడిలోని బంగారుపాత్రను స్వయంగా పరమాత్మే తీసుకువెళ్ళి వేశ్యతల్లికిచ్చి, విప్రనారాయణుని లోపలికి రానివ్వమంటాడు. మరి సర్వసృష్టికర్త అయిన పరమాత్మ ఒక బంగారు గిన్నెను సృష్టించలేక పోయాడా? లేదు అలా సృష్టించడం ప్రకృతి ధర్మాలకు విరుద్ధం. ఈ పంచభూతాలలో కించిత్తు కూడా పెరగదు, తరగదు కాకపోతే ఒక ప్రదేశంలోని వస్తువును ఇంకొక ప్రదేశంలోకి రప్పించే సిద్ధిని సాధించవచ్చును గాని, పదార్థాలను ఎవరూ సృష్టించలేరు.

మరి పంచభూతాత్మకమైన సృష్టే సర్వస్వమైతే పరమాత్మ కూడా ఇందులోకే వస్తాడా? లేక వేరుగా ఉంటాడా? వేదాంతం ఆయనను అభిన్ననిమిత్త ఉపాదాన కారణంగా చెబుతుంది. అంటే కుమ్మరివాడూ ఆయనే (నిమిత్త కారణం), మట్టికూడా ఆయనే (ఉపాదాన కారణం). అయితే భక్తితత్వం అంతటితో ఆగదు. నృత్యం నృత్యకారుడి నుండి వేరు కాని మాట నిజం. (సృష్టి-సృష్టికర్తనుండి వేరు కాదు) కానీ కేవలం నృత్యం మాత్రమే నృత్యకారుడు కాడు, ఆయన నృత్యాన్ని కూడా అధిగమించి ఉన్నాడు అంటుంది. ఆ తత్వాన్ని పురుషసూక్తం "సమస్త సృష్టిలో వ్యాపించిన పరమాత్మ, మరొక పది అంగుళాలు పెరిగాడు" అంటుంది.

సమస్త చరాచర సృష్టి తానై ఉండి అది కాక 1). నారాయణ, 2) లక్ష్మి, 3). నారద, 4). ధనుః, 5). కౌమోదకి, 6). శంఖం, 7). చక్రం, 8). గరుడు, 9). ఆదిశేష, 10). బ్రహ్మగా పది రూపాలలో పది అంగుళాలు పెరిగాడని చెప్పవచ్చు. ఈ విషయం తెలియజేయడానికే పోతన భాగవతంలోని గజేంద్రమోక్షంలో, ఆపదలో ఉన్న ఏనుగును రక్షించడానికి

ఆత్రంగా పరుగెత్తిన పరమాత్మ వెంట "తావొచ్చిరొయ్యన వైకుంఠ పురంబునంగలుగు వారాబాల గోపాలమున్" లక్ష్మి, శంఖం, చక్రం, గద, గరుడుడు, నారదుడు మొదలైన వారంతా వచ్చారని చెబుతాడు.

అలా ఆర్తులను రక్షించడానికి వచ్చే పరమాత్మ సృష్టికి అతీతుడై ఉంటాడని చెప్పడానికే మొత్తం తత్త్వాన్ని ఒకటిపై పావు భాగంగా (1 1/4) వాల్మీకి రామాయణం వర్ణిస్తోంది. పరమాత్మ పూర్ణుడు ఆ పూర్ణత్వాన్ని '1' సంఖ్యతో సూచిస్తారు. కానీ మన మనోపరిధిలోకి వచ్చే '1' పూర్ణమెలా అవుతుంది. మనస్సులో దాన్ని అర్థం చేసుకొని మనం మొత్తం పరతత్త్వం అంతా అర్థమయ్యిందని పొరబాటు పడతామేమోనని పూర్ణాన్ని అధిగమించి కూడా పరమాత్మ ఉంటాడు, అంటే ఆయన మన ఇంద్రియాలకు అందనివాడు, మన మనోనిర్మితమైన గణితానికి అందనివాడు అని చెప్పడం జరుగుతుంది.

అందుకే ఆయనను రాముడన్నారు. రః+అమః=రమించు వాడు (ఆనందిచువాడు), మా=మితిః=ప్రమాణము, నవిద్యతే మా యస్య సః= అమః-మితిలేనివాడు (కొలతలేనివాడు), రశ్చాసౌ అమశ్చ= (ఆనంద స్వరూపుడు, మితిలేనివాడు కనుక రాముడు)

"ఆనంద రూపో నిష్పరిమాణ ఏష లోకైశ్చ తస్మాద్రమతే తేన రామః"

ఆనంద స్వరూపుడును, పూర్ణుడును, లోక రమణుడును అవడంవల్ల రాముడు.

ఆయనకు విశ్వం అనికూడా పేరు. వి=విశేషంగా(ఎక్కువగా) శ్వ=వ్యాపించేవాడు (పెరిగేవాడు)

విశ్+వం=విశ్వం, జగత్తును సృష్టించి అందులోకి ప్రవేశించినవాడు (తత్సృష్ట్వా, తదేవాను ప్రావిశత్, అనికూడా అర్థం చెప్పుకోవచ్చు.

సరే ఇదంతా వాల్మీకి రామాయణంలో పాయసం పంచబడ్డ విధానం. ఇక తులసీ రామాయణంలో.....

అర్ధభాగ కౌసల్యహి దీన్హా। ఉభయ భాగ ఆ ధే కరకీన్హా ॥
కైకే ఈ కహనృపసో దయఊ। రహ్యోసో ఉభయ భాగపుని భయఊ ॥
కౌసల్యా కైకేఈ హాథ ధరి। దీన్హ సుమిత్రహి మన ప్రసన్నకరి ॥

పాయసంలో అర్ధభాగాన్ని దశరథుడు కౌసల్యకిచ్చాడు. మిగిలిన అర్ధభాగంలో రెండు భాగాలు చేసి ఒక భాగాన్ని కైకేయి కిచ్చాడు. మిగతా ( 1/4) భాగాన్ని మళ్లీ రెండు భాగాలుగా (1/8, 1/8) చేసి, కౌసల్యా కైకేయిల కిచ్చి వారి చేతుల మీదుగా సుమిత్రకు మనో ప్రసన్నతతో ఇప్పించాడు.

అప్పుడు రాముడు 1/2 భాగంగానూ, భరతుడు 1/4 భాగంగానూ, లక్ష్మణ, శత్రుఘ్ను లిరువురు 1/8, 1/8 భాగాలుగా గుర్తించబడ్డారు.

ఇక ఆధ్యాత్మ రామాయణంలో....

రాజు పాయసాన్ని కౌసల్యా కైకేయిలకు చెరిసగం పంచి ఇస్తాడు. తరువాత అక్కడికి సుమిత్ర వస్తుంది. అప్పుడు వాళ్లిద్దరు తమ పాయస భాగాల నుండి చెరిసగం చేసి ఆ రెండు భాగాలను సుమిత్ర కిస్తారు. ఈ విధంగా నలుగురు అన్నదమ్ములు సమానమైన విష్ణు అంశ గలవారైనా రని చెప్పవచ్చు.

ఈ రెండు రామాయణాలలో లక్ష్మణుడు రాముడిని, శత్రుఘ్నుడు భరతుడిని ఎందుకు అనుసరిస్తారు అనే ప్రశ్నకు జవాబు కనిపిస్తుంది.

హవి భక్షణ వల్ల మాతలు ముగ్గురూ గర్భాలు ధరించారు. కౌసల్య మాత ఎంతకాలం గర్భం ధరించింది అనే విషయంలో వాల్మీకి "తతశ్చ ద్వాదశే మాసే" పన్నెండు నెలలని, వ్యాసుడు ఆధ్యాత్మంలో "దశమే మాసి కౌసల్యా సుషువే పుత్రమద్భుతమ్" పదినెలలని చెబుతారు - దీనిని కల్పభేద వ్యాఖ్యగా చెప్పుకోవచ్చు.

తులసీ విరచితమైన రామచరిత మానసం ఒకేసారి నాలుగు కల్పాల రామకథను తెలియజేస్తుంది కనుక అక్కడ ఆయన "సుఖజాత కథంక

కాల చలిగయ ఊ" సుఖంగా కొంతకాలం గడిచిపోయిం తరువాత అంటాడు తప్ప ఎంతకాలమని వివరించడు.

దోహా ॥ జోగ లగన గ్రహ వార తిథి, సకలభ ఏ అనుకూల ।
చర అరు అచర హరషజుత, రామజనమ సుఖమూల ॥

యోగ, లగ్న, గ్రహ, వార, తిథులు అనుకూలం కాగా, చరా చరులు హర్షితం కాగా శ్రీరామచంద్ర ప్రభువు ఆవిర్భవించారు.

శ్రీరామచంద్ర స్వామి వారి జనన కుండలి

| | | | |
|---|---|---|---|
| ర | | శు | |
| బు | పునర్వసు<br>చైత్రమాసము<br>శుద్ధనవమీ<br>స్వభాను సంవత్సర | | గు<br>ల<br>చ |
| కు | | | |
| | | శ | |

శ్రీరాముని జననం - వాదోపవాదాలు

శ్రీరామచంద్రుడు లోక ప్రసిద్ధుడు. ఇతడు జన్మించిన సందర్భం లోని గ్రహకూటమి వాల్మీకి రామాయణంలో వర్ణింపబడింది.

తతో యజ్ఞే సమాప్తేతు ఋతునాం షట్ సమత్యయుః।
తతశ్చ ద్వాదశే మాసే చైత్రే నావమికే తిథౌ॥
నక్షత్రే దితిదైవత్యే స్వోచ్ఛ సంస్థేషు పంచసు।
గ్రహేషు కర్కటే లగ్నే వాక్పతా దిందునా సహ॥
ప్రోద్యమానే జగన్నాథం సర్వలోక నమస్కృతమ్।
కౌసల్యా జనయ ద్రామం సర్వ లక్షణ సంయుతమ్॥

(రామా : బాల : 18 సర్గ, 7-10శ్లో)

యజ్ఞం సమాప్తమైంది. ఆరు ఋతువులు గడిచాయి. 12వ మాసం చైత్రంలో నవమి తిథి అదితి దేవతాకమైన పునర్వసు నక్షత్రంలో స్వోచ్ఛ స్థానాలలో ఐదుగ్రహాలుండగా కర్కాటక లగ్నంలో చంద్రునితో కలిసిన బృహస్పతి ఉదయించుచుండగా సర్వలోక నమస్కృతుడు, జగన్నాథుడు సర్వ లక్షణ సంయుతుడు నైన శ్రీరామచంద్రుని కౌసల్య కన్నది అని పై శ్లోకాల సారం.

ఇందు పన్నెండవ మాసం చైత్రం అనేదానికి కొందరు ఇలా అర్థం చెపుతున్నారు."శ్రీరాముని జననానికి పూర్వం వైశాఖంతో సంవత్సరం ఆరంభమయ్యేది. అందుచేతనే సంవత్సరంలో పన్నెండవది చైత్రమాసం. శ్రీరాముని జననం అయిన తరువాత అదే సంవత్సరారంభంగా గుర్తించ బడింది.

కాని, ఆరు ఋతువులు గడిచినాయి. యజ్ఞం అయిన తరువాత పన్నెండవ మాసం అవడం వలన యజ్ఞం పూర్తి అయిన తరువాత మాసాల్లో చైత్రం పన్నెండవదే గాని సంవత్సరంలో పన్నెండవది కాదు అని అర్థం చేసుకోవడం న్యాయం.

కౌసల్యా గర్భధారణకు పాయస భోజనమే కారణమని సంప్రదాయ వాదుల అభిప్రాయం. అట్టి స్థితిలో 12 మాసాలు శ్రీరామచంద్రుడు కౌసల్యా గర్భంలో నివసించాడు. తొమ్మిది మాసాలే గర్భధారణ సామన్యం. ఈతడు 12 మాసాలు గర్భంలో నివసించడానికి కారణమేమిటి?

ఈ ప్రశ్నకు పండితుల సమాధానం ఇలా ఉంది. 'వేదమే రామాయణంగా అవతరించింది. వేదంలో 'సంవత్సరేణ జాయతే' అని ఉన్నందువల్ల ఆ వేదవాక్యాన్ని సత్యం చేయడానికి శ్రీరామచంద్రుడు 12 మాసాలు తల్లి గర్భంలో ఉన్నాడు. లోకంలో సహజంగా తొమ్మిది మాసాలే గర్భంలో ఉండటం తటస్థిస్తూ ఉంటే వేదంలో సంవత్సరం అని ఎందుకుంది? అనేది కూడా ప్రశ్నే. కాని తండ్రి గర్భంలో 3 మాసాలు, తల్లి గర్భంలో 9 మాసాలు కలిసి సంవత్సరం అందరికీ పూర్తి అవుతుంది.

శ్రీరాముని విషయంలో పాయసం ద్వారా తల్లి గర్భంలో ప్రవేశించినందు వలన తండ్రి గర్భంలో లేనందువలన సంవత్సరకాలము తల్లి గర్భంలోనే పూర్తిచేసుకోవలసి వచ్చింది".

"స్వోచ్ఛ సంస్థేషు పంచసు" అనే "పంచమ సూర్యాంగారక శని గురు శుక్రేషు స్వోచ్ఛస్థాన స్థితేషు" (సూర్యాంగారక శని గురు శుక్రులు ఉచ్ఛస్థానములందుండగా) అని మహేశ్వరతీర్థులవారు తమ తత్త్వదీపికా వ్యాఖ్యలో పేర్కొనగా, పంచమ గ్రహేషు స్వోచ్ఛ సంస్థేషు సూర్యగురు శుక్రాంగారక శనిషు స్వోచ్ఛస్థితేషుసత్సు" (సూర్యగురు శుక్రాంగారక శనులు తమ ఉచ్ఛస్థానములందుండగా)అని రామాయణ భూషణం అనే వ్యాఖ్యానంలో గోవిందరాజుల వారు తమ అభిప్రాయాన్ని వ్యక్తీకరించారు.

వ్యాఖ్యాతల అభిప్రాయం ప్రకారం ఐదు గ్రహాలు ఉచ్ఛలోఉన్నాయి. చంద్రుడు పునర్వసులో ఉన్నాడని చెప్పబడింది. కాబట్టి చంద్రుడు ఉచ్ఛలో లేడు.(చంద్రునకు వృషభం ఉచ్ఛ)అది చైత్రమాసం కాబట్టి మేష ప్రాంతంలో సూర్యుడుండగా సూర్యునకు 28 డిగ్రీల దూరంలో మాత్రమే సంచరించే బుధుడు తనకు ఉచ్ఛరాశియైన కన్యలో ఉండటం సంభవించదు. చంద్ర బుధులు కాక తక్కిన సూర్యాంగారక శని గురు శుక్రులకే ఆ ఉచ్ఛ సంభవిస్తుందని ఆ వ్యాఖ్యాతల అభిప్రాయం.

కాని తిథులు ఏర్పడే పద్ధతి పరిశీలిస్తే పై గ్రహస్థితి సంభవం కాదు. "ధర్మ స్సూర్యేందు సంగమః" సూర్యచంద్రులు కలిసి ఒక డిగ్రీలో ఉన్నప్పుడే అమావాస్య పూర్తవుతుంది. సూర్యునకు 180 డిగ్రీల దూరంలో చంద్రుడు ఉన్నప్పుడే పౌర్ణమి పూర్తవుతుంది. దీనిని బట్టి అమావాస్య నుండి పౌర్ణమి తిథికి 12 డిగ్రీల వంతున సూర్యునకు చంద్రుడు దూరం కావాలి. కాగా అష్టమి తిథి పూర్తి అయ్యే సమయానికి సూర్యునకు చంద్రునకు మధ్య దూరం 96 డిగ్రీలు తప్పనిసరిగా ఉండాలి. పునర్వసు 4వ పాదం మాత్రమే కర్కాటకంలో ఉంది కాబట్టి అచ్చట ఉండే చంద్రుడు 90 నుండి 93.20 డిగ్రీల మధ్యలో ఉంటాడు. 93వ డిగ్రీలో ఉన్నాడని

భావించినా నవమి ప్రారంభం అయ్యే సమయానికి సూర్యుడు 96 డిగ్రీలు వెనుక అంటే 357వ డిగ్రీకి ముందే ఉండాలి. (మీనరాశి రేవతి నక్షత్రంలో ఉండాలి) సూర్యునికి ఉచ్చ మేషరాశి. సూర్యుడు ఉచ్చలో ఉంటే నవమి తిథికి పునర్వసు నక్షత్రం (చంద్రుడున్న నక్షత్రం) కావడానికి వీలులేదు, అని పై విచారణ వలన తెలుస్తుంది.

ఈ విరోధాన్ని పరిహరించడానికి పలువురు విద్వాంసులు వేరు వేరు మార్గాలను అనుసరిస్తున్నారు.

1. వ్యాకరణశాస్త్ర సంప్రదాయం ప్రకారం నావమికే తిథౌ అంటే నవమీ సంబంధమైన తిథి అనే అర్థం చెప్పాలి. నవమి తిథి అని అర్థం చెప్పకూడదు. నవమి సంబంధమైన తిథి, అష్టమి అని చెప్పినట్లైతే పై విరోధం ఏర్పడదు అని కొందరి వాదన.

నావమికే తిథౌ అంటే నవమి తిథి అనే అర్థాన్ని వ్యాఖ్యాతలు సాధించారు. 'వినయాదిత్వాత్ స్వార్థేఠక్' అని గోవిందరాజుల వారు, 'నావమికే నవమ్యాం స్వార్థేఠగార్షః' అని మహేశ్వర తీర్థుల వారు అభిప్రాయ పడ్డారు. పై వ్యాఖ్యాతల అభిప్రాయంతో ఏకీభవించినా ఏకీభవించక పోయినా తరతరాల సంప్రదాయమైన శ్రీరామనవమిని శ్రీరామాష్టమిగా చేయడం సాహసమే. ధర్మశాస్త్ర గ్రంథాలు కూడ ఈ అంశాన్ని వ్యతిరేకిస్తాయి.

2.రాముడు జన్మించిన సందర్భంలో మీనంలోనే రవి ఉండడం సంభవిస్తుంది. కాబట్టి వాల్మీకి అభిప్రాయంలో రవికి మీనమే ఉచ్చ అయి ఉంటుందని మరికొందరి భావన.

వాల్మీకి అభిప్రాయంలో రవికి మీనమే ఉచ్చ అనడం నిరాధారమైన విషయం. విశేషించి రవికి మీనం ఉచ్చ అనే మాట ఏ ఒక్క జ్యోతిశ్శాస్త్రజ్ఞుడు చెప్పలేదు. నిరాధారమైన అంశాన్ని నిర్ధారణ చేయడం న్యాయం కాదుగదా!

3. రవి మేషంలోనే ఉన్నాడు. చంద్రుడు పునర్వసు 4వ పాదంలోనే ఉన్నాడు. ఈనాటికి ఆనాటికి గ్రహగతులలో భేదం వలన ఆనాడు నవమి తిథి

సంభవించి ఉండవచ్చును. ఆనాటి స్థితి మనకు తెలియదు కదా! అని మరికొందరి భావన.

ఆనాటి గ్రహగతులు మనకు స్పష్టంగా తెలియవనడం మాట ఎలా ఉన్నా, ఆనాడైనా ఈనాడైనా ఆకాశమండలం 360 డిగ్రీలే. సూర్యునకు చంద్రునకు మధ్య దూరాన్ని అనుసరించి మాత్రమే తిథులు ఏర్పడాలి. అందుచేత సూర్యునకు చంద్రునకు మధ్య దూరం 96 డిగ్రీలకు లోపు ఉంటే నవమిరావడం అసంభవమే అని గుర్తించక తప్పదు.

4. స్వోచ్చ శబ్దానికి స్వ+ఉచ్చ అనే విభజన చేసి స్వక్షేత్రంలో ఉన్న చంద్రుడు ఉచ్చలో ఉన్న 4 గ్రహాలు కలిపి స్వోచ్చస్థ గ్రహపంచకం అవుతుంది అని కొందరి భావన.

స్వోచ్చ శబ్దానికి స్వక్షేత్ర ఉచ్చక్షేత్రాలు అనే అర్థంలో ఇతరత్ర ప్రయోగం కనిపించే వరకు ఈ వాదాన్ని అంగీకరించడం కష్టం.

5. అసంభవ గ్రహస్థితిని వర్ణించే ఈ శ్లోకాలే ప్రక్షిప్తాలని మరికొందరి భావన. రామాయణంలో...

త్రిశంకు ర్లోహితాంగశ్చ
బృహస్పతి బుధావపి
దారుణా స్సోమ మభ్యేత్య
గ్రహస్సర్వే వ్యవస్థితాః (అయో : 41-11. శ్లో)

అనే శ్లోకం ప్రక్షిప్తమేనని 'జర్నల్ ఆఫ్ తెలుగు స్టడీస్' జులై 1988 పత్రికలో గుర్తించాము. అదే రీతిలో ఇది గూడ ప్రక్షిప్తం కావడంలో అభ్యంతరం ఏమీ ఉండదు. ఈ విషయంలో భోజుని శ్లోకం ఒకటి కనిపిస్తోంది.

"ఉచ్చస్థే గ్రహపంచకే సురగురౌ సేందౌ నవమ్యాం తిథౌ
లగ్నకర్కటకే పునర్వసుయుతే మేషం గతే పూషణి" (రా.చంపు.బాల29)

ఉచ్చలో అయిదు గ్రహాలుండగా, గురుడు చంద్రునితో కలిసి

ఉండగా, సూర్యుడు మేషమందుండగా నవమి తిథినాడు కర్కాటక లగ్నంలో పునర్వసు నక్షత్రంలో శ్రీరాముడు జన్మించాడు అని పై శ్లోక సారాంశం.

భోజుని జ్యోతిశ్శాస్త్ర పరిజ్ఞానాన్ని శంకించడం కాదు గాని పై స్థితి జ్యోతిశ్శాస్త్ర నియమాన్ననుసరించి అసంభవం. కాబట్టి స్వోచ్చస్థ శబ్దమును వ్యాఖ్యాతల వలెనే భోజుడు గూడా సరిగ్గా అర్థం చేసుకోలేదనక తప్పదు.

బెంగుళూరు సిద్ధాంతి శ్రీశివశంకర శర్మగారు వెనుకకు లెక్కలు వేసి 3 ఉచ్చగ్రహాలనీ 2 స్వక్షేత్రస్థిత గ్రహాలనీ నిర్ణయించి ఇలా వివరించారు.

గౌరీ శంభుకథా తదానవ కథా (714086714523) సృష్ట్యాదికోహర్గణః
త్రేతా ద్వాపర సంధికాల కలితే పశ్చాచ్చరాబ్దే గతే
విష్ణుర్ధాశ రథర్భభూవ భగవాన్ రామాత్మనా భూతలే
స్వభాన్వబ్దే చైత్రమాసి నవమ్యాం శుక్లపక్షకే
పునర్వసు గతే చంద్రే లగ్నే కర్కాట కాహ్వాయే
మధ్యాహ్నకాలే శ్రీరామః స్వోచ్చస్థే గ్రహపంచకే
ఆవిరాసీ జ్జగన్నాథః పూర్ణచంద్ర నిభాననః
స్వక్షేత్రగౌ చంద్రశుక్రౌ తుంగే మందేజ్య భూసురాః
ఏతే నిరయనాః ఖేటాః మేషగ స్సాయనో రవిః
బుధః కుంభే గ్రహస్థిత్యా రామాయణ చరిత్రతః
జ్ఞాత్వా జ్యోతిర్విదః కుర్యుః లక్ష్యే లక్షణ సంగతిం
(జాతక సర్వస్వం - హోరానుభవ దర్పణం 27 పేజి 1914 ప్రచురణ)

సృష్ట్యాది 28వ మహాయుగం వైవస్వత మన్వంతరం త్రేతా ద్వాపర సంధి 5 సంవత్సరాలు గడిచినాయి. సృష్ట్యాది సౌరాహర్గణం 714086714523 శనివారం మధ్యాహ్నానికి సరియైన స్వభాను సంవత్సర చైత్ర శుద్ధ నవమీ పునర్వసు కర్కాటక లగ్నం లగ్న చంద్రుడు కుంభ బుధుడు మీన రవి వృషభ శుక్రుడు కుజ గురు శనులు ఉచ్చముల యందున్నారు. ఈ గ్రహస్థితిని రామాయణోక్త ఫలములను సరిజూడ

వలసినది అని వ్రాశారు.

వారు శ్రమించి లెక్కించి సరిచూసినట్లుగా స్వోచ్చస్థే అనే శబ్దానికి స్వక్షేత్రములందు రెండు గ్రహములు, ఉచ్చక్షేత్రములందు మూడు గ్రహములు ఉన్నవని అర్థం చెప్పుకొనుట న్యాయముగా తోస్తోంది.

ఈ సందర్భంలోనే మరో చిన్న విషయం. శ్రీరాముడు నవమినాడు జన్మించాడు. అదే శ్రీరామనవమి. కృష్ణాష్టమినాడు రుక్మిణీ కళ్యాణం చేయడం లేదు. శ్రీరామనవమినాడు సీతాకళ్యాణము చేస్తున్నాము. ఈ విధానం సక్రమమేనా?అని ఒక సందేహం. సంప్రదాయజ్ఞుల అభిప్రాయాలను పరిశీలిస్తే శ్రీరామనవమినాడు రామజన్మోత్సవం. దశమినాడు పట్టాభిషేకోత్సవం చేయాలి. జననానికి పట్టాభిషేకానికి మధ్య కళ్యాణం తప్పనిసరిగదా! అందుచేత మధ్యలో కళ్యాణం చేయాలి. అంతేగాని జననం పట్టాభిషేకం వదిలేసి మధ్యలో కళ్యాణం మాత్రమే చేయడం సరియైన పద్ధతికాదు అని తేలుతోంది. కాగా ధర్మసింధువు "శ్రీరామనవమినాడు కౌసల్యా దశరథులను శ్రీరామచంద్రుని పూజించాలి" అని చెపుతోంది.

(విదేశాలలో జ్యోతిషోపన్యాసాలు, రచన - డా॥ సి.వి.బి. సుబ్రహ్మణ్యం గారి పుస్తకం నుండి కృతజ్ఞతలతో ఉద్ధరించబడినది.)

చైత్రశుద్ధ నవమి మంగళవారం పునర్వసు నక్షత్రంలో అభిజిత్ లగ్న కర్కాటకం మధ్యాహ్న సమయంలో కర్కాటకంలో చంద్ర గురువులు, కన్యలో రాహువు, తులలో శని, మకరంలో కుజుడు, మీనంలో కేతువు, శుక్రుడు, మేషంలో సూర్యుడు, వృషభంలో బుధుడు ఉండగా శ్రీరామచంద్ర ప్రభువు ఆవిర్భవించాడు. దీన్ని వేదసాగర యోగం అంటారు. ఈ వేద సాగర యోగంలో ఉత్పన్నమయ్యేవారు పూర్వజన్మలో స్వయంగా పూర్ణబ్రహ్మలు, స్వయం కర్తలు, స్వప్రకాశులు, నిరంజనులు, నిర్గుణులు, నిర్వికల్పులు, నిర్మోహులు, సచ్చిదాత్ములు అవుతారని ఆధ్యాత్మ రామాయణం చెబుతోంది.

భగవంతుడే స్వయంగా "ఋతూనాం కుసుమాకరః" ఋతువులలో నేను కుసుమాకరాన్ని (వసంతాన్ని) అని చెప్పాడు. అందులోనూ ప్రథమ మాసం యొక్క దేవపక్షం అతి పునీతమైంది. అందులోనూ తన కిష్టమైన అభిజిత్ ముహూర్తంలో - పునర్వసు (పునఃవసుః తిరిగి జన్మించడం) నక్షత్రంలో పుట్టాడు.

"అజ్ఞేయ చరురూపాన్ని ధరించిన సుందర ఆశ్చర్యమయ శిశువు కౌసల్యాది మాతలను పొంది రుదనం చేశాడు" అంటోంది వేదం. అది ఎలాగంటే..

"కావు" మని జగము మొఱలిడ
గావగ దక్షుండు దా నొకండే జగతిన్
గావుట బరువిడు వేలుపు
క్ష్మా వరసుతుడగుచు "కావు కావ" ని యేడ్చెన్
(ఆంధ్ర వాల్మీకి రామాయణం)

కాపాడమని భక్తులు ప్రార్థిస్తే, రక్షించతానొక్కడే, సమర్థుడైన ఆ పరమాత్మ కాపాడడానికి పరుగెత్తుకొని వచ్చేవాడు. ఈ రోజు పుడమి నేలే రాజకుమారుడైన కారణంగా "కావు, కావ"ని ఏడ్చాడట.

ఇది ఆ లీలామానుష విగ్రహుడి నరలీల.

వ్యక్తి ఇతరుల కర్మఫలాన్ని స్వయంగా తాను అనుభవించడానికి ఎక్కడ సిద్ధపడతాడో అక్కడే రామరాజ్య స్థాపన జరుగుతుంది. ఆ పనిని రాముడు జన్మించిన మరుక్షణమే మొదలు బెట్టాడు. చతుర్భుజ రూపంలో అవతరించిన పరమాత్మను చూసి కౌసల్యా మాత "కీ జై శిశులీల" శిశులీల చేయండి స్వామీ - మానవశిశువులా ప్రవర్తించండి అనగానే ద్విభుజరూపుడై "రోదనతానా" ఏడవడం మొదలు బెట్టాడు. ఈశ్వరుడు ఋదన వ్రతాన్ని ప్రారంభించాడు. మరి ఈశ్వరుడు ఏడుస్తుంటే మనమేం చెయ్యాలి? సానుభూతి కొరకు మనం కూడా ఆయనతో శృతి కలపి ఏడవాలా? అంటే తులసీదాసు "యహచరిత జాగా వహి" ఆయన యొక్క చరిత్రను గానం

చేద్దాం రండి అంటున్నాడు. మరి పరమాత్మ ఏడుస్తుంటే మనం పాటలు పాడటం ఏం బాగుంటుందండి? అంటే నిజానికి పరమాత్మ దగ్గర దుఃఖం ఎక్కడిది. ఆ కృపామయుడు మన దుఃఖాన్ని అంతం చేయడం కొరకు మన కన్నీళ్లనే అరువు తీసుకొని ఏడుస్తున్నాడు, కనుక ఈ రోజు నుండే మనం నిశ్చింతులమై పాటలు పాడదాం రండి, మనకు బదులు పరమాత్మ రుదనం చేస్తాడు. ఏడుపు జీవలక్షణమేగాని పరమాత్మ యొక్క స్వభావం మాత్రం కాదు. అటువంటప్పుడు ఏడ్చే పరమాత్మ జీవుడై పోయినట్లేకదా! మరి అదే నిజమైతే ఈశ్వర స్థానం రిక్తంగా ఉండిపోతుందా? ఈ ఖాళీ స్థలాన్ని మనం ఏంచేయాలి? అంటే "యే చరిత జెగావహిహరిపద పావహి" ఈ చరిత్రను గానం చేసే జీవులకే పరమాత్మ స్థానం ఇవ్వబడుతుంది. ఈ విధంగా ఈశ్వరుడు జీవుడైతే, జీవుడు ఈశ్వరుడైనాడు. హరి నరుడైతే, నరుడు హరి అయినాడు.

ఈ అనంత నాటకంలో పాత్రధారుల పాత్రలు మారుతూ ఉంటాయి. స్వయంగా పరమాత్మ అంతటివాడు మనుష్య వేషం ధరించినప్పుడు అందులో ఆనందాన్ని మనం గ్రోలకపోతే ఆ పాత్ర యొక్క సార్థకత ఏముంది?

"సునిసిసు రుదన పరమప్రియ బానీ
సంభ్రమ చలి ఆఈ సబరానీ
హర షిత జహ తహ ధాఈ దాసీ
ఆనంద మగన సకల పురబాసీ'

ఉచ్చస్వరంలో రుదనం చేసే పరమాత్మ శ్రీవాణి ఎంతదూరం వ్యాపించిందో ఆయా ప్రాంతాల నుండి జనులు రాజభవన ప్రాంగణంలోకి వచ్చారు. ఆయన ఏడుపును సామవేదగానమా అన్నట్లు విని ఆనంద డోలికల్లో తేలియాడారు.

నా ఒక్కడి రుదనం వల్ల ఇంతమంది ఆనందించగలుగుతే తప్పక నేను వీరందరి కొరకైనా సరే జీవితాంతం ఏడుపును స్వీకరిస్తాను అనుకున్నా

డట పరమాత్మ మనస్సులో.

పరమాత్మ సర్వవ్యాపక తత్త్వస్వీకారంలో ఆయన అవతార తత్త్వం ఖండిత మవదు. పరమాత్మ సర్వజ్ఞుడు, సర్వశక్తి మంతుడు, సర్వవ్యాపి అయిఉండికూడా అయోధ్యలో కౌసల్యామాత గర్భాన ప్రకటమై, కష్టాల నన్నింటినీ సహిస్తూ చివరికి రామరాజ్య స్థాపన చేయడం ద్వారా విశ్వానికి సుఖశాంతుల నిస్తాడు. ఈశ్వర సర్వవ్యాపకత కేవలం వయ్యక్తిక బోధ మాత్రమే కాగలదు. ఈ బోధ ఎవరి హృదయంలో కలుగుతుందో అతడు స్వదృష్టిలో ఆత్మ తృప్తుడౌతాడు. దానివల్ల విశ్వ సమస్యలకు సమాధానం లభించదు. పరస్పర భేదయుతమైన ఈ ధరాతలంలోనే వ్యక్తి నిరంతరం జీవించవలసి ఉంది.ఇక్కడ న్యాయముంది, అన్యాయముంది, పుణ్యాత్ము లున్నారు, పాపాత్ములున్నారు. దేశకాలాలలో ఈ భిన్నత్వం అడుగడుగునా కనిపిస్తుంది.సర్వత్రా సర్వసమయాలలోనూ పరమాత్మ వ్యాపించి ఉన్నప్పటికీ దానివల్ల భిన్నత్వం మాత్రం అంతం కాదు. వ్యవహార జగత్తులో ధర్మ సంస్థాపన కొరకు నిర్గుణ పరమాత్మ సగుణుడు కాకతప్పదు. హార్దిక (భావాత్మిక), బౌద్ధిక(వైచారిక) వ్యవహారిక ధారాతలాలలో సమత్వ స్థాపన అప్పుడే సాధ్యమౌతుంది.

"లేత చ ఢావత ఖైం చతగాఢే
కాహున లఖా దేఖ సబు ఠాఢే"

శ్రీరాముడు శివధనుస్సును లేపడం, వింటినారిని బిగించడం, బాణం సంధించడం మొదలైనవి ఎవరూ చూడలేదు. ఒక్క క్షణంలో సభాసదులకు ధనుస్సు రెండు ముక్కలై కనిపించింది. అంటే సమష్టి అహంకార చిహ్నమైన శివధనుస్సును విరవడానికి పరమాత్మ శ్రమపడలేదు. కానీ "భాల తిలకశ్రమ బిందు సుహాఏ"మిథిలానగర్ పూదోటలో కోమల మైన పూలు కోసినప్పుడు రాముడి నుదుట శ్రమబిందువు కనిపించింది. అవలీలగా శివధనుస్సు విరవగల పరమాత్మ పూలు కోస్తేనే అలిసిపోతాడా? మరి ఎందువల్ల ఆయన నుదుట చెమట బిందువు కనిపించింది? అంటే

దానికి జవాబు రామాయణంలోనే తరువాత కనిపిస్తుంది.

అరణ్యానికి ప్రయాణమౌతున్న రాముడు, సీత అరణ్యవాసాన్ని వారిస్తూ, నీవు నడవలేక శ్రమపడతావని ఉద్బోధిస్తుంటే, సీతమ్మ నవ్వుతూ....

శ్రమకన సహితశ్యామ తనుదేఖే
కహ దుఖ సమఉ ప్రానపతి పేఖే

మీ అందమైన శ్యామల కోమలదేహంపైన స్వచ్ఛమైన తెల్లటి శ్రమబిందువులు మనోహరంగా కనిపిస్తుంటే ఇక నాకు దుఃఖమెక్కడిది? కేవలం సుఖమే లభిస్తుంది అంటుంది.

నహి మగ శ్రము భ్రము దుఖమనమోరే
మోహి లాగి సోచు కరి అ జని భోరే

మార్గంలో నడవడం వల్ల శరీరానికి శ్రమ కలుగుతుంది. కొంత సేపటికి మనం సరియైన మార్గంలో లేమేమో అనే భ్రమ బుద్ధిలో కలుగుతుంది. గమ్యం చేరలేకపోతే మనస్సులో దుఃఖం కలుగుతుంది. రాముడి వెనుక నడిచే వారికి మార్గం సరియైనది కాదేమో అనే భ్రమ ఎలా కలుగుతుంది? ధర్మమూర్తి రాముడు తప్పు త్రోవన వెళ్లనే వెళ్లడు. జీవుడు కర్తృత్వాహంకారం (నేను చేస్తున్నాననే భావం) వల్లనే గమ్యం చేరలేకపోతున్నాడు. కేవలం రాముడి చేతే నడుపబడేవాడికి గమ్యచ్యుతి అనే దుఃఖం ఎక్కడిది? ఇక మనకోసం శ్రమ పడుతున్న రాముడి సుందర రూపధ్యానంలో శ్రమ ఎక్కడిది?

ఈ విధంగా నిజజీవితంలోని మన శ్రమ, భ్రమ, దుఃఖాలను దూరం చేయడం కొరకు రుదనం చేసే సగుణ సాకార భగవంతుడి అవసరం ఏర్పడింది.

శ్రమకు చిహ్నంగా నుదుట చెమట బిందువును, దుఃఖప్రతీకగా కండ్లలో అశ్రువులను, కష్టాలకు సూచనగా చరణాలలో ముళ్లను ధరించిన

రాముడిని వేదాలు స్తుతించడం తులసీరామాయణంలో కనిపిస్తుంది.

శ్రీ తులసీ "కవితావళి" అనే తన గ్రంథంలో ఒక విచిత్ర సంభాషణా దృశ్యాన్ని మన కండ్ల ముందుంచుతారు"బై డే బిలంబు లౌ కంటక కాఢే" - దారిలో చెట్టు క్రింది మార్గాయాసాన్ని తీర్చుకోవడం కొరకు కూర్చున్న శ్రీ రాముడు కాలిలో విరిగిన ముళ్లు తీసుకుంటూ సీతమ్మవారితో "ఈ ముళ్లు ఎంత తీసినా రావడం లేదు, మనకేమో ఆలశ్యమౌతున్నది" అంటాడు. అప్పుడు సీతమ్మవారు నవ్వుతూ "అవి తీస్తే రావడంలేదా లేక అసలు మీరే వాటిని తియ్యడం లేదా"? అని అడుగుతుంది. ఆ పైన "ఇది కృపా, న్యాయ మనోవృత్తుల మధ్య సంఘర్షణ చేత జరుగుతున్న విలంబమే గాని వేరొకటి కాదు. న్యాయ మనోవృత్తి నిన్ను బాధించిన ముల్లును తీసిపారవేయి అంటుంటే, కృపా మనోవృత్తి మీ చరణాలను చేరి శరణన్న కంటకాన్ని స్వీకరించి రక్షించమంటోంది" అని చమత్కరిస్తుంది. ఈ విధంగా దారిలోని కంటకాలన్నింటినీ తన చరణాలు స్వీకరించగా సీతా, లక్ష్మణులకు ఏమీ మిగలలేదు.

రావణుడు శ్రీరాముడితో యుద్ధానికి వచ్చినప్పుడు విభీషణుడు కనిపించగా కోపగించి ఒక ప్రచండమైన శక్తిని విసురుతాడు. అప్పుడు శ్రీ రాముడు విభీషణుడి ముందుకు వచ్చి దాని ఆఘాతాన్ని తన హృదయం పైన స్వీకరిస్తాడు. ఈ విధంగా ఆయన హృదయం బాణాలతోనూ, చరణాలు ముళ్ళతోనూ ఛేదించబడగా శ్రమరూపంలో నుదుటిపై చెమటను, కరుణ రూపంలో కంటిలో అశ్రువులను స్వీకరించాడు.

"రామరాజ నభగేసనును స చరాచర జగమాహి
కాలకర్మ సుభావగున కృత దుఖకాహుహి నాహి"

రామరాజ్యంలో కాలం వల్ల కలిగే దుఃఖం గానీ (ఋతువులు మారడం వల్ల వచ్చే శారీరక అనారోగ్యం లేదా ప్రకృతి సిద్ధమైన విపత్తులు), కర్మవల్లకలిగే దుఃఖం గానీ (గడ్డి కోస్తుంటే వేలు తెగడం లాంటివి) స్వభావం

వల్ల కలిగే దుఃఖంగానీ (క్రోధాది స్వభావాల చేత కలిగే దుఃఖాలు), గుణం వల్ల కలిగే దుఃఖం గానీ (త్రాగుడు, వ్యభిచారం లాంటి దుర్గుణాల వల్ల) లేదని తెలుసుకో' అని భుసుండి అనే కాకి గరుడుడితో చెబుతాడు.

మరి ఈ దుఃఖాలన్నీ ఎక్కడికి వెళ్లాయి? అన్నీ సోదర సమేతంగా శ్రీరాముడు స్వీకరించాడు. తనను వెనక్కు తీసుకు వెళ్లడానికి వచ్చిన భరతుడితో రాముడు "చాటీ బి పతి స బహి మెహి భా-ఈ" ప్రపంచంలో ఎక్కడ చూసినా అన్నదమ్ములు సంపత్తిని పంచుకుంటారు, కానీ తమ్ముడా రామరాజ్య స్థాపన కొరకు మనం విపత్తిని పంచుకుందాం రా అని పిలుస్తాడు.

ఇదీ రామరుదనంలోని రహస్యం - ఇదే రామరాజ్య స్థాపనకు ఆధార శిల. అందుకే వేదం "సుందర ఆశ్చర్యమయ శిశువు కౌసల్యాది మాతలను పొంది రుదనం చేశాడు" అంటోంది.

అవతారిక :

పరమాత్మ ఆవిర్భావాన్ని వర్ణించిన వేదమాత, నాలుగు రూపాలలో (రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల) నిలిచిన ఆయనను దేవతలు ప్రార్థించిన విధానం, ఆపరమాత్మ నామ రూపాలలోని నిగూఢతత్త్వాన్ని 18వ మంత్రంలో సూచించబోతోంది.

**18. మంత్రం**

**చత్వారితే అసుర్యాణి నామా దాభ్యాని మహిషస్య సన్తి**
**త్వమఙ్గతాని విశ్వాని విత్సే యేభిః కర్మాణి మఘ వఞ్చ కర్థ**

(ఋగ్ 10-54-4)

రామ లక్ష్మణ భరత శత్రుఘ్న నామ రూపాలు కల్గి అసురులకు ఉపయుక్త రీతిలో హితం చేసే పరమాత్మ! మీరే సంపూర్ణంగా సంసారంలో వ్యాపించి ఉన్నారు. ఓ లక్ష్మీపతీ! మీరు రావణాదుల వధ నిమిత్తమై ఈ రూపాన్ని ధరించారు.

సుషుప్తికి అధిష్టాత ఈశ్వరుడు, స్వప్నాధిష్టాత హిరణ్యాగర్భుడు,

జాగ్రదధిష్టాత విరాట్, వీరు ముగ్గురు తురీయ బ్రహ్మకు అంశాలు. లక్ష్మణ భరత శత్రుఘ్నులు ముగ్గురు జాగ్రత్ స్వప్న సుషుప్తావస్థలు - వీరు తురీయ బ్రహ్మ అయిన రాముడి యొక్క అంశాలు.శ్రీ శంకరాచార్యులవారు "అంశ ఇవ అంశ" అవి అంశాలలాగా కనిపించేవే కాని అంశాలు కావంటారు. ఈ మూడు అవస్థలకూ లోనయ్యే వ్యక్తి ఒకడే. అతడే ధ్యానంలో సమాధిస్థుడైనప్పుడు ఈ మూడింటికీ అతీతుడై తన మూలస్థితికి చేరుకుంటాడు. అటువంటప్పుడు ఈ అంశాలు, అంశి నుండి వేరనగలమా?

ఒక పిల్లవాడి దగ్గర మూడు పావలా లున్నాయి. వాడు ఒక బొమ్మ కొనుక్కుందాం అనుకున్నాడు. కానీ ఆ బొమ్మ ధర ఒక రూపాయని అంగడివాడు చెప్పాడు. మరి దాన్ని కొనడం ఎలా? అందుకే వాడు వాళ్లనాన్న దగ్గరికి వచ్చి "నాన్నా! నా దగ్గర మూడుపావలాలు ఉన్నాయి. మీరింకొక పావలా ఇచ్చారంటే నేను రూపాయి పెట్టి బొమ్మ కొనుక్కుంటాను" అన్నాడు. వాళ్ల నాన్న జేబులన్నీ వెతికినా చిల్లర కనిపించలేదు. అందుకని "ఒరేయ్ బుజ్జీ! నువ్వు ఆ మూడుపావలాలు నాకిస్తే నీకు రూపాయిస్తాను" అన్నాడు. వాడికి ఆ లెక్కేమిటో అర్థం కాలేదు. వాడి నాన్న వాణ్ణి మోసం చేస్తున్నాడేమో అని కూడా వాడికి అనుమానం వచ్చింది. అతి కష్టం మీద వాళ్ల అమ్మవాడికి నచ్చజెప్పి ఆ మూడు పావలాలు వాళ్ల నాన్నకు వప్పజెప్పింది. పిల్లవాడికి రూపాయి లభించింది. ఇప్పుడు చెప్పండి ఆ రూపాయిలో ఈ మూడు పావలాలు లేవా? ఈ మూడు ఆ తండ్రికి సమర్పిస్తేనే కదా మారింది. ఆ రూపాయిలో భాగాలు లేవు. దాన్ని భాగాలు చేద్దామని చించితే దాని విలువే పోతుంది. ఆ మూడింటిని సమర్పించి శరణాగతి పొందినప్పుడే పూర్ణత్వమనే రూపాయి సిద్ధించేది.

ఈ సత్యాన్ని తెలియజేయడానికే శ్రీ మహావిష్ణువు ఒకేసారి నాలుగు (అంశలలాగా) రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్న రూపాలలో అవతరించాడు.

చైత్రశుద్ధ దశమి గురువారం పుష్యమీ నక్షత్రంలో కైకేయికి కూడా కౌసల్యానందనుడిలానే ఒక నీలమేఘశ్యాముడైన శిశువు జన్మించాడు.

ఏకాదశీ శుక్రవారం నాడు.సుమిత్రకు కవల పిల్లలు పుట్టారు. వారి వర్ణం తెల్లగా ఉంది.

శ్లో॥ చక్రపాణి రభూ ద్రామ ఇందిరా ధరణీ సుతా
అనన్తో లక్ష్మణోజాతో భరత శ్శంఖ ఉచ్యతే
శత్రుఘ్న శ్చక్రరాట్ సో2పి శివస్తు హనుమా నభూత్
ద్వారపాలో దశగ్రీవః కుంభకర్ణ స్తథైవ హి
విభీషణో ధర్మరూపో, హ్యధర్మో మేఘనాదకః

(ఉమా సంహిత : 1అ)

శ్రీమన్నారాయణుడే శ్రీరాముడిగా అవతరించాడు, శ్రీదేవి జానకి అయ్యింది. ఆదిశేషుడు లక్ష్మణుడుగానూ, శంఖము భరతుడుగానూ, చక్రము శత్రుఘ్నుడుగానూ అవతరించారు.

ద్వారపాలకులైన జయవిజయులు, రావణకుంభకర్ణులుగానూ, ధర్మదేవత విభీషణుడిగానూ, అధర్మం ఇంద్రజిత్తుగా పుట్టారు.

దోహా॥ మాస దివస కరదివ సభా, మరమ న జానై కో ఇ
రథసమేత రబి థాకేఉ, నిజా కౌన బిధి హో ఇ.

ఒక నెల ఒక దినంగా మారిపోయింది, కానీ ఈ రహస్యాన్ని ఎవరూ ఎరుగలేదు. తన రథంతో బాటు సూర్యుడు ఆగిపోయాడు. ఇక ఎలా చీకటి పడుతుంది?

శ్రీమన్నారాయణుడు నాలుగు రూపాలలో అవతరించిన శుభ సందర్భంలో తన వంశంలో ఆవిర్భవించిన పరమాత్మను చూడ కుతూహలుడై ఆగిపోయిన సూర్యుడు నెలరోజులపాటు అక్కడే ఉండిపోయాడు. కాని ఆ సంగతి ఎవరూ గ్రహించలేదు. కారణమేమంటే, పరమాత్మ జన్మోత్సవంలో మునిగిన వారికి శరీరస్ఫురణే లేదు. ఇక సూర్యుడు ఉదయిస్తున్నాడా లేక అస్తమిస్తున్నాడా అని చూసేదెవరు?

హృదయం ఆనందంతో గంతులు వేస్తున్నప్పుడు సమయం చాలా వేగంగా గడిచిపోతుంది. కష్టాలలో ఉన్నప్పుడు క్షణమొక యుగంగా

మారుతుంది. కాలం మనోభావమే తప్ప సత్యం కాదు. "యతోవాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" - ఆ పరమాత్మ విభూతిని, సౌందర్యాన్ని అందుకోలేక పరిచ్ఛిన్నమైన (హద్దుల పద్దులు కలిగిన) ఇంద్రియాలు మనసుతో బాటుగా వెనక్కు వచ్చేస్తాయి అంటుంది ఉపనిషత్తు. తన జ్ఞానానికి ఊహకు అందని విషయం ఎదురైనప్పుడు మనస్సు స్థంభించి పోతుంది. అక్కడ ఆ స్థితిలో కాలం ఉండదు. అది కాలాతీత స్థితి. అందుకే కాలానికి కొలబద్ద అయిన సూర్యుడు ఆగిపోయాడు అంటున్నాడు శ్రీతులసి.

ఈ విధంగా ఆవిర్భవించిన పరమాత్మను దేవతలు స్తుతించారు. ఆ స్తుతినే ఇక్కడ వేదం వర్ణిస్తోంది. "అసురులకు ఉపయుక్త రీతిలో హితం చేసే పరమాత్మ" అని సురులు (దేవతలు) ప్రార్థించడం ఆశ్చర్యంగా కనిపిస్తుంది. కానీ అది నిజం కాదు అది ఏలాగంటే...

"తత ఏకాంత మాశ్రిత్య సత్వాలోచ్య బలాబలం,
విష్ణునా నిహతో యామి వైకుంఠ పరమం పదమ్
మయి విష్ణు ర్యథా కుప్యే త్తథా కార్యం కరోమ్యహం
ఇతి నిశ్చిత్య మనసా సర్వజ్ఞో విధి చోదనాత్"

సనత్కుమారుడి ద్వారా ఇరవైనాలుగో మహాయుగంలో వైవస్వత మన్వంతరంలో శ్వేతవరాహకల్పంలో, త్రేతాయుగాన, సూర్యవంశంలో దశరథ మహారాజు వల్ల శ్రీ హరి జన్మిస్తాడని ఎరిగిన తరువాత రావణుడు ఏకాంతంలో తన బలాబలాలు విచారించుకొని, విష్ణుమూర్తి చేత చంపబడి వైకుంఠాన్ని పొందాలి అని నిశ్చయించుకొని, అలా జరగటం వరకు విష్ణువుకు కోపం కలిగే కార్యాలు చేస్తాను అని నిర్ణయించుకుని, సర్వజ్ఞుడైన రావణుడు విధిచేత ప్రేరితుడై త్రేతాయుగం ప్రవేశించినది మొదలుగా అధర్మ ప్రవర్తనుడైనాడు.

రావణుడు స్వయంగా తాను ఒక హరిచేత తప్ప ఇంకెవరి చేతా చంపబడనంత బలవంతుడినైనానని గుర్తించాడు. కనుక తాను ముక్తి

పొందాలంటే ఇక కేవలం హరితో శ్రతుత్వం పెట్టుకోడం ఒక్కటే మార్గమని కూడా తెలుసుకున్నాడు. కనుక ముక్తిని కాంక్షించినవాడై హరికి కోపం కలిగి ఈ భూమిపై అవతరించి తనను సంహరించుట కొరకు చేయవలసిన అధర్మ కార్యాలన్నీ త్రేతాయుగ ప్రవేశ సమయం నుండే (దానివల్ల అంతకు ముందు రావణుడు ధర్మప్రవర్తనకలవాడేనని తెలుస్తోంది) ప్రారంభించాడు.

అయితే ఇక్కడ ముక్తి కాంక్షించినవాడు సాధన చేసి తరించవచ్చు కదా, శరణాగతితోనో, భక్తితోనో, యోగంతోనో తరించ ప్రయత్నించక వైరంతోనే తరించాలని రావణుడు ఎందుకు కోరుకున్నాడు అనే అనుమానం కలుగుతుంది. అందుకు గల కారణం ఇక్కడ తులసీదాసు వివరిస్తున్నాడు.

"హో ఇహి భజనున తామస దేహా।
తౌ మై జాయి బైరుహరిక ఉ"

ఈ తామస రాక్షస దేహంతో, ముక్తికి నిచ్చెన వేయగల సాత్విక సాధన ఏదీ చేయడం నాకు చేతకాదు. కనుక పంతంతో పరమాత్మతో వైరంతోనే నేనిది సాధిస్తాను. ఆయన చేతిలో మరణించి హాయిగా ముక్తి కాంతను వివాహమాడతానని నిర్ణయించుకున్నాడు. రావణుడు.

ఈ విధంగా సాత్విక సాధన చేసి తనను చేరుకోలేని అసురులను సంహరించి, వారికి ముక్తినివ్వడం ద్వారా హితం చేసే పరమాత్మా, మీరు రావణాదుల వధనిమిత్తమై ఈ రూపాన్ని ధరించారు అంటూ దేవతలు స్తుతించారు.

ఇక జన్మించిన శిశువులకు నామకరణం చేయవలసిఉంది. అందు కొరకై దశరథ మహారాజు వసిష్ఠమహర్షిని పిలిపించాడు. మహారాజు కోరికపై వారికి పేర్లు పెట్టాడు..

"జో ఆనన్ద సింధు సుఖరాసీ సీకర తే త్రైలోక సుపాసీ సో
సుఖధామ రామ అసనామా అఖిలలోక దాయక విశ్రామ"

ఆనందానికి సముద్రం లాంటివాడు, సుఖానికి రాసి లాంటివాడు, ఆ సముద్రంలోని ఒక్క బిందువు చేత మూడులోకాలకు సుఖాన్ని ఇచ్చేవాడు అయిన ఈ సుఖధాముడికి రాముడని పేరుంది. ఈశిశువు మూడు లోకాలకు విశ్రాంతి నివ్వగలడు.

"ఏషహ్యేవానన్దయాతి" - వ్యావహారిక (ప్రపంచంలో కనిపించే) ఆనందం అంతా ఈ ఆనంద ఘనపదార్థంలో నుండి ఉత్పన్న మౌతోంది.

"ఆనందం ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే, ఆనన్దేన జాతాని జీవన్తి, ఆనన్దం ప్రయన్త్యభి సం విశంతి"

"ఈ ఆనంద తత్త్వంలో నుండే సమస్త జీవరాసులు పుడుతున్నాయి. ఈ ఆనందం వల్లే జీవాలన్నీ బ్రతుకుతున్నాయి. చివరికి ఈ ఆనందం లోకే ప్రవేశిస్తున్నాయి" అంటోంది శ్రుతి.

జ్ఞానులకు ఈయన ఆనంద సింధు (సాగరుడు) కర్మల్లో ప్రవృత్తమై ఉన్నవారికి సుఖరాసి, భక్తులకు వైకుంఠ సుఖరూపధాముడు ఈ రాముడు.

చౌ. బంద ఉ నామరామ రఘువరకో హేతు కృసాను భాను హిమకరకో
బిధిహరి హరమయ బేదప్రాన సో అగున అనూపమగున నిధ్యాసో

కృశాను(అగ్ని), భాను(సూర్య), హిమకర (చంద్ర) హేతువై (అని నిలవడానికి కారణమై, నిర్గుణమై, ఉపమానరహితమై (పోల్చడానికి మరొకటి లేనిదై) గుణభాండారమై ఉన్న రామనామానికి వందనాలు అంటాడు తులసీ.

శ్లో॥ రకారో అనల బీజస్స్యాత్ యే సర్వే బడవాదయః।
కృత్వా మనోమలం సర్వం, భస్మకర్మ శుభాశుభమ్॥

'ర' కారం అగ్ని బీజాక్షరం. దానిలో త్రేతాగ్నులున్నాయి. దీన్ని మననం చేస్తే శుభాశుభరూపమైన మనో మలాన్ని పోగొడుతుంది.

శ్లో॥ అకారో భాను బీజ స్స్యాత్, సర్వవేద ప్రకాశకః।
హరత్యేవచ స ద్రాత్వా అవిద్యా హృదయే తమః॥

'అ' కారం సూర్య బీజాక్షరం. ఇది సమస్త జ్ఞానాన్ని ప్రకాశింపజేసి అవిద్యాంధకారాన్ని నాశనం చేస్తుంది.

శ్లో॥ మకారశ్చంద్ర బీజస్స్యాత్, పదంబు పరిపూరకమ్।
త్రితాపం హరతే నిత్యం శీతలత్వం కరోతిచ॥

'మ' కారం చంద్ర బీజాక్షరం. ఇందులో అమృతం నిండి ఉన్నది. ఇది ఆధిదైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మిక తాపాలను శాశ్వతంగా తొలగించి, శీతలత్వం శాంతిని ఇస్తుంది.

ర+అ+మ=రామ, అందుకే "సోమసూర్యాగ్నులను మించిన స్వప్రకాశము రామనామము" అన్నారు.

శ్లో॥ యదాదిత్య గతం తేజః జగద్భాసయే తే2ఖిలమ్।
యశ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్॥

యావత్తు జగత్తు ఎవరి వల్లయితే కాంతిని పొందుతోందో ఆ సూర్యుడిలోని కాంతిని నేను, చంద్రుడిలోని, అగ్నిలోని తేజస్సును కూడా నేనేనని తెలుసుకో అంటాడు స్వయంగా పరమాత్మ (నామానికి, నామికి (పేరుగలవాడికి) అభేదం కదా!).

ఇంకో విధంగా కూడా రామనామం సూర్యచంద్రాగ్నులకు కారణ మనవచ్చు, అది ఎలాగంటే -

శ్లో॥ మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ బుద్ధః కల్కిరేవచ

దశావతారాలు ఇక్కడ చెప్పబడుతున్నాయి. (1) మత్స్యావతారము (2) కూర్మావతారము (3) వరాహావతారము (4) నారసింహావతారము (5) వామనావతారము (6) రామావతారము (పరశురామ) (7) రామావతారము (కోదండరామ) (8) రామావతారము (బలరామ, కృష్ణులలో అభేదం) (9) బుద్ధావతారము (10) కల్క్యవతారము.

పైన చెప్పబడ్డ మూడు రామావతారాలలో పరశురామావతారం జమదగ్ని

వంశంలోనూ, శ్రీరామావతారం సూర్యవంశంలోనూ, బలరామావతారం చంద్రవంశంలోనూ ఆవిర్భవించాయి. కనుక ఈ రకంగా కూడా రామ నామం సూర్యచంద్రాగ్నులకూ కారణమయ్యింది.

ఇక ఈ రామనామం త్రిమూర్తి స్వరూపం "మూడు మూర్తుల జన్మభూమికి మూలదైవము రామనామము".

ర=రుద్ర, అ=బ్రహ్మ, మ=విష్ణు

రుద్ర ఉవాచ:

రేఫో2గ్ని రహ మేవోక్తో విష్ణుః సోమో మఉచ్యతే
ఆవయో ర్మధ్యగో బ్రహ్మ రవిరకార ఉచ్యతే

(స్కందయామలం)

స్వయంగా రుద్రుడిలా అన్నాడు. రేఫరూప అగ్నిని నేను, విష్ణురూపం సోమంగా (చంద్ర) చెప్పుకోబడుతుంది. మా ఇద్దరి మధ్య బ్రహ్మ సూర్యాకారుడుగా చెప్పుకోబడుతున్నాడు.

"మూడు మూర్తుల జన్మభూమికి, మూలదైవము రామనామము"

అసలు రామనామంలోనే రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులున్నారు. అది ఎలాగంటే "రేఫా రూఢాః మూర్తయః స్యుః శక్తయ స్తిస్ర ఏవచ" అన్న రామపూర్వతాపనీయ ఉపనిషత్ వాక్యంపై "అకారద్వయం మకారశ్చేతి వర్ణాస్త్రయః సముదితాః రేఫారూఢాబీజం స్యుః --- ప్రథమో అకారో విరాడాత్మక బ్రహ్మరూపః, ద్వితీయో అకారో హిరణ్య గర్భాత్మక విష్ణురూపః మకారస్తు అవ్యాకృతాత్మక సదాశివరూపః--- శక్తయ ఇతి సృష్ట్యాది శక్తయ ఇత్యర్థః - తదా రేఫేణ స్వభూరిత్యాది ప్రతిపాదితం స్వప్రకాశం బ్రహ్మోప స్థాప్యతే!" అని టీకా వ్రాశారు. అంటే ర్+అ+అ+మ=రామ 'ర్' రేఫంతో బాటుగా మూడు మూర్తులు మూడు శక్తులు ఉన్నాయి. అందులో మొదటి 'అ'కారం విరాడాత్మక, బ్రహ్మదేవ (సృష్టికర్త) రూపం (ఈయనే జాగ్రత్ స్వరూప లక్ష్మణుడు) రెండవ 'అ'కారం హిరణ్య గర్భాత్మక విష్ణురూపం

(ఈయనే స్వప్న స్వరూప భరతుడు). 'మ'కారం అవ్యాకృతాత్మక శివరూపం (ఈయనే సుషుప్తి రూప శత్రుఘ్నుడు). 'ర్' రేఫం స్వప్రకాశ పరబ్రహ్మ (ఈయనే మూడవస్థలకు అతీతుడైన తురీయ స్వరూప శ్రీరాముడు)

వేదాలకు ప్రాణం ప్రణవం (ఓంకారం), వేదాలలో నేను ప్రణవాన్ని అని స్వయంగా పరమాత్మే చెబుతాడు. అటువంటి ప్రణవానికే ప్రాణం రామనామం (వ్యక్తి తన పేరుపై ఆధారపడతాడుకదా)

అది ఎలాగంటే-

దోహా॥ ఏకు ఛత్రు ఎకల ముకుట మని సబ బరనని పర జోఉ
తులసీ రఘుబర నామకే బరన బిరాజత దోఉ.

రామనామంలోని రెండక్షరాలు ఓంకారంలో ఒకటి ఛత్రమై (గొడుగు) మరొకటి కిరీటంలో మణియై ఎంతో శోభనిస్తున్నాయి.

ఓం(ॐ)లో రేఫము(ˎ) అర్ధ చంద్రాకారంలో గొడుగుగా కనిపిస్తుంది. అదే 'రా'. అనుస్వారం బిందురూపంలో మణిలాగా కనిపించేదే 'మ'.(.)

"మూడు గుణముల ప్రకృతి - వికృతికి మూలకందము రామనామము"

ఛాందోగ్య ఉపనిషత్తు అగ్నిలోని ఎరుపును తేజోరూపంగానూ, జలంలోని తెలుపును శుక్లరూపంగానూ, పృథ్విలోని నలుపును కృష్ణరూపంగానూ వర్ణిస్తుంది. ఇవే మూడు గుణాల రంగులు. ర=రజస్సు, ఆ=సత్వము, మ=తమస్సు=రామగా మారుతుంది కనుక మూడు గుణాలకు మూలమైనది రామనామము. (రాముడే మూడు గుణాల రూపంలో చరాచర సృష్టిని నాట్యమాడిస్తున్నాడు)

"పండు వెన్నెల కాంతి గల్గిన బ్రహ్మనాళము రామనామము".

'ర' అగ్ని బీజం సుషుమ్నానాడి ఇది అప్రకటంగా ఉంటుంది. అగ్నితత్వ అధిష్టాత పరశురామావతారం కూడా తక్కిన అవతారాలలాగ ప్రకటం కాలేదు. "ఆ" సూర్యబీజం పింగళనాడి, దీని అధిష్టాత శ్రీరాముడు. 'మ' చంద్రబీజం ఇడనాడి, దీని అధిష్టాత కృష్ణుడు. వీరిద్దరూ ప్రకటావ

తారాలు. ఈ రకంగా యోగతత్వం కూడా రామనామంలో సిద్ధించింది.

"పంచవింశతి తత్త్వములకును మించియున్నది రామనామము".

25 తత్త్వాలకు మించి (అతీతంగా) ఉంది రామనామం. ఆ 25 తత్త్వాలు ఇవి:

కఖగఘఙ - 5 (పంచ) భూతాలు (భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశం)

చఛజఝఞ - 5 (పంచ) కర్మేంద్రియాలు. (వాక్కు, కాళ్లు, చేతులు, గుదము, జననేంద్రియము)

టఠడఢణ - 5 (పంచ) జ్ఞానేంద్రియాలు. (కండ్లు, ముక్కు, చెవులు, నాలుక, చర్మం)

ప=మనస్సు, ఫ=అహంకారం, బ=మహత్తు(బీజరూపంలో కనిపించిన ప్రకృతి), భ=ప్రకృతి, మ=జీవుడు (పంచవింశోయం పురుషః= 25వ వాడు జీవుడు), య=మాయ, ర=పరమాత్మ

శ్లో॥ అకారేణోచ్యతే విష్ణుః సర్వలోకైక నాయకః।
ఉకారేణోచ్యతే లక్ష్మీః మకారో జీవవాచకః॥

సర్వలోక నాయకుడైన విష్ణువు 'అ' కారంతో చెప్పబడుతున్నాడు. 'ఉ'కారంతో లక్ష్మి చెప్పబడుతుంది. 'మ'కారం జీవవాచకం (అ+ఉ+మ=ఓం)

"ఉభయ బీచసియ సోహయి కైసీ, బ్రహ్మ జీవ విచ మాయాజైసీ"

అరణ్యంలో నడిచి వెళుతున్న సీతారామలక్ష్మణులు, సీతా సంరక్షణార్థమై ముందు రాముడు నడువగా, వెనుక సీతమ్మ నడవగా, ఆ తరువాత లక్ష్మణుడు నడుస్తున్నాడు. ఆ ఇద్దరి మధ్య వెళుతున్న సీతమ్మ, పరబ్రహ్మ (రాముడు) జీవుడు (లక్ష్మణుడు) మధ్యన మాయలాగా ఉన్నది అంటారు శ్రీతులసీ.

"తత్త్వమసి వాక్యార్థ మనియెడి తత్త్వమే శ్రీరామనామము"

శ్రుతి - ఆద్యో "రా" తత్పదార్థ స్సాన్మకార స్త్వం పదార్థవాన్।

తయో స్సంయోజనమసీ త్యర్థే తత్త్వవిదో విదుః॥

రా=తత్(అది), మ=త్వమ్(నీవు), అసి=అయి ఉన్నావు, (ఆ పరబ్రహ్మయే నీవై ఉన్నావు). ఈ రెండక్షరాలు ఇక్కడ కలిసి రామనామంగా రూపొందు తున్న కారణాన, రామనామమే తత్త్వమసి మహావాక్యమై, వేదాంతసారమై విలసిల్లింది.

"నిరుపమానము నిర్విశేషము నిష్కళంకము రామనామము"

ఈ విధంగా నిరుపమానమైన (పోల్చడానికి మరొకటి కనిపించని) కళంక రహితమైన వేదసారమైన శ్రీరామనామం వసిష్ఠ మహర్షి చేత పరమాత్మకు ఆపాదించబడింది.

ఇక చైత్రశుద్ధ దశమి గురువారం పుష్యమీ నక్షత్రంలో జన్మించిన కైకేయి నందనుడికి నామకరణం చేయడానికి ఉద్యమించాడు బ్రహ్మర్షి వసిష్ఠులవారు.

"విశ్వభరన షోష న కర జోఈ<br>
తాకర నామభరత అసహోఈ"

ఈ సంసారాన్ని భరించి పోషించే ఈ శిశువు భరతుడిగా పిలవబడతాడు. ధరించేదాన్ని (భరించేదాన్ని) ధర్మమంటారు. పోతపోసిన ధర్మ విగ్రహం లాంటి రాముడి రాజ్యానికి పునాది లాంటివాడు భరతుడు. ధర్మం గురించి మాట్లాడటం చాలా సులభం, ఎంత అధర్మాత్ముడు కూడా ధర్మాన్ని గూర్చి ఉపన్యసిస్తాడు. కానీ ధర్మాచరణే కష్టం. మారు వేషంలో వెళ్లి దొంగతనంగా సీత నపహరించిన రావణాసురుడు కూడా రాముడు వాలిని జంతువును సంహరించినట్లుగా చెట్టువెనుక మాటువేసి చంపాడు, ఇది అధర్మం అంటూ ఆక్షేపిస్తాడు.

కానీ సరియైన ధర్మవిశ్లేషణ భరతుడిలో కనిపిస్తుంది. దశరథుడి శరీరానికి అంత్యక్రియలు చేసిన తరువాత వసిష్ఠుల వారు భరతుడితో "మీ తండ్రిగారు గొప్ప ధర్మాచరణ గలవారు, ఆయన తాను కైకేయికిచ్చిన

మాటకు కట్టుబడి, ఇష్టం లేకున్నా ధర్మపాశానికి పట్టుబడి రాజ్యాన్ని నీకిచ్చాడు. మీ అన్న రఘురాముడు ధర్మమూర్తి పితృవాక్య ధర్మాన్ని శిరస్సున ధరించి 14 సంవత్సరములు అరణ్య వాసానికి వెళ్లాడు. నీవు కూడా అదే ధర్మమార్గాన్ని అనుసరించి నీ తండ్రి ఆజ్ఞను పాలించి ఈ పధ్నాలుగు సంవత్సరాల కొరకై రాజ్యాన్ని చేపట్టు" అన్నాడు. అందుకు సభాసదులు, మంత్రులు, ముగ్గురు మాతలు సంతోషంగా తమ అనుమతి నిచ్చారు. కానీ భరతుడు దానిని ఖండిస్తూ "నా తండ్రి ధర్మాత్ముడే కానీ అంత్యకాలంలో ఆయన ధర్మనిర్ణయం చేయలేకపోయాడు. తనది కాని వస్తువును అసలు ఎవరు మాత్రం ఇవ్వగలరు"?

రాజ్యం ఎప్పుడూ రాజు యొక్క ఆస్తికాదు. రాజు రాజ్యానికి సేవకుడేగాని యజమాని కాడు. మరి తన యొక్క వ్యక్తిగతమైన ఇష్టానిష్టాలపైన ఆధారపడి రాజ్యాన్ని ఎవరికో ఎలా ఇవ్వగలిగాడు? శ్రీరాముడు మానవు డనుకున్నా, రఘుకుల రీతి ననుసరించి పెద్దకుమారుడైన ఆయనదే ఈ రాజ్యం. లేదా శ్రీరాముడు పరమాత్మ గనుక అయితే ఒక్క ఈ రాజ్యమేమిటి సర్వలోకాలు ఆయనవే. అటువంటప్పుడు దశరథుడు దాన్ని నాకెలా ఇవ్వగలడు? నేను ఈ రాజ్యాన్ని గనుక స్వీకరిస్తే ఆ క్రియ మొత్తం రాజ్యనాశనానికే దారి తీస్తుంది. ఎవరి రాజ్యాభిషేకమైతే తండ్రి మరణము సోదర వనగమనం అనే పునాదులపైన ఆధారపడి ఉంటుందో, అతడు ధర్మ ప్రభువు కాగలడా? స్వయంగా ఇంకొకరి ఆస్తి నాక్రమించే దొంగ, ప్రజలను దొంగల నుండి రక్షించగలడా? లేక ప్రజలు దొంగలు కాకుండా అడ్డుకోగలడా?

"మోహి రాజు హరి దే ఇహహు జబహీ
ధరా రసాతల జాయిహి తబహీ"

ఒకవేళ మీరంతా బలవంతంగా నాకు రాజ్యం కట్టబెడితే, ఈ భూమి పాతాళానికి జారిపోగలదు అంటాడు. అప్పుడు వసిష్ఠులవారు నవ్వుతూ రావణుడు, హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడి లాంటి రాక్షసుల పాలనలో

రసాతలానికి వెళ్లని భూమి, నీ పాలనలో వెళుతుందా? అని ప్రశ్నిస్తే, భరతుడు "వారు దైత్యులు అన్న సంగతి అందరికీ విదితమే. వారు తమోగుణ ప్రేరితులై అధర్మాత్ములవడం సహజమే కానీ రాముడి అనుజుడే అధర్మమార్గ వర్తనుడైతే, రాముడి రాజ్యాన్నే కాజేస్తే తప్పక భూమి సాతాళానికి వెళ్లగలదు" అంటాడు.

అది రామరాజ్యాభిషేకం జరుగుతున్న సమయం - అంతా ఆనందడోలికల్లో తేలి ఆడుతుంటే ఆంజనేయస్వామి కండ్లు ఎవరి కొరకో వెతుకుతున్నాయి. అందరూ కనిపిస్తున్నారు గానీ ఆయన మాత్రం అగుపించటం లేదు. ఈ పట్టాభిషేకానికి మూలాధారమై నిలిచిన భరతుడే ఆ వ్యక్తి.వెతకగా వెతకగా చివరికి ఆంజనేయస్వామికి భరతుడు సింహాసనం వెనక కనిపించాడు. ముందుకు రమ్మని ఎంత పిలిచినా ఆయన రాకపోయే సరికి ఆంజనేయస్వామి ఈ విషయాన్ని రాములవారికి విన్నవించు కున్నాడు. శ్రీరామచంద్రుడు "వెనుక నిలుచుని భరతుడేం చేస్తున్నాడు?" అని ప్రశ్నిస్తే, ఆంజనేయస్వామి "ఛత్రం పట్టుకొని నిలు చున్నాడు స్వామి" అని జవాబిచ్చాడు. అప్పుడు రాముడు "అయితే ఆంజనేయా! భరతుడిని ముందుకు పిలవాల్సిన పనిలేదు. ఆయన సరియైన స్థానంలోనే ఉన్నాడు. శాసకులే పాలించాలి, కానీ భరతుడి లాంటి ధర్మవర్తనులైన సాధుపురుషుల ఛత్రచ్ఛాయలోనే ఆ రాజ్యం రామ రాజ్యంగా పరిణమించగలదు" అన్నాడు.

ఈ విధంగా రామరాజ్యాన్ని భరించి పోషించేవాడు కనుకనే కైకేయీ నందనుడికి భరతుడనే పేరు సార్థకమైంది.

ఆ తరువాత చైత్రశుద్ధ ఏకాదశి శుక్రవారం సుమిత్రా మాత గర్భాన జన్మించిన కవలలలో పెద్దవాడి నామకరణానికి ఉద్యమించారు వసిష్ఠ మహర్షులవారు.

"లచ్ఛన ధామ రామప్రియ సకల జగత ఆధార
గుర బసిష్ఠ తెహి రాఖా లఛిమన నామ ఉదార"

రాముడెవరికైతే ప్రియుడో లేక రాముడికి ఎవరైతే ప్రియుడో అటువంటి

(బహువ్రీహి, తత్పురుష సమాసాల ననుసరించి) ఈ సుమిత్రా నందనుడు సర్వలక్షణ స్వరూపుడు, జగత్తుకే ఆధారమైనవాడు, ఉదారుడు అయిన ఇతడు లక్ష్మణ నామంతో ప్రసిద్ధుడౌతాడు అని వసిష్ఠులవారు నామకరణం చేశారు.

సహస్రశీర్షాలు కల ఆదిశేషుడు ఈ భూమిని మోస్తున్నాడని పురాణాలు చెబుతున్నాయి. ఒకసారి ఒక వ్యక్తి ఆదిశేషుడిని "నిరంతరం అనంత కాలం వరకు మీరు ఇలా భూమిని మోస్తుంటే అది మీకు బరువుగా అనిపించదా" అని అడిగాడట. దానికి ఆయన నవ్వుతూ" ఎవరి ఒడిలోనైతే స్వయంగా పరమాత్మ విశ్రమిస్తున్నాడో అతడికి ఈ సంసారం యొక్క స్మరణ ఎలా ఉంటుంది?" అన్నాడట. ఈ 'నేను' నే వ్యక్తిగత అహంకారం అన్నారు. వెయ్యి సంఖ్య అనంత జీవరాసులకు సూచనగా నిలుస్తుంది. (సహస్రశీర్షా పురుషః) ఈ "నేను, నేను" అనే వ్యక్తిగత స్ఫురణలన్నీ కలిసి సమష్టిగా మారినప్పుడే ప్రపంచం యొక్క అస్తిత్వం ఉంటుంది. అందుకే ఈ సమష్టి అహంకార సూచనగా ఆదిశేషుడిని జగత్ ఆధారుడు అన్నారు. అటువంటి సర్వశక్తిమంతుడు భగవత్ శరణాగతుడు కావడమే సాధన లక్షణం. ఆ శరణాగతిలో సంసార భారం సమసిపోతుంది. సర్వలక్షణాలకు ఆధారమైంది ఈ శరణాగతి (రామప్రియత్వం) కనుక అతడు లక్ష్మణుడు.

"చాతక చతుర రామస్వామి ఘన కే"

తెలివిగల ఈ లక్ష్మణుడనే చాతక పక్షి రాముడనే నీల మేఘం నుండి కురిపించబడే కృపాజలాన్ని తప్ప అన్యమేదీ స్వీకరించడు. అంతేకాదు స్వాతీనక్షత్ర కాలీన నీల మేఘం నుండి కురిసిన వర్షపు ధారలతో పెరిగిన తోటలోని వృక్షచ్ఛాయలో దప్ప మరెక్కడా విశ్రమించని పరమ వైరాగ్య రూపుడు ఈ లక్ష్మణుడనే చాతకపక్షి అని చమత్కరిస్తాడు దోహావళిలో శ్రీ తులసీ.

సీతారామలక్ష్మణులు చిత్రకూటంలో నివసిస్తున్న రోజులవి. ఒకరోజు లక్ష్మణుడు కందమూలఫలాలు తీసుకురావడానికి వెళ్లాడు. ఒక

విశాలవటవృక్షం క్రింద విశ్రమిస్తున్నారు సీతారాములు. వెనక్కు చూసిన సీతమ్మకు వటవృక్షం యొక్క విశాలమైన మాను, దానికి అల్లిబిల్లిగా అల్లుకున్న కోమలమైన పుష్పలత కనిపించాయి. వాటిని స్వామివారికి చూపిస్తూ "చూశారా స్వామీ! విశాలమైన దృఢమై ఆ వృక్షమే లేకపోతే ఆ కోమలమైన లతకు ఆధారమేది? అలా వృక్షాన్ని ఆధారంగా పొందిన లత ఎంత అదృష్టవంతురాలో" అన్నది. సీతమ్మ ఆ వృక్షాన్ని ఉపమానంగా పెట్టుకొని తమను సూచిస్తోందని గ్రహించి, "లేదు దేవి! అందమైన లతచేత చుట్టబడటం వల్లే ఆ కఠినమైన మానుకు అందం వచ్చింది. కాబట్టి లత అదృష్టం కన్నా ఆ వృక్షం యొక్క అదృష్టమే గొప్పది" అన్నాడు శ్రీరాముడు. ఈ విధంగా వారిరువురి చిలిపి కలహం పెరిగిపోతుండగా అక్కడికి లక్ష్మణస్వామి వచ్చాడు. సీతారాములిద్దరూ తమ సమస్యను ఆయన ముందుంచి ఎవరి అదృష్టం గొప్పదో నిర్ణయించమంటే ఆయన నవ్వుతూ "అందమైన తీగతో చుట్టబడ్డ ఈ విశాల వటవృక్షం నీడలో సేదదీరే నా అదృష్టమే గొప్పదిగాని ఆ రెంటిదీ కాదు" అంటూ ఆయన చమత్కరిస్తాడు.

వసిష్ఠుల వారు లక్ష్మణస్వామికి నామకరణం చేస్తూ 'ఉదార' అనే విశేషణాన్ని కూడా ఆయనకు చేరుస్తాడు. "దక్షిణే సరలోదారౌ" పనిలో ముందు ఉండేవాణ్ణి, కపటరహితుడిని ఉదారుడంటుంది అమరకోశం. మరొక చోట "ఉదారో దాతృమహతోః" దాతను ఉదారుడంది.

కపటరహితుడైన లక్ష్మణుడు పనిలో ఎప్పుడూ ముందుండటం కూడా మనకు అనేక చోట్ల కనిపిస్తుంది కనుక ఆయనను ఉదారుడనడం సహజమే కానీ ఆయన ఎక్కడా ఏదీ దానం చేసినట్లు కనపడదు కదా! మరి ఆయన ఈ అర్థంలో ఏ విధంగా ఉదారుడు? సామాన్యంగా సంసారంలో ధనధాన్యాలు దానం చేసేవారు దాతలుగా యశాన్ని కీర్తిని పొందుతారు. కానీ ఏ వ్యక్తయితే లోకకల్యాణం కొరకు తన యశాన్నే త్యాగం చేశాడో, తన అస్తిత్వాన్నే అంతం చేశాడో, శరణాగతుడైనాడో అతడి కన్నా ఉదారుడెవరు?

భవంతికి ఆధారంగా ఉన్న పునాది ఎవరికీ కనిపించదు. అదే దాని యొక్క ఔదార్యత. అందుకే లక్ష్మణస్వామికి "జగత ఆధార, ఉదార" అనే విశేషణాలు ఇవ్వబడ్డాయి.

ఇక ఆ తరువాత చైత్రశుద్ధ ఏకాదశి శుక్రవారం నాడు సుమిత్రా మాత గర్భాన జన్మించిన కవలలలో చిన్నవాడి నామకరణానికి పూను కున్నారు శ్రీవసిష్ఠుల వారు.

"జాకే సుమిరన తే రిపు నాసా
నామ సత్రుహన బేద ప్రకాసా"

స్మరణ మాత్రాన శత్రునాశనం కాగల, ఈ పిల్లవాడి పేరు వేదాలలో శత్రుఘ్నుడని ప్రసిద్ధమై ఉన్నది.

ఉత్తర రామచరితంలో శివుడి నుండి త్రిశూలాన్ని పొంది అతి బలవంతుడై మాంధాత లాంటి అతిరథుడిని సంహరించిన లవణుడనే రాక్షసుడిని శత్రుఘ్నుడు సంహరించినట్లుగా ఉంది గాని, మామూలుగా రామయణంలో శత్రుఘ్నుడికి ఎవరైనా శత్రువులు ఉన్నట్లుగాని, ఆయన వారిని సంహరించినట్లుగానీ చెప్పబడలేదు. అటువంటప్పుడు మరి ఆయనకు శత్రుఘ్నుడనే నామం ఎలా సార్థక మౌతుంది?

"కామ వాత కఫ లోభ అపారా
క్రోధ చిత్తనిత ఛాతీ జారా"

భుసుండి అనే కాకి గరుడుడికి మానసిక రోగాలను గురించి చెబుతూ "కామం వాతరోగం లాంటిది. ఇది కలిగినప్పుడు నరాలన్నీ పట్టుకుపోయి కోరినది పొందనంత వరకు వాడిని బాధిస్తుంది. క్రోధమనే అగ్ని (జ్వరం) నిరంతరం హృదయాన్ని దహిస్తుంది. లోభం, కఫం లాంటిది దగ్గిన కొద్దీ అపారంగా ఇది బైటికి వస్తూనే ఉంటుంది" అంటాడు.

నారి నయన సర జాహిన లాగా
ఘోర క్రోధతమ నిసి జోజాగా
లోభపాంస జెహి గరన బంధాయా

సోనర తుమ్హ సమాన రఘురాయా

స్త్రీ అందం అనే బాణం ఎవరిని గాయపరచలేదు? క్రోధమనే చిక్కని చీకటిలో మేల్కొని ఉండగలిగింది ఎవడు? కానీ వీటన్నిటి కన్నా లోభమనే ఉరిత్రాడుకు తగలకుండా బైట పడినవాడు మాత్రం సాక్షాత్తు పరమాత్మేనని చెప్పవచ్చు.

ఇందులో కామమనే రావణాసురుణ్ణి శ్రీరాముడు దండించాడు. ఇంద్రజిత్తనే క్రోధాన్ని లక్ష్మణుడు జయించాడు. లోభమనే మంథరను శతృఘ్నుడు శిక్షించాడు.

కామం, క్రోథం అనేవి ఎల్లకాలం ఉండేవి కావు. ఒక్క క్షణం తృప్తి కలిగితే వెళ్ళిపోతాయి. కానీ లోభంలో మాత్రం తృప్తి పడటం అంటూ ఉండదు. అందుకే ఇది ఎంత ఉమ్మివేసినా తరగని కఫంతో పోల్చబడింది. అన్ని అనర్థాలకు కారణమైన మంథర, లోభానికి ప్రతి రూపం-దాన్ని జయించడమే శూర లక్షణం-అలా జయించినవాడే అజాత శత్రువు. అతడే శత్రుఘ్నుడు. ఈ విధంగా వసిష్ఠులవారు పెట్టిన పేరు సార్థకమైంది.

శత్రుఘ్నుడి భార్య శ్రుతకీర్తి, అంటే శ్రుతుల (వేదాల)లోని కీర్తి అన్నమాట. ఈ రకంగా సాధనలో లోభాన్ని జయించిన మహర్షుల పేర్లు శాశ్వతంగా వేదాలలో కీర్తించబడతాయని అర్థం.

అవతారిక:

పరమాత్మ నామరూప నిగూఢతత్త్వాన్ని వర్ణించిన వేదమాత, 19వ మంత్రంలో పరమాత్మను పొందిన రఘువంశజుల ఆనందాన్ని, తత్త్వ మాధుర్యాన్ని చిత్రరూపంలో అందించబోతోంది.

**19. మంత్రం**

**తిస్రో మాతౄస్త్రీన్ పితౄన్బిభ్రదేక ఊర్ధ్వస్తస్థౌ నేమవ గ్లాపయన్తి।**
**మన్త్రయన్తే దివో అముష్య పృష్ఠే విశ్వవిదం వాచమవిశ్వమిన్వామ్.**

(ఋగ్ 1-164-10)

కౌసల్య, సుమిత్ర, కైకేయి మొదలైన ముగ్గురు మాతలు, ముగ్గురు తండ్రులు, జన్మదాత దశరథుడు, ఉపనయన కర్త వసిష్ఠుడు, విద్యాదాత విశ్వామిత్రుడు, సంపూర్ణ సంసారంలో వ్యాపించి ఉన్న ఈ శరీరాన్ని పాలిస్తూ దుఃఖాన్ని పొందలేదు. విశ్వవిదుడైన ఆ పరమాత్మను బ్రహ్మాది దేవతలే ఎరుగలేరు.

వయ్యక్తిక ఆవశ్యకతా అనుభూతుల తీవ్రత కారణంగా నైనా లేక సమష్టి సామాజిక కారణాల చేతనైనా పరమాత్మ అవతరించడం జరుగుతుంది. ఏ సంసార మాయవల్లనైతే అధర్మం వ్యాపించిందో "ధర్మ సంస్థాపనార్థాయ" ఆ అధర్మాన్ని అంతం చేసి ధర్మాన్ని లోకంలో స్థాపించడం కొరకు "సంభవామి ఆత్మ మాయయా" - స్వమాయను అధిష్ఠించి నేను అవతరిస్తాను అంటాడు పరమాత్మ. ఇక్కడ సమష్టి సామాజిక కారణాలు భగవదవతారానికి కారణం అనిపిస్తాయి. కానీ మాయ అన్న పదానికి 'ప్రేమ' అనే అర్థం కూడా ఉంది. కనుక ప్రేమతో నా భక్తజనులు పిలవడం వల్ల అవతరిస్తాను అనే అర్థం కూడా వస్తుంది. ప్రేమ వయ్యక్తికమైంది. ధర్మ సంస్థాపన సామాజికమైంది.

చంద్రుడు భూమికి ఉపగ్రహమనేది వైజ్ఞానిక సత్యం. ఇది సమష్టికి సంబంధించింది. కానీ వైయ్యక్తిక భావంలో చంద్రుడు ఒకరికి మామ (చందమామ), ఇంకొకరికి విరహాన్ని రేకెత్తించే దుష్టుడు, ఇంకొకరికి శృంగారాన్ని ఉద్దీపింపజేసే మిత్రుడు.

ఏ పరబ్రహ్మ యొక్క ఒక్కొక్క రోమకూపంలో అనంత కోటి బ్రహ్మాండాలు దాగి ఉంటాయో, అటువంటి పరంధాముడు తన కుక్షి నుండి జన్మించాడనే విషయం ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని, బుద్ధిభ్రమను కలుగ జేస్తున్నాయంటుంది కౌసల్యామాత.

జన్మజన్మలకు సీతారాములే తన కొడుకు కోడళ్లు కావాలని కోరుకుంటుంది కైకేయి మాత. మొదటిసారి మంథర నోటి వెంట రామరాజ్య పట్టాభిషేక విషయం విని, ఆనందం పట్టలేక మెడనున్న

ఆభరణాన్ని దానం చేస్తుంది ఈ కైకేయి మాత.

రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్।
అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖమ్॥

నాయనా, లక్ష్మణా! నువ్వు రాముడిని నీతండ్రి దశరథుడిగా పరిగణించు. జనకనందిని సీతను నీ తల్లినైన నన్ను సుమిత్రగా భావించు, అరణ్యాన్ని అయోధ్యగా ఎంచి సుఖంగా ఇక వెళ్లిరా అంటూ తన తనయుడిని రామసేవలో సమర్పించే సుమిత్రా మాత గురించి ఇంకేమి చెప్పగలం?

జ్ఞానశక్తిశ్చ కౌసల్యా సుమిత్రోపాసనాత్మికా।
క్రియాశక్తిశ్చ కైకేయీ వేదో దశరథో నృపః॥

కౌసల్య జ్ఞానశక్తి, సుమిత్ర ఉపాసనాశక్తి, కైకేయి క్రియా శక్తి - ఈ మూడు శక్తులనూ భరించి పోషించే రాజు దశరథుడు స్వయంగా వేద స్వరూపుడు."వేదవిదుడు" వేదాలచేత తెలుసుకోబడేవాడు (పొందబడేవాడు) పరమాత్మ

త్వయా దశరథే నాహం తపసా ఆరాధితః పురా।
మత్పుత్రత్వాభికాంక్షిణ్యా తథా కృత మనిన్దితే॥

(ఆధ్యాత్మ - బాల)

సద్గుణ సంపన్నురాలైన ఓ కౌసల్యా! పూర్వజన్మలో నేను కొడుకునై పుట్టాలని కోరి నీవు, దశరథుడు (స్వాయంభూ మను, శతరూపలుగా) తపస్సు చేసి నన్ను ఆరాధించినందున, మీ కోరిక ప్రకారం ఇప్పుడు మీ కొడుకునై పుట్టాను అని పరమాత్మ చెబుతాడు.

ఈ విధంగా వేదం (దశరథుడు) జ్ఞానశక్తి ద్వారా పరమాత్మను పొంది..

"రామం రాజీవ పత్రాక్షం దృష్ట్వా హర్షాశ్రు సంప్లుతః"

కమల దళాలను పోలిన నేత్రాలుగల రాముడిని చూసి, కండ్లలో నుండి ఆనందాశ్రువులు ధారలై తడుపుతుండగా, ఆనందాతిశయాన్ని పొందాడు దశరథుడు.

దశరథుడు రామ దర్శనానందంలో గురు వసిష్ఠుడిని వేద పారాయణం చేయమని అడిగితే, ఆయన రామదర్శనానందంలో నేను నా పేరునే మరచిపోయాను, వ్యక్తిగత అహంకారమే నశించింది. ఇంక వేద మెక్కడ గుర్తుంటుంది. "అత్ర వేదా అవేదాభవన్తి" ఆ పరమాత్మ సాక్షాత్కారంలో వేదము అవేద మౌతుంది. గమ్యం చేరిన వాడికి సాధనతో పనేముంది. గురువుతో అవసర మేముంది. ఆ పరమానందంలో అన్నీ మాయమై పోతాయి.

మహర్షి వసిష్ఠులవారు ఎన్నో వేల ఏండ్ల నుండి ఇష్టం లేకున్నా రఘువంశానికి పౌరోహిత్యం నెరపడానికి కారణం ఈ వంశంలోనే పరమాత్మ ఆవిర్భవిస్తాడని బ్రహ్మదేవుడు చెప్పడమే. ఆయన సుదీర్ఘ ప్రతీక్ష ఈ నాటికి సంతుష్టమైంది.

నిర్గుణ నిరాకారుడైన పరమాత్మకు, సగుణ సాకార అవతార రూపాన్ని ఇద్దామని ప్రయత్నించే (వ్యక్తిగత అవసరంతోనైనా సరే) వ్యక్తిని మనువు అంటారు. అలా ప్రయత్నించే ప్రతి వ్యక్తీ మనువే. అంటే మనుష్యజాతి ప్రతినిధి అన్నమాట. వయ్యక్తిక ఆకాంక్షా పూర్తికొరకై పరమాత్మ ఆవిర్భవించినా, సమాజ అవసరాలను పూర్తి చేయడం కొరకు ముందుకు కదలవలసి ఉంది.

అటువంటి ఆ సమయంలో ప్రవేశిస్తాడు బ్రహ్మర్షి విశ్వామిత్రుల వారు. యజ్ఞ రక్షణార్థమై రామలక్ష్మణుల నివ్వమంటే నిరాకరిస్తాడు దశరథుడు. నా కొరకు నేను పిల్లలను కన్నానేగాని లోకోద్ధరణకు కాదు అని ఆయనంటే, విశ్వామిత్రుడు "నువ్వు వయ్యక్తిక కారణాల చేత యజ్ఞం చేసినా ఋష్యశృంగుడు సమష్టి సామాజిక క్షేమాన్ని దృష్టిలో పెట్టుకునే యజ్ఞం చేయించాడు. ఒక ఋషి సంకల్పంచేత యజ్ఞంనుండి అవతరించిన పరమాత్మను మరొక యాగరక్షణ కొరకు ఇంకొక ఋషి అడిగితే కాదంటావేమిటి" అన్నాడు.

అహం వేద్మి మహాత్మానం, రామం సత్యపరాక్రమమ్।

వసిష్ఠో2పి మహాతేజా యే చేమే తపసి స్థితాః॥ (వాల్మీకి-బాల)

రాజా! శ్రీరాముడు పేరుకు నీ కుమారుడే గాని నిజానికి ఆయన లోకానికే ప్రభువు. నీకు పుత్రభావంలో ఆయనలో ఎంత ప్రీతి ఉందో, ఆయనకు ఈ లోకం మీద అంత ప్రీతి ఉంది. నా సత్వగుణ సంపత్తి చేత, తపస్సుయోగబలము చేత సత్యం కొరకు (సత్య ధర్మ స్థాపనల కొరకు) ఆయన ఉపయోగించవలసిన (ఇంతకాలం అవ్యక్తంగా నివురు గప్పిన నిప్పులా ఉన్న) పరాక్రమాన్ని నేనెరుగుదును. నే నెరుగుదును అనే మాట అహంకారంతో (అహంకార విమూఢాత్మా కర్తాహమితి మన్యతే) అన్నది కాదు. ధ్యానాదులలో సాక్షాత్కరించిన అనుభూతిని దృష్టిలో ఉంచుకొని "వేదాహమేతం పురుషం మహాంతం" నేనెరుగుదును ఆ పరమ పురుషుడిని అని ప్రకటించిన అనుభూతి వాక్యమిది. "విశ్వవిదుడైన ఆ పరమాత్మను బ్రహ్మాది దేవతలే ఎరుగలేరని" వేదం చెబుతూనే ఉంది కదా మరి విశ్వామిత్రుడు తానెరుగుదునని ఎలా చెప్పాడు? అంటే "పురుషం మహాంతం" ఆయనను పరమాత్మగా గాక మహాపురుషుడిగానే ఎరుగుదును అని ఒక అర్థం చెప్పవచ్చు, లేదా తాను జీవుడిగా ఉండి పరమాత్మను ఎరగలేడు. తాను అలగా ఉండి సముద్రాన్ని ఎరగలేడు కనుక "సోహ2మస్మి" ఆయనలో కరిగిపోయి, తన అస్తిత్వాన్ని కోల్పోయి ఏకమైపోయి ఆయనే నేనని తెలుసుకునే అనుభూతి ఇది అని ఇంకొక అర్థం చెప్పుకోవచ్చు.

నేనే కాదు, పుత్ర వ్యామోహంలో అజ్ఞానం చేత ఆవరింపబడి ఉన్న (అజ్ఞానే నావృతం జ్ఞానం) నీకు చెప్పలేదు కానీ ఈ విషయం నీ కులపురోహితుడు, గురువు, బ్రహ్మజ్ఞాని అయిన వసిష్ఠమహర్షి కూడా ఎరుగును. మహాతేజోవంతుడైన ఆయన మాటైనా విను. అంతే కాదు ఇక్కడ కూర్చుని ఉన్న తపస్వులందరూ ఈ సత్యాన్ని ఎరుగుదురు. కనుక వారి మాటయైనా విని శ్రీరాముడిని నా వెంట పంపు అంటూ విశ్వానికి మిత్రుడైన ఆ మహర్షి సమాజంలో ధర్మాన్ని స్థాపింపజేయడానికై పరమాత్మ

ను తన వెంట తీసుకువెళ్లాడు.

ఆ తరువాత ప్రతిక్షణం రాజీవనేత్రుడి ముఖకమలవీక్షణానందంలో తన తపస్సును పవిత్రం చేసుకున్నాడు.

అవతారిక :

రామావతార తత్వాన్ని, పరమాత్మను పుత్రుడిగా పొందిన ఆరుగురు జీవాత్మల ఆనందాతిశయాన్ని వర్ణించిన వేదమాత కథాగమనంలో విశ్వామిత్ర యజ్ఞఘట్టంలోకి మనను ఆహ్వానిస్తోంది.

20. మంత్రం :

**మహాగ్ం ఋషిర్దేవజా దేవజూతో 2స్తభ్నాత్ సిన్ధుమర్ణవం నృచక్షాః।**
**విశ్వామిత్రో యదవహత్సుదాసమప్రియాయత కుశికేభిరిన్ద్రః॥**

(ఋగ్ : 3-53-9)

తన యజ్ఞవిఘ్నాన్ని దూరం చేసుకోవడానికి రామలక్ష్మణులను యాచిస్తూ విశ్వామిత్రుడు దశరథుడి వద్దకు వచ్చాడు. పూజ్యుడు, ఋషి ఇంద్రియ వశి అయిన విశ్వామిత్రుడు సముద్రాన్ని స్తంభింపజేసే సుదాసరాజు గోత్రంలో జన్మించిన రాముణ్ణి యజ్ఞ రక్షణార్థమై తీసుకు వెళ్లాడు. రామరక్షణలో నిర్విఘ్నంగా సాగిన యజ్ఞక్రతువులో విశ్వామిత్రుడి ద్వారా ఇవ్వబడిన ఆహుతులను స్వీకరించిన ఇంద్రుడు ప్రసన్నుడైనాడు.

"గాధి తనయ మన చింతా వ్యాపీ
హరిబిను మరహిన నిసిచర పాపే"

గాధి పుత్రుడైన విశ్వామిత్రుడి హృదయంలో చింత చేరింది. స్వయంగా హరి చేతిలో మాత్రమే ఈ నిశాచరులు మరణించగలరు అనుకోవడం మొదలు బెట్టాడు.

భృగుమహర్షి పుత్రుడు ఋచీకుడు. ఈయన గాధి మహారాజు కుమార్తె సత్యవతిని వివాహమాడాడు. ఆమె ఆయనకు సమస్త సేవలు చేసి మెప్పించింది. ఆమె భక్తికి మెచ్చిన ఋచీకుడు వరం కోరుకోమన్నాడు.

ఆవిడ తనకొక కుమారుడు, తన తల్లికొక కుమారుడు కలిగేలా వరమియ్యమని అడిగింది. ఆయన ఆమెను మేడిమ్రానును, ఆమె తల్లికి రావిమ్రానును కౌగలించుకోమని చెప్పాడు. వారు దానికి వ్యతిరేకంగా చేశారు. తరువాత ఆయన వారికి చెరొక మంత్రపూత జలకలశాన్ని ఇచ్చి తాగమంటే, వారు ఆ కలశాలను మార్చుకొని తాగారు. ఈ విపరీతాన్ని గ్రహించిన ఋచీకుడు సత్యవతికి పుట్టేవాడు బ్రాహ్మణుడయినా క్షత్రియ స్వభావం గలవాడుగా ఉంటాడని, ఆమె తల్లికి కలిగే కుమారుడు క్షత్రియుడైనా బ్రాహ్మణ స్వభావం గలవాడై ఉంటాడని చెప్పాడు. అందుకామె బాధపడి ఈ విపరీతం తన కుమారుడిపైగాక మనుమడిపై కలిగేలా అనుగ్రహింపమన్నది. ఆయన ఆలా అనుగ్రహింపగా వారికి జమదగ్ని మహర్షి పుట్టాడు. ఆయనకు కలిగిన కుమారుడు పరశురాముడు బ్రాహ్మణుడై ఉండి కూడా క్షత్రియ స్వభావం కలవాడైనాడు. అలాగే గాధికి కల్గిన క్షత్రియ కుమారుడు విశ్వామిత్రుడు బ్రాహ్మణ స్వభావం గలవాడైనాడు.

ఆ తరువాతి కాలంలో గాధి తరువాత రాజైన విశ్వామిత్రుడు వసిష్ఠ మహర్షితో వైర మేర్పడగా రాజ్యం విడిచి వెళ్లి తపస్సు చేసి బ్రహ్మర్షి అయినాడు. వసిష్ఠుడిని సమూలంగా నాశనం చేయడం కొరకు ఆయన చేసిన ప్రయత్నంలో అనేక దివ్యాస్త్రాలను సాధించాడు. లక్షల సంవత్సరాల తపస్సులో అనేకసార్లు పతనమవుతూ తిరిగి లేచి నిలబడేవాడు. ఆయన చేసిన అద్భుతాలు వర్ణించ శక్యంగానివి. తన పురుషార్థంతో తత్కాలీన సమాజ వ్యవస్థా నియమాలను మార్చి, జన్మతః కలిగేవర్ణ వ్యవస్థ బదులు తన కొరకు కర్మణావర్ణ వ్యవస్థను స్థాపించగలిగాడు. జన్మతః అబ్రాహ్మడై ఉండి కూడా బ్రాహ్మణుడని పించుకున్నాడు. త్రిశంకు కొరకు ఇంకొక స్వర్గాన్ని నిర్మించాడు. తన తపశ్శక్తితో సృష్టికి ప్రతిసృష్టి చేశాడు. కానీ ఇంత శక్తిశాలి అయిన ఆ ఋషి కూడా రాక్షసుల చేత సంత్రస్తుడైనాడు. ఇందుకు కారణమేమిటి?

విశ్వామిత్రుడు అస్త్రవిదుడై ఉండి కూడా అస్త్రాలను పరిత్యజించాడు. కనుక రాక్షసులను శస్త్రాలతో ఎదుర్కొనే ప్రసక్తేలేదు. కానీ మరి తన తపశ్శక్తితో వారిని ఎదుర్కోలేకపోయాడా? అవును.. ఆయన ప్రతిద్వందులు గా నిలిచిన మారీచ, సుబాహులకు రావణుడి అండ ఉంది. రావణుడి శక్తి ఇటు తపోరూపంలో బ్రాహ్మణులను, శస్త్రాస్త్ర విద్యలలో క్షత్రియులను గడగడలాడించగలదిగా ఉంది.

జన్మతః బ్రాహ్మణుడైన రావణుడు సమస్త శాస్త్రాలు ఎరిగినవాడు, కఠినాతి కఠినమైన సాధనలు చేసి శివుని, బ్రహ్మను కూడా మెప్పించి వరాలు పొందినవాడు. శస్త్రాస్త్రవిదుడై దేవ నాగ కిన్నెర కింపురుషాది సమస్త ప్రాణులను మృత్యుదేవత అయిన యముణ్ణి కూడా జయించిన వాడు. ఇక ఆ రోజులలో రావణుని ఎదుర్కోగల బ్రాహ్మణులు ఇద్దరు. వారే విశ్వామిత్ర, పరశురాములు. వీరిలో ఒకరు బ్రహ్మణత్వం విడిచి క్షత్రియత్వాన్ని స్వీకరిస్తే, మరొకరు క్షత్రియత్వాన్ని విడిచి బ్రాహ్మణత్వాన్ని స్వీకరించారు. అలాగే రావణుని ఎదుర్కోగల రాజులు కూడా ఇద్దరున్నారు వార్రే దశరథ జనకులు. అందులో శస్త్రాస్త్రకోవిదుడైన దశరథుడు యుద్ధంలో దేవతలకు కూడా సహాయం చేయగల సమర్థత ఉన్నావాడు. కానీ భోగలాలసుడై సంయమనియమాలు లేక తపస్సు మృగ్యమై ఉన్నావాడు. క్షత్రియుడైన జనకుడిలో క్షాత్రంకన్నా బ్రాహ్మ్యమే ఎక్కువగా కనబడు తుంది. ఈ నలుగురిలో ఎవరిలోనూ పూర్ణత్వం లేదు. ఇక రావణుని ఎదుర్కోగలిగిందెవరు?

కానీ అహింసకుడైన విశ్వామిత్రుడు హింసకుడైన రావణుని ముందు నిలవలేకపోయాడంటే అహింసాశక్తి కన్నా హింసాశక్తి ప్రబలమైందనే కదా అర్థం! ఇక్కడ ఒక మనోవైజ్ఞానిక సత్యం దాగున్నది. ఈ సమస్య కేవలం ఆనాటిదే కాదు, ఈనాడు కూడా ఈ సమస్య అంతే ప్రబలంగా కనిపిస్తుంది. కనుక ఈ విషయాన్ని స్పష్టంగా ఎరగటం అన్ని కాలాలలోనూ అవసరం. చాలావరకు అహింసకులైన వ్యక్తులు హింసకుల చేత

మరణించడం జరుగుతుంది. ఆయా సంఘటనలు విశ్లేషించినప్పుడు హింసా ప్రవృత్తే అధిక శక్తివంతంగా కనిపించడం సహజం. కాని సత్యం మాత్రం ఇందుకు పూర్తి విరుద్ధంగా ఉంటుంది. హింస, అసత్యం, అధర్మం జయించడానికి పూర్ణత యొక్క అవసరం లేదు. కానీ అహింసా, సత్యం, ధర్మం జయించాలంటే అవి తప్పక లోపరహితమై సంపూర్ణమై ఉండాలి. పతంజలి మహర్షి యోగదర్శనంలో అహింస యొక్క పరిభాషను ఇలా చెబుతారు -

"అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః"

ఏ వ్యక్తి హృదయంలో అహింస ప్రతిష్ఠితమౌతుందో (సంపూర్ణంగా) అతడి సమీపానికి వచ్చిన వ్యక్తులు కూడా వైరాన్ని పరిత్యజిస్తారు.

పతంజలి మహర్షి యొక్క ఈ అహింసా సిద్ధాంతపు గీటురాయి మీద నిఖార్సుగా నిలువగల వ్యక్తులను వేళ్లపైన లెక్కించవచ్చు. మనో,వాక్, కాయాలతో అన్యులపైన హింసాభావం కలిగి ఉండకపోవడం అనే సిద్ధాంతం కొంత వరకైనా సాధ్యం, కానీ పైవి అసాధ్యమనిపిస్తుంది. అహింసా ప్రవృత్తిలో పరిపూర్ణుడైన వ్యక్తి యొక్క ప్రభావం పరిసరాలపైన ఇతర ప్రాణులపైన ఎలా ఉంటుంది. అనే విషయం పతంజలి మహర్షి చెప్పడం జరిగింది. కానీ అది సాధనకు పనికిరాదు. తన నుండి వేరుగా ఏదీ లేదని తెలుసుకున్న స్థితప్రజ్ఞడికి తప్ప ద్వైతబుద్ధి ఏ మాత్రం మిగిలి ఉన్నా ఇది అసంభవమౌతుంది.

విశ్వామిత్ర మహర్షి శస్త్రాస్త్రాలను పరిత్యజించినప్పటికీ ఆయన అంతఃకరణంలో అహింసావృత్తి పూర్ణత్వాన్ని సంతరించుకోలేదు. అందుకే ఆయన సమక్షంలో రాక్షసులు హింసావృత్తిని విడవడం లేదు.

ఒకసారి క్షాత్రాన్ని విడిచిన తరువాత రాక్షసులతో సశస్త్రయుద్ధానికి సిద్ధపడటం విశ్వామిత్రుడికి ఉచితంగా కనిపించలేదు. కనుక ఈ రెండూ కాని మూడవ మార్గాన్ని ఆయన అన్వేషించాడు. హరించేవాడు(హరి) లేనిది, నా మనోచింతగానీ, ఈ రాక్షసులుగానీ హరించబడరు అనే భావం

ప్రకటమైంది. గొప్ప పురుషార్థవాది అయిన ఈయన ఈనాడు సాధనలో అజాగరూకత, బద్ధకాన్ని హరించడానికి పురుషార్థం అవసరమేగాని భక్తి శరణాగతిలో ఇదే అడ్డుగా నిలుస్తుంది అని గ్రహించాడు. తన యొక్క అసమర్థత యొక్క బోధే సాధకుణ్ణి హరి నాశ్రయించేలా చేస్తుంది.

ఎప్పుడూ అందరిని ఆజ్ఞాపిస్తూ శపిస్తూ గడగడలాడిస్తూ తిరిగే విశ్వామిత్ర మహర్షి ఈ రోజు యాగరక్షణార్థమై దశరథుడిని అర్థించడానికి, రాముడిని యాచించడానికి అయోధ్యకు వచ్చాడు. దుఃఖంలేని ప్రదేశాన్ని అయోధ్య అంటారు. విశ్వామిత్రుడు గొప్ప పురుషార్థవాది, సిద్ధాశ్రమ నివాసి అయి (సిద్ధిపొంది) ఉండి కూడా, చింతితుడు, దుఃఖితుడు అయి తనలోని న్యూనతను తొలగించుకోవడానికి దుఃఖాన్ని హరించే పరమాత్మ (హరి) వద్దకు వచ్చాడు.

గాయత్రీ మంత్ర ద్రష్ట కనుక ఆయన ఋషి తపస్వి కనుక పూజ్యుడు అయి ఉండి కూడా ఇంద్రియవశి కనుక గృహస్థుడైనప్పటికీ సముద్రాన్ని స్తంభింపజేసే సుదాస మహరాజు (కల్మాషపాదుని తండ్రి) గోత్రంలో ఆవిర్భవించిన రాముడిని యాగరక్షణ కొరకు యాచించాడు. వీర్యాన్నే స్తంభింపచేయలేని తన చేతగానీ, భోగియైన దశరథుడి వల్లగానీ ఈ యాగరక్షణ కార్యం సాధ్యం కాదు. అందుకే ససైన్యుడై వచ్చి యజ్ఞాన్ని రక్షిస్తానన్న దశరథుడి మాట కాదన్నాడు. తపస్సులో వీరితో పోటీపడగల రావణాసురుడిలో కూడా వీర్యాన్ని స్తంభింపచేయలేని బలహీనత ఉన్నది. వారి ప్రతిద్వంద్వులలో కూడా అదే బలహీనత ఉంటే అతడిని జయించడం ఎలా సాధ్యమౌతుంది? కనుక కౌమార ప్రాయుడు, బ్రహ్మచారి, కాబోయే ఏకపత్నీవ్రతుడైన రాముడే ఆ కార్యాచరణలో సమర్థుడని విశ్వామిత్ర మహర్షి గుర్తించాడు.

వేద స్వరూపమైనది, సర్వవేదసారమైనది అయిన గాయత్రీ మంత్రాన్ని దర్శించిన పూజనీయ మహాఋషి విశ్వామిత్రుడు. అయినా సరే ఆయనలో ఇంకొక లోపం మిగిలి ఉంది. "వేదైశ్చ సర్వైః అహమేవ

వేద్యః'' అన్ని వేదాలలోనూ తెలుసుకో దగ్గవాణ్ణి నేను "వేదాంతకృత్" వేదాలను రచించినవాడు అయిన పరమాత్మ శ్రీరామచంద్రుడిని ఆయన చేరుకోవలసి ఉన్నది. గాయత్రీ మంత్రసారమే రామనామం అని తెలుసుకోవలసిఉంది.

"ముక్తా, విద్రుమ, హేమ, నీల, ధవళ చ్ఛాయై ర్ముఖై స్త్రీక్షణైః''

ఈ పై గాయత్రీ ధ్యాన శ్లోకంలో గాయత్రీమాతను పంచముఖిగా వర్ణించారు. ఇందులో ధవళ వర్ణం గల శిరస్సు "క్షితేరీశః" భూతత్వ అధిష్టాత అయిన శివతత్త్వము. నీల వర్ణ శిరస్సు "ఆకాశ స్యాధిపో విష్ణుః'' ఆకాశతత్వ అధిష్ఠాత అయిన విష్ణుతత్వము, స్వర్ణవర్ణ శిరస్సు "వాయోస్సూర్యః'' వాయుతత్వ అధిష్ఠాత అయిన సూర్యతత్వము. ఎఱ్ఱటి వర్ణ శిరస్సు "అగ్నేశ్చైవ మహేశ్వరి'' అగ్నితత్వ అధిష్ఠాత్రి అయిన దేవీతత్వము. ముత్యము వర్ణ శిరస్సు "జీవనస్య గణాధిపః" జలతత్వ అధిష్ఠాత అయిన గణపతి తత్వము.

పంచభూతాలలో ఆకాశము, వాయువు, అమూర్తాలు (కనిపించనివి) , అగ్ని, జలం, పృథివి - మూర్తాలు (కనిపించేవి), అమూర్త తత్వాధిష్టాతలైన విష్ణు, సూర్యులిద్దరూ హరి తత్వాలే-హరిని నారాయణుడంటారు, సూర్యుడిని కూడా సూర్యనారాయణుడంటారు. ఇక శివ, గణపతి, దేవి - ముగ్గురూ హరతత్వాలు.

కనుక గాయత్రిలో హరి, హరులిద్దరూ ఉన్నారు. హరి మంత్రాలలో శిరోమానికమైంది "ఓం నమో నారాయణాయ'' అష్టాక్షరీ మంత్రం. శివమంత్రాలలో శ్రేష్ఠమైంది "నమశ్శివాయ'' పంచాక్షరీ మంత్రం. శరీరంలో ప్రాణం ఉంటే ఇది శివం (శుభం).లేకపోతే ఇది శవం(అశుభం) అలాగే ఈ మంత్రాలలో ఏ అక్షరం తీసివేస్తే అమంగళార్థం వస్తుందో అదే ఆ మంత్రానికి ప్రాణాక్షరం. అష్టాక్షరీ మంత్రం నుండి 'రా' అనే అక్షరం తీసివేస్తే "నమో నారాయణ= నమో న+అయనాయ=కండ్లులేనివాడికి నమస్కారం'' అనే అశుభార్థం. అలాగే

పంచాక్షరీలో నుండి 'మ' అనే అక్షరం తీసివేస్తే "నశ్శివాయ = శుభం కొఱకు కాదు - నశింపజేసేవాడు" అనే అర్థం వస్తుంది. కనుక ఈ రెంటిలో "రా+మ" అనే రెండే ప్రాణాక్షరాలు. అవే మొత్తం గాయత్రీ మంత్రానికి సారం.

గాయత్రీ మహామంత్రద్రష్ట అయిన విశ్వామిత్రుడు ఆ మంత్రార్థమై, మంత్రసారమై విలసిల్లిన రామతత్వాన్ని, ఆ రామనామ ప్రభావాన్ని, ఆ మంత్రవాచ్యుడిని పొందినవాడై తన యజ్ఞాన్ని నిర్విఘ్నంగా పూర్తి చేసుకొని కృతార్థుడైనాడు.

ఎన్నో ఏండ్లుగా యజ్ఞహవిస్సు రావణపరమైపోతుండగా ఈ రోజు మళ్లీ ఆహుతులను పొందినవాడై దేవరాజు ఇంద్రుడు సంతుష్టుడైనాడు.

అవతారిక :

20వ మంత్రంలో సూక్ష్మంగా విశ్వామిత్ర యాగరక్షణ ఘట్టాన్ని మన కండ్లముందుంచిన వేదమాత అదేఘట్టాన్ని విపులీకరించబోతోంది.

**21,22,23. మంత్రాలు :**

**విశ్వామిత్రా అరాసత బ్రహ్మేన్ద్రాయ వజ్రిణే। కరదిన్నః సురాధసః॥**

(ఋగ్ : 3-53-13)

**బలమంత్రః**

**బలం ధేహి తనూషు నో బలామిన్ద్రానళు త్స్వనః।**
**బలం తోకాయ తనయాయ జీవసే త్వం హి బలదా అసి॥**

(ఋగ్ : 3-53-18)

**అతిబలామంత్రః**

**ఇన్ద్రోతి భిర్బహులాభిర్నో అద్య యాచ్ఛ్రేష్ఠాభి ర్మఘవచ్ఛూర జిన్వ।**
**యోనోద్వేష్ట్యధరః సస్పదీష్ట యము ద్విష్మస్తము ప్రాణో జహాతు॥**

(ఋగ్ : 3-53-21)

విశ్వామిత్రుడు శ్రీరాముడికి బలా, అతిబలా అనే పేరుగల మహావిద్యలనుపదేశించాడు.

బలా మహావిద్యా మంత్రం ఇలా ఉంది:- బలాన్ని ఇవ్వు! బలాన్ని ఇవ్వు! నా శరీరాన్ని బలంగా చేయి, స్వస్థ చిత్తాన్ని కలుగజేయి! బాహ్యాంతరాలలో (బైటా లోపల) గల శత్రువులను జయించగల శక్తిని ఇవ్వు".

అతిబలా మహావిద్యామంత్రం ఇలా ఉంది : "ఓ ఇంద్రా! సమస్త విభూతులను లాభాలను నాకు కలుగజేయి. హే మఘవన్! నన్ను ద్వేషించే వారు పతితులగుదురుగాక, నాచే ద్వేషించబడేవారు ప్రాణాలను విడుతురు గాక!"

ముందు కూడదన్నా వసిష్ఠ మహర్షి ప్రేరణచేత దశరథ మహారాజు రామలక్ష్మణులను విశ్వామిత్ర మహర్షి వెంట పంపాడు. కొంత దూరం వారిని తీసుకువెళ్లిన విశ్వామిత్రుడు...

"దదౌ బలాం చాతి బలాం విద్యే ద్వే దేవనిర్మితే"

దేవ నిర్మితమైన బలా, అతిబలా అనే రెండు విద్యలను ఉపదేశించాడు. ఇలా రెండు విద్యలు విశ్వామిత్ర మహర్షి రాముడికి ఉపదేశించినట్లుగా అనేక రామాయణాలలో చెప్పబడిందే కాని ఆ మంత్రాలు ఏవి అనే విషయం ఎక్కడా చెప్పబడలేదు. కానీ వేదమాత ఈ పైన మనకు ఈ రెండు మంత్రాలను అందిస్తోంది. అక్షర లక్షల జపంతో సాధకులకు ఈ మంత్రాలు సిద్ధించగలవు. వాటి యొక్క ఫలితాన్ని వాల్మీకి రామాయణం ఈ విధంగా వర్ణిస్తోంది.

"నశ్రమో న జ్వరో వా తేన రూపస్య విపర్యయః
న చ సుప్తం ప్రమత్తంవా ఘర్షయిష్యన్తి నైఋతాః
న బాహ్వో సదృశో వీర్యే పృథివ్యా మస్తి కశ్చన
న సౌభాగ్యేన దాక్షిణ్యే న జ్ఞానే బుద్ధి నిశ్చయే
నోత్తరే ప్రతివక్తవ్యే సమో లోకే తవానఘ
ఏతద్ విద్యాద్వయే లబ్ధే న భవేత్ సదృశ స్తవ
క్షుత్పిపాసే న తే రామ భవిష్యేతే నరోత్తమ
బలా చాతిబలా చైవ సరత స్తాత రాఘవ

గృహాణ సర్వలోకస్య గుప్తయే రఘునందన
విద్యాద్వయ మధీయానే యశశ్చాథ భవేద్ భువి
పితామహసుతే హ్యేతే విద్యే తేజః సమన్వితే".

ఈ బలా, అతిబలా విద్యల ప్రభావంతో నీకు శ్రమకలగదు, జ్వరం రాదు. నీ రూపంలో ఎటువంటి వికారం (వృద్ధ్యాప్యం రోగం మొ॥) కలగదు. నిద్రా సమయం లేదా అజాగరూక సమయాలలో రాక్షసులు నీపై ఆక్రమణం చేయలేరు. ఈ భూతలంలో నీతో సమానమైన బాహుబలం కలవారు ఉండరు. ఓ పాపరహితుడా! సౌభాగ్యంలోనూ, చాతుర్యంలోనూ, జ్ఞానంలోనూ, బుద్ధి సంబంధి నిశ్చయాలలోనూ, ఎదుటివారి ప్రశ్నలకు జవాబీయడంలోనూ ఎవరూ నీతో పోటీ చేయలేరు. ఈ రెండు విద్యలు ప్రాప్తించిన నీతో ఎవరూ పోటీ పడలేరు. ఎందుకంటే ఈ విద్యలు రెండూ సమస్త జ్ఞానానికి తల్లిలాంటివి. ఓ నరశ్రేష్ఠుడవైన రామా!. రాఘవా! ఈ విద్యల ఉపాసనతో నీకు ఆకలి దప్పులు అంతమై పోతాయి. ఓ రఘునందనా! సర్వలోకాలను రక్షించడం కొరకు ఈ విద్యలను స్వీకరించు. వీటితో ఈ లోకంలో నీ యశం విస్తరించగలదు. ఈ రెండు తేజోవంతమైన విద్యలు బ్రహ్మయొక్క పుత్రికలు అని వర్ణించబడింది కనుక - ఈ మంత్రాలను ఉపాసించేవారు స్వార్థరహితులై, లోక కల్యాణాన్ని అపేక్షించి ఈ విద్యలను స్వీకరించాలని మనవి.

అవతారిక :

బలా, అతిబలా విద్యలను పొందిన తరువాత, మార్గంలో ముందుకు సాగే రామలక్ష్మణులకు ఎదురైన తాటక వధ వృత్తాంతాన్ని వేదమాత 24వ మంత్రంలో తన అనుపమాన విధానంలో వివరించబోతోంది.

**24. మంత్రం :**

**పరా దే హి శాముల్యం బ్రహ్మభ్యో వి భజా వసు।**
**కృత్యైషా పద్వతీ భూత్వ్యా జాయా విశతే పతిమ్॥**

(ఋగ్ 10-85-29)

సిద్ధాశ్రమం వైపు వెళుతున్న రామలక్ష్మణులకు ఎదురుగా తాటక వస్తూ ఉండటాన్ని చూసిన విశ్వామిత్ర మహర్షి "విజయలక్ష్మిని, గృహలక్ష్మిని పొందాలని ప్రయత్నిస్తున్నప్పుడు పరాజయ అలక్ష్మి, దారిద్ర్య అలక్ష్మి ఎదురొస్తాయి. అందులో మొదటి దాన్ని శస్త్రంతోనూ, రెండవదాన్ని దానంతోనూ సంహరించాలి. ఓ రామా! తాటకరూప అమంగళాన్ని దూరం నుండే సంహరించు. రెండవదాన్ని నాశనం చేయడం కొరకు బ్రాహ్మణులకు దానం చేయి. ఎందుకంటే వధించ యోగ్యమైన ఈ రాక్షసి పాదవతి (కాళ్లున్నది) అయిన కారణాన భర్త దగ్గరికి వచ్చే భార్యలాగా రాజు ఇంటికి నడిచి రాగలదు.

సుకేతుడి కుమార్తె తాటక. ఈమెకు వెయ్యి ఏనుగుల బలం ఉండేది. జంభుడి కుమారుడైన సునందుడితో ఈమె వివాహం అయ్యింది. వారికి మారీచ, సుబాహులనే ఇద్దరు కొడుకులు కలిగారు. ఈ తల్లీ కొడుకులు ముగ్గురు కేవలం భగవంతుడి చేతనే చావాలనే వరం పొందారు. ఈ గర్వంతో వాళ్లు వికృత రాక్షస రూపాలు ధరించి తపస్సులో ఉన్న అగస్త్యుడిని భయపెట్టడానికి వెళ్లారు. ఆయన కోపగించి శాశ్వతంగా వాళ్లను రాక్షసులై పోండని శపించాడు.

రామచరిత్రను తులసీదాసు ఘటనాబద్ధమైన చారిత్రిక విషయాలు గా మాత్రమేగాక అంతఃకరణ జగత్తులో మనకు కలిగే ద్వంద్వ విచారాలుగా కూడ వర్ణిస్తాడు. తాటకను ఆయన 'దురాశ' అంటాడు. ప్రతి వ్యక్తి మనస్సులోనూ ఈ తాటక ఉంది. ఇది ఎప్పుడూ యజ్ఞంలో విఘ్నాన్ని కలిగిస్తూ ఉంటుంది. వితరణ ప్రక్రియ అంటే ఇతరులకు పంచడమే యజ్ఞం. ఈ యజ్ఞంలో అవరోధమే తాటక (దురాశ). సామాన్యంగా మనం ఇతరులకు ఇచ్చే దానికి రెండు మూడింతలు ఎక్కువగా ఆశిస్తాము. ఈ దురాశ ఇద్దరు వ్యక్తుల మధ్యేకాదు, వ్యక్తికి సమాజానికి మధ్య కూడా ఉంటుంది. ఆశా, కల్పనల శరీరాలు చాలా పెద్దవి. అందుకే తాటక 5-6 తాటి చెట్ల ప్రమాణంలో ఉన్నదన్నారు. దానికి వెయ్యి ఏనుగుల బలం

కూడా ఉంది. ఆశయొక్క బలం వల్లే వ్యక్తి ఎంత పెద్దకర్మ చేయడానికైనా సిద్ధపడతాడు. ఈ ఆశ అనే తాటక బాగా బలం పుంజుకొని విశాలమైనా ప్రమాదమే, లేక పూర్తిగా సమసిపోయినా ప్రమాదమే. ఆశావాదం మంచి దైనప్పటికీ అధికంగా ఆశించినప్పుడు తక్కువ వస్తే వ్యక్తి దుఃఖితు డౌతాడు. ఆశ పూర్తిగా చచ్చిపోతే నిరాశావాదిగా అయిపోయి ఆత్మహత్య చేసు కుంటాడు. అందుకే రాముడు దాన్ని చంపలేదు.

శ్లో॥ తా మేకేన శరేణాశు తాడయా మాస వక్షసి।
పపాతి విపినే ఘోరావమన్తీ రుధిరం బహు॥

(ఆధ్యాత్మ : బాల)

ఆ తాటకిని రాముడు వక్షస్థలంలో ఒక బాణంతో కొట్టాడు. అది నోట భయంకరంగా నెత్తురు కక్కుతూ కింద పడింది.

"శాపాత్పిశాచతాం ప్రాప్తా ముక్తా రామ ప్రసాదతః"

శాపం చేత భయంకర రూపాన్ని పొందిన ఆ తాటకి రామానుగ్రహం తో ముక్తురాలైంది. ఆధ్యాత్మ రామాయణంలోని ఈ వివరణలో ఎక్కడా తాటకి మరణించినట్లుగా లేదు. అంటే ఆశను సంపూర్ణంగా చంపకూడ దన్నమాట! మరి ఏం చేయ్యాలి?

ఒకే బాణంతో దాన్ని (ఆశను) రామార్పితం చేయాలి. భయంకర మైన ఆ దురాశారూపాన్ని - రామప్రాప్తి సాధనా రూప ఆశ అనే అందమైన రూపంలోకి మార్చాలి.

"హరి సో జోరి, సబన్సే తోర్యో"

అందరితోనూ (అన్నిటితోనూ) సంబంధం తెంపివేసి, కేవలం హరితోనే కలుపుకోండి.

ఈ ప్రపంచంపై నుండి ఆశను, విశ్వాసాన్ని, అపేక్షను తీసి కేవలం పరమాత్మపై నిలపాలి. వీటిని ఏకీకృతం చేయాలి. ప్రస్తుతం మనకు డబ్బుపై ఆశ, భార్యపై విశ్వాసం, కొడుకులపై అపేక్ష ఉన్నాయి. ఈ విధంగా మన

శక్తి అంతా ముక్కలుగా విడగొట్టబడుతొంది. ఇవన్నీ రాముడిపైకి తిప్పిననాడు మనం నిశ్చింతులం కాగలము.

"నహి తే స్త్రీ వధకృతే ఘృణా కార్యా నరోత్తమ"

"నీవు స్త్రీ హత్యకు వెనుకాడి, దానిపై దయచూపకు నరోత్తమా" అంటాడు విశ్వామిత్రుడు. దురాశపైకి కఠినంగా శస్త్రధారుడై పరుగెత్తాలి. వాడే జీవితంలో విజయలక్ష్మిని (శాంతిని) పొందుతాడు. అలాంటి స్థిర మనస్కుడే వైవాహిక జీవితానికి అర్హుడు. గృహస్థ ధర్మాలలో మొదటిది 'దానం' దురాశ అంతమైన ప్రశాంత మనస్క గృహస్థుడు దాన కర్తవ్యాన్ని నిర్వర్తించి పవిత్రుడై లక్ష్మికి ఇష్టుడై నిలుస్తాడు. కనుక అతడిని దారిద్ర్యం విడిచి పెడుతుంది.

"తబ ప్రభు రిషిన్హ సమేత న హాయే
వివిధ దాన మహిదేవన్హి పావి"

దురాశను దునుమాడిన రాముడు, సీతారాముడు కాబోతున్న శుభసందర్భం లో పవిత్ర గంగానదిలో స్నానం చేసి అనేక దానాలు ఇచ్చాడు.

ప్రజాధనాన్నే మళ్లీ ప్రజల క్షేమార్థమై ఉపయోగించడంలో జాగరూకత లేని రాజు దగ్గరికి ఈ దురాశ అనే తాటక నడచి రాగలదు. కనుక ఇప్పటి నుండే ఉదారుడవై దానధర్మాలలో ఉత్సుకుడవై ఉండురాజా, రామా! అని విశ్వామిత్రుడు హెచ్చరిస్తున్నాడు.

"సర్వాస్త్రజాలం సరహస్య మన్త్రం ప్రీత్యాభిరామాయ దదౌ మునీన్ద్రః"

తాటకి వధతో సంతృప్తుడైన విశ్వామిత్రుడు రావణ వధ నిమిత్తమే ఆవిర్భవించిన శ్రీరాముడి కార్యంలో భాగం పంచుకోగోరి, తానెరిగిన సమస్త శస్త్రాస్త్రాలను వాటి సమస్త రహస్య మంత్రాలతో సహా రాముడికి ఇచ్చి కృతార్థుడైనాడు.

అవతారిక:

24వ మంత్రంలో తాటకి వధను వర్ణించిన వేదమాత శ్రీరామ లక్ష్మణులు

యాగరక్షణ చేసిన విధానాన్ని 25, 26 మంత్రాలలో వివరించబోతోంది.

**25, 26. మంత్రాలు :**

**పూర్వాపరం చరతో మాయ యైతౌ శిశూక్రీలంతౌ పరి యాతో అధ్వరమ్।**
**విశ్వాన్యన్యో భువనాభి చష్ట ఋతూగ్ంరన్యో విదధజ్జాయతే పునః॥**

(ఋగ్ : 10-85-18)

**ఉప ప్రేత కుశికాశ్చేతయధ్వమశ్వం రాయే ప్రముఞ్చతా సుదాసః।**
**రాజావృత్రం జంఘన త్ప్రాగ పాగుదగథా యజాతే వర ఆ పృథివ్యాః॥**

(ఋగ్ : 3-53-11)

రామలక్ష్మణ బాలకులిరువురూ ముందు వెనుక నడుస్తూ యజ్ఞాన్ని రక్షించారు. రాముడు సూర్యుడి లాగా సంపూర్ణక్షేత్రాన్ని వీక్షించాడు, లక్ష్మణుడు తిథ్యాదిక్రమంలో ప్రపంచాన్ని ధరించాడు.

ఓ విశ్వామిత్ర మహర్షి! మీరు బాగా సావధానులు కండి! కర్మ సమృద్ధితో యుక్తుడైన సుదాస గోత్రోత్పన్న రాముని ఆజ్ఞతో యజ్ఞాన్ని ప్రారంభించండి. రాజారాముడు అన్ని దిశలలో ఉన్న విఘ్నకారులైన రాక్షసులను సంహరించి, యజ్ఞవాటికను సమీపించి యజ్ఞం చేయమని ఆజ్ఞాపిస్తున్నాడు.

"సిద్ధాశ్రమం గతా స్సర్వే సిద్ధచారణ సేవితమ్"

తాటక వధానంతరం దివ్యాస్త్రాలను పొందిన రామలక్ష్మణులు విశ్వామిత్ర సహితంగా సిద్ధులచేత, చారణుల చేత సేవితమైనది, వామనావతారంలో శ్రీ మహావిష్ణువు తపస్సిద్ధి పొందినది అయిన సిద్ధాశ్రమం (వామనాశ్రమం అని కూడా పేరు) చేరారు.

యజ్ఞం ప్రారంభమైంది. రామలక్ష్మణులిద్దరూ ఒకరి వెనుక ఒకరు ఉంటూ యజ్ఞవాటిక చుట్టూ ప్రదక్షిణ చేస్తూ యజ్ఞాన్ని రక్షిస్తున్నారు.

"హృద్దేశే2ర్జున తిష్ఠతి"

అనంతకాలం నుండీ ఆ పరమాత్మ శరీరమనే యజ్ఞగుండంలో జరుగు

తున్న యజ్ఞకార్యాన్ని రక్షించడానికి నిలుచునే ఉన్నాడు. కానీ జీవుడే ఆయనను ఉపేక్షిస్తున్నాడు. "ప్రణవో ధనుః" ఆయన ఓంకారమనే ధనుస్సు పట్టుకొని ఉన్నాడు. ఆ విల్లే జ్ఞానం, వివేకం బాణం. ప్రతిక్షణం జాగరూకుడై మనం నిద్రించినా ఆయన నిద్రించక ఉన్నాడు. సమత్వ భావన కలిగిన సూర్యవంశోద్భవ రాముడు సూర్యుడిలాగా యజ్ఞశాలనంతా వీక్షిస్తున్నాడు. ఆయన స్వరూపమే సాక్షిత్వం. కేవలం వీక్షణ ద్వారానే ఆయన సర్వలోకాలు సృష్టించాడంటుంది శ్రుతి (తదైక్షత, సలోకాన్ అసృజా ఇతి).

పరమాత్మ చూపే సంకల్పం. ఆ సంకల్పాన్ని అర్థం చేసుకొని యోగమాయ సృష్టి మొదలు బెడుతుంది. కానీ సృష్టి చేయడానికి కాలం అవసరం. ఏ సృష్టి అయినా కాలబద్ధమై ఉంటుంది. ఈ కాలస్వరూపుడే లక్ష్మణుడు. ఈ కాలానికి వేయి తలలు, దీనితో ఆయన భూమిని మోస్తున్నాడు అంటాయి పురాణాలు. అంటే ఈ సృష్టికి ఆధారమైంది కాలమన్నమాట. ధ్యానంవల్ల కల్గిన సమాధిస్థితిలో ఈ కాలాన్ని దాటి పోయిన వాడికి కేవలం సాక్షీమాత్రుడైన పరమాత్మ మిగులుతాడు కాని కాలబద్ధమైన సృష్టి ఉండదు. తిథి వార నక్షత్రాలనే కొలబద్దలతో ఈ సృష్టినడుస్తుంది.

"అథ తౌ దేశకాలజ్ఞౌ రాజపుత్రౌ వరిందమే
దేశేకాలే చ వాక్యజ్ఞావభ్రూతాం కౌశికం వచః"

ఆ తరువాత దేశకాలాల నెరిగిన రామలక్ష్మణ శత్రుదమన రాజ కుమారులు, దేశకాలానుసారంగా చెప్ప యోగ్యమైన మాటలు ఎరిగిన వారై, విశ్వామిత్రుడితో ఇలా అన్నారు."రాక్షసులు యజ్ఞాన్ని విఘ్నం చేయడానికి ఎప్పుడు వస్తారు? మీరు ఈ విషయం చెప్పేట్లయితే మేము జాగరూకులమై యజ్ఞాన్ని రక్షించగలం".

వారి మాటలు విని సంతోషించిన కౌశికుడు..

"అద్య ప్రభృతి షడ్రాత్రం రక్షతాం రాఘవౌయువామ్"

ఓ రఘువంశ రాజకుమారులారా! మీరు సావధానులై ఈ రోజు నుండి ఆరు రాత్రులు యజ్ఞాన్ని రక్షించండి - అన్నాడు.

వారానికి ఏడు రోజులు, అందులో కర్మగతి యానమయ్యేది ఆరే రోజులు. ఒక రోజు విశ్రాంతికై నియోగించబడింది. జాగరూకులై ఈ ఆరు రోజులు రాక్షసగణాలు (దుర్గుణాలు) దరిచేరకుండా ధ్యానం చేసిన సాధకుడు షట్చక్రాలను దాటి సహస్రారంలో విశ్రమిస్తాడు. షడ్ రుచులతో కూడుకున్న ఈ సంసారం, దాటడానికి బహుదుస్తరమైంది. శ్రీరామ చంద్రుడి వీక్షణలో (నేతృత్వంలో) ఈ కాలగతిని అదుపు చేస్తూ లక్ష్మణుడు సాధనకు పురోగమించగా, ఆరు రోజులు రాత్రింబవళ్లు యాగరక్షణ కార్యం కొనసాగింది.

ఆరవరోజురాత్రి (ఆధ్యాత్మ రామాయణానుసారంగా పగలు) తాటక పుత్రులైన మారీచ సుబాహువులు పెద్ద సైన్యంతో యజ్ఞాన్ని ధ్వంసం చేయడానికి వచ్చారు. రామలక్ష్మణులిద్దరూ అనేక శస్త్రాస్త్రాలతో ఆ సైన్యాన్నంతా సంహరించి, సుబాహువును కూడా తునుమాడారు. మారీచుడు మాత్రం నూరు యోజనాల దూరం వరకు విసిరివేయబడ్డాడు. బీహారులోని సిద్ధాశ్రమం నుండి మహారాష్ట్రలోని నాసిక్ ప్రాంతం సరిగ్గా నూరు యోజనాలు ఉంటుంది.

జితుడనేవాడు జయవిజయులకు కింకరుడు. జయవిజయులతో బాటు ఇతడు కూడా సనక సనందనాది మహర్షుల శాపానికి గురియై మారీచుడిగా పుట్టాడు అని బ్రహ్మవైవర్త పురాణం చెబుతోంది. పూర్వజన్మ సంస్కారం కలిగిన వీడు ఆ తరువాత బుద్ధి తెచ్చుకొని పంచవటి ప్రాంతంలో తపస్సుకు ఉపక్రమించాడు. ఆ తరువాత రావణుడి చేత బలవంతంగా ప్రేరేపించబడి, మాయజింక రూపంలో రాముడి చేత హతుడై శాప విమోచనం కలిగి తన స్వధామాన్ని చేరుకున్నాడు. ఈ మారీచుడిపుత్రుడే కాలనేమి. ఇతడు సంజీవనీ పర్వతాన్ని తీసుకువెళ్లడానికి వచ్చిన ఆంజనేయస్వామిని ఋషి రూపంలో మోసగించబోయి ఆయన చేతిలో

ప్రాణాలు విడిచినట్లుగా కృత్తివాస(బెంగాలీ) రామాయణం చెబుతోంది.

యజ్ఞవాటిక బైట జరుగుతున్న భయానకమైన యుద్ధంలో తన క్షేమాన్ని గూర్చి యోచించే విశ్వామిత్రుడు యజ్ఞాన్ని ఆపివేయకుండా ఉండటం కొరకు

"శ్రీరామః కౌశికం ప్రాహ మునే దీక్షాం ప్రవిశ్యతామ్"

శ్రీరాముడు కౌశికుడిని సమీపించి ఓ మునీ! దీక్షలోకి తిరిగి ప్రవేశించండి. కర్మయోగంలోనూ, శౌర్యంలోనూ నిష్ణాతులుగ పేరుగాంచిన సుదాసాది సూర్యవంశ రాజుల గోత్రంలో ఆవిర్భవించిన నాకు ఎటువంటి హాని కలుగుతుంది? కనుక సంశయించక యజ్ఞాన్ని ప్రారంభించండి. రాక్షసుల నందరినీ సంహరించిన నేను యజ్ఞారంభానికి అనుజ్ఞ నిస్తున్నాను-అన్నాడు.

ఈ విధంగా చివరికి విశ్వామిత్రుడి యజ్ఞం సుసంపన్నమైంది.

అవతారిక:

25, 26 మంత్రాలలో విశ్వామిత్ర యాగరక్షణను వర్ణించిన శ్రుతిమాత 27, 28 మంత్రాలలో శ్రీరాముడి మిథిలానగర ప్రయాణాన్ని అహల్యా శాపవిమోచన వృత్తాంతాన్ని వివరించబోతోంది.

**27,28. మంత్రాలు**

**బల విజ్ఞాయః స్థవిరః ప్రవీరః సహస్వాన్ వాజీ సహమాన ఉగ్రః।**
**అభివీరో అభిసత్వా సహోజా జైతుమిన్ద్ర రథమా తిష్ఠగోవిత్॥**

(ఋగ్ : 10-103-5)

**అరం దాసో న వీళ్హుషే కరాణ్యాహం దేవాయ భూర్ణయే2నాగాః।**
**అచేత యదచితో దేవో ఆర్యోగృత్సం రాయే కవితరో జునాతి॥**

(ఋగ్: 7-86-7)

ధనుష్ యజ్ఞానికి వెళ్లడానికి సిద్ధంగా ఉన్న రాముడి ముందు దేవరథము దివ్యాయుధాలు ప్రత్యక్షమై ఇలా అన్నాయి. "బలాన్ని పరీక్షించి శివధనుస్సును ఎక్కుపెట్టిన వారికి కన్యనిస్తాను" అని జనకుడు ప్రతిజ్ఞ

చేశాడు. వృద్ధులు, వీరులు, మనుష్యులు, శత్రుదమనం చేయగలవారు అయిన తమ్ములతో పరివేష్టించి ఉన్న జనకుడి వద్దకు ఈ విజయాన్ని చేకూర్చే రథాన్ని ఎక్కివెళ్లండి.

అహల్య నుద్ధరించిన రాముడిని గౌతముడిలా స్తుతిస్తున్నాడు. "భార్యను పొందాలనే నా మనోరథాన్ని పూర్ణం చేసిన మీకు నేను దాసుణ్ణి. నిర్దోషులు కోరిన దాన్ని బాగా ఇచ్చేవారైన స్వామీ, మీరు పాషాణం వలె అయిన నా భార్యను చేతనవతిగా మార్చారు. నేను పత్నీసమేతంగా క్రాంతదర్శులయిన మీ శరణుపొందుతున్నాను"

రామకథ చారిత్రక దృష్టితో ఎప్పుడు ఆవిర్భవించిందో ప్రామాణికం గా ఇంతవరకు ఎవరూ చెప్పలేకపోయారు. కాని సృష్టి ఉన్నంతకాలం రామకథ ఇలాగే నిలిచి ఉంటుందని మాత్రం ఎందరో మహాత్ములు చెబుతున్నారు. అనంతకాల ప్రవాహంలో శాశ్వతంగా నిలిచిపోయిన ఈ రామకథ గురించి జిజ్ఞాసులు, సాధకులు, విమర్శకులు అడిగిన, అడుగుతున్న, ఇక ముందు భవిష్యత్తులో అడుగబోయే ప్రశ్నలు కొన్ని ఉన్నాయి. వాటిలో ముఖ్యమైనవి మూడు (1) చెట్టువెనుక నుండి రాముడు వాలిని సంహరించడం న్యాయమా? (2) రాముడు సీతను పరిత్యజించడం ఎంత వరకు సబబు? (3) అహల్య కథ నిజమా? నిజమైతే ఆవిడ పతివ్రత ఎలాగయ్యింది? లేక ఆవిడ ఇంద్రుడి చేత మోసగించబడింది అనవచ్చా? మొదలైనవి. ప్రస్తుతం మనం విశ్లేషించబోయేది మూడవ ప్రశ్నను. అయితే ఈ ప్రశ్నలు మూడు రకాలలో ఏ విధంగానయితే అడగబడుతున్నాయో అలాగే ఎంతోమంది చేత విపులంగా విశ్లేషించబడి జవాబులు చెప్పబడుతున్నాయి. అయినా ఈ జవాబులు అందరినీ తృప్తి పరుస్తాయని చెప్పలేము. కాకపోతే కొందరినయినా తృప్తి పరచగలవని ఆశిద్దాం.

బ్రహ్మ పురాణంలో అహల్య వృత్తాంతం విస్తారంగా చెప్పబడింది. అహల్య అయోనిజ (ఏ గర్భంలో నుండి పుట్టనిది). ఆవిడను బ్రహ్మ సృష్టించాడు. ఆవిడ అందానికి సమ్మోహితులైన దేవతలు, మునులు,

రాక్షసులు, యక్ష కిన్నెర కింపురుషులు, ఒకరేమిటి సమస్త ప్రాణులు ఆమెను తమ కిమ్మని అడిగారు.. అప్పుడు బ్రహ్మ ఎవరైతే భూప్రదక్షిణ చేసి ముందుగా నా దగ్గరికి వస్తారో వారికే నా కూతురి నిస్తానన్నాడు. అంతా వేగవంతమైన తమ తమ వాహనాలెక్కిముందుకు వెళ్లిపోతే గౌతముడు నారదుని సలహా పాటించి అహల్యను పొందాడు. అది ఎలాగో ఆనంద రామాయణంలో కనిపిస్తుంది.

బ్రహ్మణా నిర్మితా2హల్యా ద్వి ముఖీగో:
పరికుమాత్‌దత్తా పురా గౌతమాయ (ఆనంద: 1-3-18)

ద్విముఖీ గోవుకు (ఆవుగర్భంలో నుండి అప్పుడే లేగదూడ తల బెటికి పెట్టగా అది రెండు ముఖాలు గల అవుగా కనిపిస్తుంది) ప్రదక్షిణ చేయడం వల్ల భూప్రదక్షిణ చేసిన ఫలం లభిస్తుంది. బ్రహ్మచేత నిర్మితమైన అహల్య గౌతముడికి ఇవ్వబడింది.

వాల్మీకి రామాయణం ఉత్తర కాండలో అహల్య జన్మవృత్తాంతం ఈ విధంగా ఉంది...

బ్రహ్మ అన్ని ప్రాణుల సర్వశ్రేష్ఠ అంగాలతో ఒక స్త్రీని నిర్మించాడు. ఆమెలో హల(కురూపత) అసలే లేని కారణాన అహల్యగా పిలవబడింది. ఇంద్రుడావిడను అభిలషించినా ఇవ్వకుండా కొంత కాలం బ్రహ్మ ఆవిడను గౌతముడి రక్షణలో ఉంచాడు. చాలా సంవత్సరాల తరువాత ఆమెను బ్రహ్మకు వప్పగించగా ఆయన ఇంద్రియనిగ్రహం, తపస్సును గ్రహించి తిరిగి ఆమెను అతడికి భార్యరూపంలో ఇచ్చివేశాడు.

ఇక ఆ తరువాత గౌతమపత్ని అహల్యతో ఇంద్రుడు సల్పిన దురాచార విషయంలో కూడా అనేక గ్రంథాలలో అనేక రకాల కథలు కనిపిస్తాయి. బ్రహ్మపురాణాన్ని అనుసరించి (అ. 87) గౌతముడు అహల్యతో పాటు బ్రహ్మగిరిలో తపస్సు చేసుకుంటూ ఉండేవాడు.ఆమెపై ఆసక్తిగల ఇంద్రుడు గౌతముడు లేని సమయాలలో ఆయన రూపాన్ని ధరించి ఆవిడ వద్దకు వస్తూ ఉండేవాడు. ఆవిడ మాత్రం అతడిని గౌతముడనే అనుకునేది.

భగవన్ కిమిదం చిత్రం బహిరన్తశ్చ దృశ్యసే।
ప్రియయా2న్తః ప్రవిష్టో2సి తథైవచ బహిర్భవాన్
అహో తపః ప్రభావో2యం నానారూప ధరో భవాన్॥

(బ్రహ్మ: 87-48)

ఒకసారి ఆశ్రమవాసులకు ఇద్దరు గౌతములు కనిపించారు. "ఆహా ఏమి ఆశ్చర్యం! మీరు ఇంట్లో మీ భార్యవద్ద, ఇక్కడ కూడా కనిపిస్తున్నారు. బహుశ మీ తపః ప్రభావం చేత ఇలా నానా రూపాలు పొందుతున్నారు కావచ్చు" అన్నారు.

గౌతముడికి అనుమానం వచ్చి తన ఇంటికి వెళ్లేసరికి ఇంద్రుడు పిల్లిగా మారాడు. కథాసరిత్సాగరం (3-10)లో ఈ కథ ముందుకు సాగింది. గౌతముడు అహల్యను ప్రశ్నించగా ఆవిడ ప్రాకృతంలో "ఏసోరిఓ ఖుమజ్జారో" (ఏషస్థితః ఖలు మజ్జారః) ఇందులో రెండు అర్థాలున్నాయి. ఇది 'మార్జరం' అంటే పిల్లి లేదా "మేరా జార" నా జారుడు అని ఈ విధంగా అహల్య అమాయకురాలు కాదని తెలుస్తుంది.

ఇంకొకచోట ఈ విధంగా ఉంది. అహల్యకు గౌతముడి వల్ల అంజనాదేవి, శతానందుడు కలిగారు. గౌతముడు బైటికి వెళ్లేప్పుడు అహల్య ప్రాణాలు తీసుకు వెళ్లేవాడు. ఆవిడపైని వ్యామోహంతో ఇంద్రుడు, సూర్యుడు ఆ కుటీరంలో ప్రవేశించారు. సూర్యుడు ప్రాణంగా ఆవిడ శరీరంలో ప్రవేశించగా ఇంద్రుడామెను అనుభవించాడు. ఆ తరువాత ఇంద్రుడు ఆవిడ శరీరంలో ప్రాణంగా ప్రవేశించగా, సూర్యుడామె ననుభవించాడు. అంజన జరుగుతున్నదంతా చూసింది భయం చేత ఆవిడ మాట్లాడలేదు. వారి వల్ల అహల్యకు ఇద్దరు కుమారులు పుట్టారు. గౌతముడు వారిద్దరిని తన కుమారులే అనుకునేవాడు. ఒకసారి ఆయన నదికి స్నానానికి వెడుతూ ఈ పిల్లలిద్దరినీ రెండు భుజాలపైన కూర్చోబెట్టు కొని అంజనను చెయ్యిపట్టుకొని నడిపించుకుంటూ వెళ్లాడు. అంజన ఉక్రోషంతో నేను నీకూతురిని, నన్ను గాక నీ కుమారులు కాని వాళ్ల

నెత్తుకుంటావేమని ఆక్షేపించింది. గౌతముడా విషయాన్ని పరీక్షించడానికి ఆ పిల్లలిద్దరినీ నదికి విసిరివేస్తూ వీరు నా కుమారులైతే నా తపశ్శక్తి చేత క్షేమంగా నన్ను చేరుకుందురు గాక. వీరు నా కుమారులు కాకుంటే కోతులైపోదురుగాక అని శపించాడు. వారు కోతులుగా మారి నదిని ఈదుకుంటూ ఆవలి తీరానికి వెళ్లి పోయారు. అక్కడే కిష్కింధరాజ్యాన్ని ఏర్పరచు కున్నారు. వారే వాలి, సుగ్రీవులు. అంజనతో ఇంటికి తిరిగి వచ్చిన గౌతముడు, అహల్యను శిలవైపొమ్మని శపించాడు. ఆవిడ ఈ అనర్థానికి కారణమైన, చూడకూడనిది చూసినందుకు అంజనను గుడ్డిదానివై పొమ్మని శపించి తన కుమారులు మర్కటాలయ్యేట్లు చేసిన ఆవిడకు కూడా కోతే సంతానమవుతుందని చెప్పింది. అలాగే అంజనకు కేసరి వల్ల ఆంజనేయుడు ఆవిర్భవించాడు. శతానందుడు దశరథుడికి మంత్రిగా మారాడు.

ఈ వృత్తాంతాన్ని ఆధారంగా చేసుకునే పంజాబులో ఒక కథ ప్రచురితమై ఉన్నది. గౌతముడు గంగాస్నానం ముగించుకుని వచ్చి ఇంట్లో ఎవరున్నారు అని అంజన నడిగితే ఆవిడ "మాజార" (మార్జాన=పిల్లి, మా+జార= తల్లి జారుడు) అన్నది. ద్వంద్వార్థం వచ్చేలా మాట్లాడినందుకు గౌతముడు కుపితుడై తన కూతురును వెంటనే గర్భిణిని కమ్మని శపించాడు. ఆ కారణం చేత అంజన హనుమంతుడిని కన్నది.

వాల్మీకి రామాయణం ఉత్తరకాండ (30వ సర్గ) ననుసరించి అహల్య నిర్దోష (ఉత్తరకాండ వాల్మీకి ప్రణీతం కాదంటారు) కానీ బాలకాండ (అధ్యాయం 48)లో ఇలా ఉంది.

మునివేషం సహస్రాక్షం విజ్ఞాయ రఘునన్దన
మతిం చకార దుర్మేధా దేవరాజ కుతూహలామ్

(వా.రా: 1-48-19)

మునివేషంలో వచ్చినది సహస్రాక్షుడని (ఇంద్రుడని) ఎరిగి కూడా దుర్బుద్ధితో దేవరాజుపైగల కుతూహలంతో అతడి ప్రస్తావాన్ని స్వీకరించింది.

వాల్మీకి రామాయణ బాలకాండలో ఇంద్రుడు గౌతముడికి క్రోధం కలిగేలా చేసి అతడి తపస్సును విఘ్నం చేసి మీకు ఉపకారం చేశానని ఇతర దేవతలతో చెబుతాడు. అస్సామీ రామాయణం (బాలకాండ: అ-38)లో ఇంద్రుడి ఈ ఉద్దేశానికే ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడింది. గౌతముడి ఘోర తపస్సుకు భయపడి, తన తపోఫలంగా ఇంద్రపదవిని కాంక్షిస్తాడేమోననే అనుమానంతో ఆయన తపోభంగం చేయడానికి ఆయన ఆశ్రమానికి వచ్చి అహల్య సౌందర్యానికి ఆకర్షితుడై ఆసక్తుడౌతాడు.

రంగనాథ రామాయణం (1-29), తత్వ సంగ్రహరామాయణం (1-24), యోగానందాంధ్ర రామాయణాలలో గౌతముడి తపోభంగం చేయడం కొరకే అహల్య సతీత్వం నష్టం చేయడం జరిగిందని చెప్పబడు తోంది. ఈ రామాయణాలలో మధ్యరాత్రి సమయాలలో గౌతముడికి బ్రహ్మముహూర్త సమయం అయిందనే భ్రమ కలిగించడం కొరకు ఇంద్రుడు కోడిలా మారి కూసే వింత కనిపిస్తుంది. (భావాన్ని బట్టే కదా రూపం)

"చొరబడి, యెక్కి కుటీరము
వెరవున నెఱకలు విదిల్చి నేగినదని కో
క్కొరొకోకో యని యఱవగ
సరిదాప్లావార్థము ముని చయ్యన జనియెన్

(యోగానందాంధ్ర రామాయణం)

కృత్తివాస రామాయణంలో (బెంగాలీ) ఇంద్రుడు గౌతముడి శిష్యుడిగా ఆశ్రమంలో చేరతాడు. ఆయన ఎప్పుడు పిలిచినా వినయంగా చంకన తాళపత్ర గ్రంథాలు పెట్టుకు వచ్చి నమస్కరించేవాడు. గౌతముడి వేషంలో అహల్యతో రమించేవాడు. అహల్య శరీరంపైని శృంగార చిహ్నాలను చూసి దివ్యదృష్టితో విషయాన్ని గ్రహించి ఇంద్రుడిని శపించడం జరుగుతుంది.

అహల్య ఇంద్రుడి దురాచార విషయం మహాభారతంలో కూడా కనిపిస్తుంది. కానీ అందులో ఆయన పుత్రుడు "చిరకారితా" యొక్క

ఔన్నత్యమే ప్రధానంగా కనిపిస్తుంది. అహల్య యొక్క వ్యభిచారంతో క్రుద్ధుడైన గౌతముడు ఆమెను చంపమని చిరకారితాను ఆజ్ఞాపించి అడవికి వెళ్లాడు. తన స్వభావాన్ననుసరించి చిరకారితా ఈ విషయాన్ని చాలా సమయం వరకు విచారిస్తూ కూర్చున్నాడు. అడవికి వెళ్లిన గౌతముడు ఈ విధంగా ఆలోచించాడు "ఇంద్రుడు బ్రాహ్మణుడి వేషంలో నా ఆశ్రమానికి వచ్చాడు. అతడికి అతిథిగా నేను ఆశ్రయమిచ్చాను. ఈ తరువాత ఈ దుర్ఘటన జరిగింది."అత్ర చాకుశలే జాతే స్త్రియా నాస్తి వ్యతిక్రమః" ఇందులో ఆవిడ దోషం ఏమున్నది? నేను చిరకారితాను దోషరహితమైన అహల్యను చంపమని ఆజ్ఞాపించాను. ఈ కార్యం అలా కాకుండా ఉంటే బాగుంటుంది, అనుకుంటూ ఆశ్రమానికి తిరిగి వాచ్చాడు. కుశలతో ఉన్న అహల్యను చూసి చిరకారితాను ప్రశంసించాడు. మహా భారతంలో అనేక స్థలాలలో గౌతముడు ఇంద్రుడిని శపించడం ఉంది. కానీ అన్నిచోట్లా అహల్యను నిర్దోషిగానే భావించడం జరిగింది. ఇక ఇంద్రుడికి గౌతముడిచ్చిన శాపం విషయంలో కూడా అనేక రూపాలు కనిపిస్తాయి. మాధవదేవకృత అసమీయా బాలకాండ (38వ అధ్యాయం) ననుసరించి ఇంద్రుడు బ్రాహ్మణ వేషం ధరించి భిక్షార్థిలాగా గౌతముడి ఆశ్రమానికి వెళ్లాడు. వచ్చేప్పుడు మధ్యలో గౌతముడెదురైనాడు. ఆయనను చూసిన ఇంద్రుడు భయంతో వణకడం మొదలు బెట్టాడు. అనుమానం వచ్చిన గౌతముడు దివ్యదృష్టితో సర్వం గ్రహించి ఇంద్రుడిని సహస్రభగుడి గాను, (శరీరం నిండా వెయ్యి స్త్రీ జననేంద్రియాలు ఉండేలాగా) నపుంసకుడి గాను అయ్యేట్లు శపించాడు. ఇంద్రుడు సిగ్గుతో కుంచించుకు పోయి వెళ్ళి దాక్కున్నాడు. బృహస్పతి దుర్గాదేవి ద్వారా ఇంద్రుడు దాగున్న స్థలాన్ని తెలుసుకొని అక్కడకు వెళ్లి ఆయనను దుర్గపూజ కొరకై ప్రేరేపించాడు. ఆయన దుర్గపూజ చేయగా ఆవిడ ప్రత్యక్షమై తనకు శాపాన్ని తొలగించే సామర్థ్యం లేదని కాకపోతే వేయి భగాలను కన్నులుగా చేయగలనని చెప్పి అలాగే చేసింది. ఇల్లు చేరిన ఇంద్రుడికి అశ్వనీ కుమారులు మేక వృషణాలు తగిలించారు. అప్పటి నుండి ఆయన మేషాంకుడని, సహస్రనయనుడని

పిలవబడ్డాడు. మేక ఇంద్రుడికి ఉపయోగపడిన కారణంగానే పవిత్ర పితృకార్యాలలో దాని మాంసం ఉపయుక్తమౌతూ వచ్చింది.

మహాభారతంలో అహల్యకేశాపము ఇవ్వబడలేదు. కానీ వాల్మీకి ననుసరించి (ఉత్తరకాండ).....

తస్మాద్రూపవత లోకే న త్వమేకా భవిష్యసి॥
రూపంచ తే ప్రజాః సర్వా గమిష్యన్తి న సంశయః॥

(వా.రా. 7-30-37,38)

"నీ సౌందర్యం కారణంగానే ఈ అనర్థం జరిగింది. అందువల్ల ఇకనుండి ప్రపంచంలో కేవలం నీవొక్కదానివే సౌందర్యవతివిగా ఉండవు, అంటే ఈ సౌందర్యం అందరికీ పంచబడుతుంది'' అని గౌతముడిచేత శపించబడింది.

వాల్మీకం బాలకాండ ననుసరించి "రాముడీ ఆశ్రమానికి వచ్చే వరకు నీవు అదృశ్యమై ఉండి తపస్సు చేయి. అనేక సంవత్సరాలు వాయు భక్షణ చేస్తూ భస్మశాయినివై ఉండు. రాముడికి అతిథి సత్కారం చేసిన తరువాత "స్వం వపుర్ధారయిష్యసి'' - నీ స్వస్వరూపాన్ని పొందుతావు (అమృతత్వాన్ని పొందుతావు) అని శపించడం కనిపిస్తుంది.

అహల్యశాప మోక్షస్తు గౌతమీ నైవ నిశ్చితః॥
సకాలోద్య పరిత్రాప్తో రామస్య మహిమనహి॥

శ్రీ రాముడు అహల్యశాపవిమోచనం చేశాడనే విషయం విని రావణుడు అహల్య శాపవిమోచన సమయం గౌతముడు ముందే నిర్ణయించాడు, ఆ సమయం అయిపోవడంతో ఆవిడ ముక్తురాలైంది. కనుక ఇందులో రాముడి మహిమ ఏమీలేదు అని అనుకున్నాడు. కానీ నిజానికి జరిగింది ఇది... తల్లి శాపవిమోచనం కొరకు శతానందుడి చేత ప్రార్థించబడిన గౌతముడు దివ్యదృష్టితో రామాగమన సమయాన్ని వీక్షించి, శాపవిమోచన సమయాన్ని దానికి తగినట్లుగా నిర్ధారించాడు.

"తథా నిశ్చిత్య చాహల్యా తద్ధ్యానాన్ముక్తి మాపసా''

శ్రీరామ పాదస్పర్శచేత శాపనివారణం (పాపనివారణం) అవుతుందని నిశ్చయించిన అహల్య శ్రీరామ ధ్యానతత్పరురాలై చివరికి ముక్తిని పొందింది.

అహల్య శాపవశాన శిలగా మారడం మొట్టమొదట రఘువంశంలోను ఆ తరువాత అనేక రామాయణాలు పురాణాలలోనూ కనిపిస్తుంది. ఇది అవాల్మీకం.

"రామకియే నుడి" ననుసరించి సేతుబంధనానికి ఉపయోగ పడాలనే ఉద్దేశంతోనే గౌతముడు అహల్యను రాతిగా మార్చినట్లు ఉన్నది.

బ్రహ్మపురాణాన్ననుసరించి "శుష్కనదీభవ" ఎండిపోయిన నదిగా మారు అని శపించినట్లున్నది. ఆనందరామాయణం (1-3-23)లో జన్మస్థానంలో నదిగా ప్రకటమైనట్లుంది. పద్మపురాణాన్ననుసరించి (సృష్టిఖండం : 51-34) "అస్థి చర్మా సమావిష్టా నిర్మాంసా" శాపకారణంగా అహల్య శరీరం శుష్కించి కేవలం చర్మం ఎముకలు మిగిలాయి.

బ్రహ్మపురాణంలో నదీరూప అహల్య, గౌతమనదిలో కలవగా ముక్తి పొందినట్లుంది.

వాల్మీకం ఉత్తరకాండలో "తం ద్రక్ష్యసి యదా భద్రో తదా పూతా భవిష్యసి" శ్రీరాముడి దర్శన మాత్రాన నీవు పవిత్రురాలి వౌతావు అని గౌతముడు చెబుతాడు.

బాలకాండలో రామలక్ష్మణులు అహల్య వృత్తాంతం విని గౌతముడి ఆశ్రమంలో ప్రవేశిస్తారు. ఇన్నాళ్లు అదృశ్యంగా ఉండి తపస్సు చేసుకుంటున్న అహల్య వారికి కనిపిస్తుంది.

శాపస్యాన్త ముపాగమ్య తేషాం దర్శనమాగతా।
రాఘవౌతు తదా తస్యాః పాదౌ జగృహతు ర్ముదా॥

(వా॥రా॥ 1-49-17)

శాపాంతమైన కారణాన అహల్యవారికి కనిపించింది. రామలక్ష్మణ

లిరువురు ఆవిడ చరణాలను స్పృశించారు. (నమస్కరించారు).

మహానాటకం, ఆనంద రామాయణం, బ్రహ్మవైవర్తపురాణం, కృత్తివాస రామాయణం మొ॥వాటిలో రాముడే శిలారూపాన ఉన్న అహల్య శిరస్సుపై తన చరణాన్ని ఉంచినట్లుగా ఉంది.

స్కందపురాణంలో చేతితో శిలను స్పృశించి శాపవిముక్తి చేసి, అనేక తీర్థాలను సేవించమని రాముడాదేశించగా ఆవిడ అనేకక్షేత్రాలలో శివలింగస్థాపన చేసినట్లుగా ఉన్నది.

ఈ విధంగా అనంతకోటి శాస్త్రాలలోనూ పురాణ ఇతిహాసాలలోనూ ఈ అహల్య వృత్తాంతం వివిధ రూపాలలో కనిపిస్తుంది. ఇందులో ఏది సత్యం? అనేది ప్రశ్న.ప్రతి మహాయుగంలోనూ నాలుగు యుగాలుంటాయి. అందులో రెండవది త్రేతాయుగం. ప్రతి త్రేతాయుగంలోనూ శ్రీరామ ఆవిర్భావం జరుగుతుంది.ఇలా జరిగే రామలీలలో కర్మభేదాన్ని అనుసరించి కథాభేదం కూడా కనిపిస్తుంది. ఇవన్నీ ప్రాచేతసుడి వందకోట్ల శ్లోకాలతో కూడిన కల్పాంతర గాథల రామాయణ సంకలన కావ్యంలోవే. కనుక సత్యాసత్యాల విశ్లేషణ ఇక్కడ అవసరం లేదు.

ఇక ఈ కథలపై ప్రజలకు వచ్చే అనేక సందేహాల నివృత్తి కొరకై విశ్లేషించాలి. వైదిక సాహిత్యకారులు వేదాలను వ్యాఖ్యానించేప్పుడు నిరుక్తం (వేద షట్ అంగాలలో ఒకటి యాస్కాచార్య నిర్మితమైనది) పై ఆధారపడి బాహ్యంగా కనిపించే అర్థం కాక ఆయా పదాలకు వచ్చే వ్యుత్పత్తి అర్థాలను స్వీకరిస్తారు కనుక వేదాలలో కనిపించే ఈ అహల్య వృత్తాంతం వారికి కేవలం ఒక రూపకమే గాని ఐతిహాసిక సత్యం కాదు. (చరిత్రలో జరిగిన విషయం కాదు) ఈ కథకు వారు అనేక వ్యుత్పత్తి అర్థాలు చెబుతారు. "అహని లయతే ఇత్యహల్య" పగటిపూట లీనమై ఉండేది అహల్య అంటే ఈవిడ రాయి అన్నమాట. సూర్యుడే ఇంద్రుడు. వీరిద్దరి ఘర్షణలోనే కాలం ఉత్పన్నమౌతుంది. అంటే అహల్య కృషికి అధిష్టాత్రిదేవి - వర్షాధిష్టాన దేవత ఇంద్రుడు, వీరి సంబంధం స్వాభావికమే.

'గో' అంటే ఇంద్రియాలు, 'తముడు' అణిచివేసే సాధకుడు. గౌతముడు దున్నదగినది హల్య, దున్నడానికి శక్యం గానిది అహల్య అంటే బలమైన సంస్కారాలు.

సాధకుడు సాధనలో ఉన్నప్పుడు ఈ సంస్కారం (వాసనలు) బలంగా ఉండి మనస్సును చంచలం చేస్తాయి. "ఇందితి ఇతిగ ఇంద్రః" విషయవస్తువులపైకి ప్రకాశంతో ప్రసరించే మనస్సు అని అర్థం. ఈ విధంగా మనస్సు విషయ వస్తువుల వైపుకు వెళ్లడాన్నే గౌతముడు తపస్సులో ఉన్నప్పుడు అహల్య ఇంద్రుడితో వ్యభిచరించడం అన్నారు.

ఈ విధంగా తన మనస్సు వ్యభిచరించడాన్ని గ్రహించి సాధకుడు తన సాధనలో అంతం చేయలేని సంస్కారాలను రాయిలా మార్చి కదలకుండా చేస్తాడు. వ్యభిచరించే వాడి మనస్సు (ఇంద్రుడు) నపుంసకుడౌతాడు. అనుభవించలేక పోతాడు. సాధనలో చివరికి ఆ పరమాత్మను దర్శించి స్పర్శించగా (పరం దృష్ట్వా నివర్తతే) పవిత్రుడౌతాడు.

ఇలా సాగిపోతుంది అహల్యాగాథను రూపకంగా స్వీకరించిన మహాత్ముల వ్యాఖ్య. కానీ రామాయణం కేవలం ఒక రూపకమేనా! ఐతిహాసిక సత్యం కాదా! ఒక వేళ ఈ కథను చరిత్రలో జరిగినట్లుగా ఒప్పుకుంటే అప్పుడెలా వ్యాఖ్యానించాలి? అనేది ప్రశ్న.

ధర్మం ఎప్పుడూ అందరికీ ఒక్కటిగా ఉండదు. జరిగిన సంఘటనను బట్టిగాక అందులో పాల్గొన్న ఆయా వ్యక్తుల యొక్క బాధ్యతలు ఏమిటి? వారంతా వాటిని చక్కగా నిర్వర్తించారా అనేది విశ్లేషించినప్పుడే, సంఘటనలో బాహ్యంగా కనిపించే విషయాలు మాత్రమే కాక వాటికి ప్రేరణనిచ్చిన అనేక అన్యవిషయాలు వెలుగులోకి వస్తాయి. మొట్టమొదట గౌతముడి వైపు నుండి ఈ విషయాన్ని విశ్లేషిద్దాం... నరజన్మ లభించింది మోక్షార్థమై, మరే ఇతర ప్రాణులకు లభించని బంగారం లాంటి అవకాశం మనుష్యులమైన మనకు కలిగింది. ఇలా లభించిన అవకాశాన్ని భోగార్థమై ఎవడైతే వాడుకుంటాడో వాడి కన్నా మూర్ఖుడులేడు. మంచి గంధపు చెక్కను

పొయ్యిలో కట్టెలుగా వాడుకున్న అజ్ఞానికి మల్లే, ఈ వ్యక్తి ప్రవృత్తి ఆత్మహత్య సదృశం అవుతుంది అనడంలో సందేహం లేదు. కానీ ఇలా మనకు లభించిన అవకాశాన్ని మనలో ఎంతమంది గుర్తించగలగుతున్నారు? వారిలో ఎంతమంది వైరాగ్యవంతులు అవగలుగుతున్నారు? ఆ వైరాగ్యవంతులలో ఎంతమంది సాధనాతత్పరులౌతున్నారు? అని అడిగినప్పుడు, చాలా కొద్దిమంది అని జవాబు వస్తుంది. ఇలా మనలో అనేక స్థాయిలలో ఉన్నవారి కొరకై ఆశ్రమధర్మాలు ఏర్పాటు చేయబడ్డాయి. చిన్నతనంలోనే ధర్మాధర్మ విచక్షణ కలగడం కొరకు బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ, గురుకులంలో చదువుకోవడం మొదటి ఆశ్రమం అన్నారు. అలా చదువుకుంటున్న వ్యక్తి విపరీతమైన వైరాగ్యవంతుడైతే వెంటనే సన్న్యాసాశ్రమం స్వీకరించి, సాధనా తత్పరుడై మానవజన్మను సార్థకం చేసుకోవచ్చు. లేదా గృహస్థాశ్రమాన్ని స్వీకరించి ఇటు ఒక పద్ధతిలో వాసనలను సంతుష్టి పరుస్తూ, మరొక పక్క సాధన చేస్తూ, వాసనా వేగం తగ్గగా ఆ దంపతు లిరువురూ వానప్రస్థాన్ని స్వీకరించి చివరికి సన్న్యసించవచ్చు.

ఈ మార్గంలోనే గౌతముడు గృహస్థాశ్రమాన్ని స్వీకరించాడు. గృహస్థులైన దంపతులిరువురూ పరస్పర సహకారంతో ఇటు లౌకిక జీవితాన్ని తృప్తిగా అనుభవిస్తూనే, ఆధ్యాత్మిక శిఖరాల నందుకోవడానికి ప్రయత్నించాలి. స్త్రీకి ఇటు లౌకిక ఆనందాన్ని, అటు ఆధ్యాత్మిక సాధనా మార్గదర్శనాన్ని ఇవ్వవలసిన బాధ్యత భర్తది. త్రికరణాలతో (మనస్సు, వాక్కు, కర్మ) ఆవిడకు ప్రేమ పంచి ఇవ్వగల బాధ్యత నెరిగి ఉండటం భర్త యొక్క కర్తవ్యం. ఈ విషయాన్నే మనకు దేవాలయాలపై గల శృంగార శిల్పాలు, వాత్స్యాయన, కోక్కోక మహర్ష్యాదులు తెలియజేస్తున్నారు. ఒక స్త్రీ పతివ్రతగా ఉండటం ఎంతగానైతే ఆవిడపైన ఆధారపడి ఉందో, అంత కన్నా ఎక్కువగా భర్తపైనే అది ఆధారపడి ఉంటుంది. ఎన్నాళ్లు సుఖభోగా లనుభవించినా ఆవిడ ఆధ్యాత్మికత వైపు మరలక కేవలం ఇంకా

భోగాన్నే కోరుకుంటున్నట్లయితే, అప్పటికి భర్త మనస్సు వైరాగ్య పూరితమై ఉండేట్లయితే ఆవిడను విడిచి సన్న్యసించడాన్ని శాస్త్రాలు సమ్మతిస్తున్నాయి. సర్వవిధాలా సంతుష్టిపరచినప్పటికీ భార్య చెడునడత గలదిగా ఉంటే కూడా ఆవిడను విడిచి తపస్సును లేదా మరొక భార్యను ఎన్నుకునే విషయాన్ని కూడా మహాత్ములు ప్రతిపాదిస్తున్నారు. కానీ గృహస్థై ఉండి, ఆధ్యాత్మికత, సాధన, తపస్సు మొదలైన పేర్లతో భార్య అవసరాన్ని గాని, ఆవిడ మనోభావాల్ని గానీ పట్టించుకోకుండా భర్త సంచరించడాన్ని ఏ శాస్త్రము ఒప్పుకోదు. వాల్మీకి రామాయణా న్ననుసరించి అహల్య దేవరాజు ఇంద్రుడిలో కుతూహలాన్ని పెంచుకుంటే, అందులో ఆవిడ దోషం ఎంత ఉందో గౌతముడి దోషం కూడా అంతే ఉంది.ఆవిషయాన్ని గ్రహించినవాడు కనుకనే, ఆ దోష పరిహారార్థం అదృశ్యంగా ఉండి ఆవిడను తపస్సు చేయమని చెప్పడమేగాక, తాను కూడా తపస్సు కొరకు హిమాలయాలకు వెళ్లిపోయాడు. తన బలహీనతను లోపాన్ని గ్రహించినవాడు కనుకనే అహల్య శాపవిమోచనానంతరం, శ్రీరాముడిని స్తుతిస్తూ, తన ప్రశాంత జీవనానికి, సాధనా పథంలో సహకారానికి బ్రహ్మచేత ఇవ్వబడ్డ అహల్యను పోగొట్టుకున్న తనకు తిరిగి ఇప్పించినందుకు కృతజ్ఞతలు తెలియజేసు కోవడం ఈ వేదమంత్రంలో కనిపిస్తుంది.

ఇక ఇంద్రుడి వైపు నుండి ఈ సంఘటనను విశ్లేషించినప్పుడు ... కౌషీతకీ ఉపనిషత్తు ఇంద్రుడిని పరబ్రహ్మ పరమాత్మగా, ప్రత్యక్ చైతన్యాభిన్న పరబ్రహ్మగా పేర్కొంటుంది. సర్వహృదయేశ్వరుడైన ఆ పరమాత్మ ఒక్కొక్కరూపంలో ప్రకటమై సృష్టిస్థితిలయాలు చేస్తూ ధర్మ సంస్థాపనాకార్యాన్ని నిర్వర్తిస్తాడు. ధర్మం ముసుగులో కపటంతో అధర్మ ప్రవర్తన సంఘంలో వేళ్లు పాతుకో ప్రయత్నించినప్పుడు ఆయన కూడా కపట రూపధారణతో దాన్ని భగ్నం చేయడానికి వస్తాడు. ఒక కల్పంలో తులసీ (బృంద) పాతివ్రత్య మహాత్మ్యాన్ని అడ్డుపెట్టుకొని, జలంధరుడు ఇతరుల పాతివ్రత్యాన్ని దోచుకోప్రయత్నిస్తుంటే వాడిని నిర్వీర్యుడిని

చేయడం కొరకు ఆ కల్పంలో ధర్మ రక్షణకై విష్ణురూపంలో సంచరించే పరమాత్మ కపటంతో తులసిపాతివ్రత్యాన్ని భగ్నం చేసి ప్రజలను జలంధరుడి బారి నుండి రక్షిస్తాడు. అలాగే ఇంకొక కల్పంలో శివుడి రూపంలో ఉన్న పరమాత్మ దారుకవనంలోని మహర్షుల భార్యల శీలాలు దోచి వారి అహంకారాన్ని భంజించడం కనిపిస్తుంది. మరొక కల్పంలో కృష్ణరూపంలో అనేక మంది స్త్రీలతో గడపడం కనిపిస్తుంది. అలాగే ఈ ఇంద్ర అహల్య వృత్తాంతం కూడా తపోహంకారపూరితుడైన గౌతముడు లోకకంటకుడు కాకుండా ఉండటం కొరకు అతడి భార్యపాతివ్రత్యం భంగపరచడం ద్వారా అతడిని శక్తి హీనుడిగా మార్చి ధర్మసంస్థాపన చేశాడని చెప్పవచ్చు. కృష్ణుడికి "చోర జార శిఖామణీ" అని శివుడిని "తస్కరాణాం పతయే వంచతే పరివంచతే" అని, విష్ణువును "తులసీదామ భూషితః" అని స్తుతించినట్లే వేదాలలో ఇంద్రుడిని "అహల్యా జార" శబ్దంతో స్తుతించడం జరిగింది. ఇవన్నీ నిందాపర శబ్దాలైనప్పటికీ, మహా మహిమాన్వితులైన దేవతల విషయంలో ఇవి స్తుతి వాచకాలే అవుతాయి. జరయతి ఇతి జారః అనే వ్యుత్పత్తి ననుసరించి అవిద్యా తత్కార్యాలయిన కోశపంచకాలను జరింపజేసేవాడు (తగులబెట్టేవాడు) అనే అర్థం వస్తుంది ఇంద్రుడికి. కౌషీతకీ ఉపనిషత్తులో ఇంద్ర-ప్రతర్దన ఆఖ్యాయిక కనిపిస్తుంది. ప్రతర్దనుడు విజయార్థమై ఇంద్రుడిపై ఆక్రమణం చేస్తాడు. ఇంద్రుడు అతడి పరాక్రమాన్ని చూసి ప్రసన్నుడై వరమడగమంటే ప్రతర్దనుడు మనుష్యులకు అత్యంత హితాన్ని చేకూర్చే విషయాన్ని వివరించమని అడుగుతాడు. అప్పుడు ఇంద్రుడు తాను చేసిన అనేక కార్యాలు చెప్పి "మామేవ విజానీహి" నీవు నన్ను (నన్నే) ఎరుగు అంటాడు. తాను చేసిన వృత్రాసురవధ, త్రిశీర్షత్వష్ట్రవధలో ఎంతో మోసం, కపటం, రాజకీయపు ఎత్తుగడలు కనిపించినప్పటికీ అహంకార వర్జితుడనై, ధర్మసంస్థాపన కొరకు తానా పనులు చేసిన కారణాన "న కర్మణావర్ధతే నో కనీయాన్" ఆ కర్మలవల్ల నా మహిమ తగ్గటం గానీ, పెరగటంకానీ జరగలేదని చెబుతాడు. ఈ విషయాన్నే భగవద్గీత కూడా" అహంకార రహితుడు లోకంలోని

ప్రాణులందరినీ సంహరించినప్పటికీ ఆ పాపం అతడికి అంటదు" అని చెబుతుంది. అహంకారం అంతమైనవాడు కనుక "మామేవ విజానీహి" నీవు నన్ను ఎరుగు అన్న పదానికి నన్ను పరమాత్మగా ఎరుగు అని అర్థం చెప్పడం జరిగింది.

ఒక వేళ ఇంద్రుడు పరమాత్మగా కాక కేవలం దేవతల రాజుగా ఈ పని చేసి ఉండి ఉంటే దానినెలా వ్యాఖ్యానించాలి? అంటే... ఒక పక్కన రాక్షసరాజైన రావణుడు సాధువేషంలో వచ్చి సీత నపహరించి తీసుకువెళ్లడం కనబడుతుంటే మరొక ప్రక్కన దేవతల రాజైన ఇంద్రుడు కూడా మారువేషంలో ఋషిపత్నిని వంచిస్తూ కనపడతాడు. స్వర్గానికి రాజై, పుణ్యకార్యఫలంగా కనపడుతూ కూడా భోగలాలసతో ప్రేరితుడై అచ్చం రావణాసురుడిలాగే ప్రవర్తిస్తూ కనపడతాడు. దీని వెనక ఉన్న వైజ్ఞానిక తాత్పర్యమేమిటంటే ఎప్పటి వరకైతే పుణ్యం భోగం కొరకే చేస్తూ పోతారో (పాపం ఎలాగూ భోగాన్నాశించే చేస్తారు) అప్పటి వరకు పుణ్యాత్ముడికి, పాపాత్ముడికి పెద్దగా భేదం కనిపించదు. ఆ భోగాపేక్షగల పుణ్యాత్ముడు కూడా ఏదో ఒకనాటికి పతనమౌతాడు. రావణుడు, ఇంద్రుడు ఇద్దరిలో ఒకరు పాపానికి, ఇంకొకరు పుణ్యానికి ప్రతీకలుగా కనిపించినా వారిద్దరి అంతఃకరణంలోనూ సుఖాపేక్ష, భోగలాలసత గూడుకట్టుకునే ఉన్నాయని చెప్పవలసివస్తుంది.

పాపాత్ముడైన రావణుడు భోగార్థమై క్రమంగా పతనమౌతూ కనిపిస్తాడు. అలాగే పుణ్యాత్ముడైన ఇంద్రుడు కూడా. పైగా రావణుడు కేవలం ఒక వ్యక్తి మాత్రమే. కానీ ఇంద్రత్వం ఒక పదవి. దాన్ని పొందిన వ్యక్తులు ఎందరో ఉన్నారు. అందులో చాలామంది పురాణాలలో పతన మౌతూ కనిపిస్తారు. ఇంద్రపదవి నధిరోహించిన నహుషుడు ఇంద్రాణిని కామించి, ఋషి శాపానికిలోనై అజగర(కొండ చిలువ) రూపంతో పతనమైపోవడం, వృత్రాసురుణ్ణి సంహరించిన ఇంద్రుడు పిచ్చివాడవడం, త్వష్టుడిని చంపిన పాపం చుట్టుకుంటే దానిని వదిలించుకోవడానికి నానా

బాధలు పడటం లాంటివి కనిపిస్తాయి.

మానవులలో అశ్వమేధయాగాలు చేసినవారు, దాన ధర్మాదిపుణ్యకార్యాలు చేసినవారు దేవతలౌతారు. పుణ్యకార్యాలు భోగగమ్యంపై చేయబడినప్పుడు, భోగం ప్రాప్తించడం సహజమే కాని అప్పుడా యజ్ఞ యాగాది దానధర్మాది క్రతువులు అంతఃకరణ శుద్ధి కొరకు పనికిరావు. వారి వారి సంస్కారాలు అలాగే ఉన్న కారణంగా ఆ దేవతలు ఎక్కడికి వెళ్లినా సాధారణ మానవులలాగా (లేదా, అంతకన్నా హీనంగా) ప్రవర్తించడం జరుగుతుంది. కానీ అదే యజ్ఞయాగాదిక్రతువులు భగవత్ప్రాప్తి కొరకు చేసినప్పుడు, అవి వైరాగ్యాన్ని, అంతఃకరణశుద్ధిని ఇస్తాయి. ఆ సాధకులు స్వర్గాది భోగాలు వాంఛించరు, కైవల్య ప్రాప్తి చేత స్థిత ప్రజ్ఞలౌతారు. ఈ విధంగా రజోగుణ సాధకులు, భోగగమ్యాన్ని కోరి సాధన ద్వారా భోగాన్ని (దేవలోక సుఖాన్ని), సత్వగుణసంపన్నులైన సాధకులు ముక్తి గమ్యాన్ని కోరి, సాధన ద్వారా ముక్తిని పొందగా, తమోగుణ సంపన్నులైన సాధకులు శక్తి గమ్యాన్ని కోరి చివరికి సాధన ద్వారా శక్తిని పొంది, దౌర్జన్యంతో ఇతరుల సుఖభోగాలను లాక్కొని అనుభవించడానికే శక్తిని వాడతారు. లాక్కొని అనుభవించడంలోని రాక్షసానందాన్ని పొందటం కొరకే వీరు సూటిగా భోగాన్ని కాక, దురాక్రమణతో దాన్ని అనుభవించగల శక్తిని ఆరాధిస్తారు.

దేవతలు భోగులు-దైత్యులు భోగవాదులు. వీరిరువురిలో కొంచెమే భేదం ఉంది. దేవతలు భోగాన్ని అనుభవిస్తూనే దాన్ని చెడు విషయంగా భావిస్తారు. దైత్యులు భోగం అనుభవిస్తూ దాన్ని మంచి పనిగా భావిస్తారు. వీరిద్దరికీ యుద్ధం జరిగితే ఎవరు గెలుస్తారు? భోగులా, భోగవాదులా? ఒక వ్యక్తి భయంతో చేతులు కాళ్లు వణుకుతుండగా దొంగతనానికి వెళతాడు (ఇది తప్పుగా భావిస్తాడు కనుక). రెండవాడు భయపడకుండా దొంగతనం చేస్తాడు (దీన్ని వాడు తప్పుగా భావించడు). మరి ఈ ఇద్దరిలో ఎవరు పట్టుబడతారు? చేతులు కాళ్లు వణికే దొంగే పట్టుబడతాడు. అలాగే ఈ దేవతలు కూడా. దైత్యులు భోగాలు లాక్కుందామని చూస్తూ

ఉంటారు. ఆ భోగాలు ఎక్కడ చేజారిపోతాయోనని దేవతలు భయపడు తుంటారు. వాళ్లు దేవతలు (అమరులు) వాళ్లకు మృత్యువు లేదు కనుక వాళ్ల ప్రాణాలు పోతాయేమోనని భయపడరు. కేవలం భోగం చేజారి పోతుందేమోనని భయపడతారు. అందుకే వాళ్లు భగవంతుడిని భోగాల రక్షణ కొరకై స్తుతిస్తారు. రాక్షసులు కూడా భోగరక్షణ కొరకై స్తుతిస్తారు. ఈశ్వరుడి కృపచేతగానీ లేక దైత్యుల ప్రసన్నత చేతగానీ ఈ రెంటిలో ఏ రకంగా దేవతల భోగాలు రక్షించబడినా వారికి సమ్మతమే. అందుకే వారు ఇటు రాముణ్ణి అటు రావణాసురుణ్ణి కూడా స్తుతిస్తూ కనిపిస్తారు.

అందుకే స్వార్థపరులైన దేవతలు, రావణవధ త్వరగా జరగాలనే (దానితో తమ భోగం శాశ్వతం కావాలనే) వాంఛతో అందునిమిత్తమై సీతారామకళ్యాణం అవసరం కనుక రాముడు స్వయంవరానికి వెళ్లడానికి దేవరథం పంపడం ఇక్కడ కనిపిస్తుంది.

ఇక అహల్య వైపు నుండి ఈ సంఘటన విశ్లేషించినప్పుడు శ్రీతులసీదాసు అహల్యను "సహస సిలా హూతే జడమతి భ ఈ హై" జడబుద్ధితో పోల్చుతాడు. ఆవిడ ఎదురుగా రెండు మార్గాలున్నాయి. ఒకటి వైరాగ్యరూపుడైన గౌతముడు, రెండు భోగరూపుడైన ఇంద్రుడు. జడత్వం కారణంగా ఆవిడ (బుద్ధి) భోగాన్ని (ఇంద్రుణ్ణి) స్వీకరించింది. అనేక సంవత్సరాల తపస్సుతో ఆవిడలోని జడత్వం అంతమైంది. గౌతముడనే వైరాగ్యం యొక్క శాపరూప అనుగ్రహం వల్ల ఆ బుద్ధి జడత్వాన్ని విడిచి పరమాత్మను పొందగలిగింది. అంటే ధర్మాచరణ కేవలం ధర్మం యొక్క జ్ఞానం కలగడం వల్ల మాత్రమే సాధ్యం కాదు, బుద్ధిలో కాస్త భక్తి, పరమాత్మ చరణాలపైన సమర్పణ కూడా అవసరమౌతాయి.

ఈ అహల్య వృత్తాంతం ఒక రూపకం మాత్రమే కాక చారిత్రక సత్య మైనప్పుడు ఈ కథను ఎలా వ్యాఖ్యానించాలి? అంటే.. ఒక వేళ ఇంద్రుడి చేత ఆవిడ మోసగించబడి ఉంటే ఆ తరువాత కూడా నిస్సందేహంగా ఆవిడ పతివ్రతే అనడంలో కూడా సందేహం లేదు. ఎందువల్ల నంటే

తనవైపు నుండి ఆవిడ తన భర్తనే సేవించిందిగాని పరపురుషుడిని సేవించలేదు. కానీ ఒకవేళ వాల్మీకాన్ననుసరించి ఆవిడ దేవరాజుపై కుతూహలం పెంచుకొని, తన ఇష్టంతోనే ఆయనతో కలసిఉంటే...? అప్పుడిది చదవండి...

బాగా జీవిస్తున్న పెద్దమనిషిని ఒకాయన అడిగాడు "మీ విజయ రహస్యమేమిటి?

"సరియైన నిర్ణయం చేయడం" సమాధానం చెప్పాడు.

"సరియైన నిర్ణయం ఎలా చేస్తారు?"

"అనుభవం ఆధారంగా చేస్తాను"

"మీకు అనుభవం ఎలా వస్తుంది?"

"తప్పుడు నిర్ణయాలు చేయడం ద్వారా"

సాధన అంటేనే పతనమౌతున్న మనస్సును మెల్లిగా మళ్లీ లేపి పరమాత్మలో పెట్టడం కొరకు చేసే ప్రయత్నం. స్థితప్రజ్ఞుడికి పతనం లేదు. సాధకుడి లక్షణమే పతనమవడం, మళ్లీ లేవడం. అభ్యాసం వైరాగ్యం చేతనే సాధన సాధ్యమౌతుంది.

అవతారిక:

27, 28 మంత్రాలలో మిథిలా నగరానికి ప్రయాణమై వెళుతున్న రాముడి ద్వారా అహల్య ఉద్ధరణ జరుగగా కృతజ్ఞతతో గౌతముడు చేసిన స్తోత్రాన్ని వివరించి వేదమాత 29వ మంత్రంలో ఆ ఇద్దరు దంపతులు చేస్తున్న స్తుతిని వర్ణిస్తోంది.

29. మంత్రం

**చ మూషచ్ఛ్యేనః శకునో విభృత్వా గోవిందుర్ద్రప్స ఆయుధాని బిభ్రత్।**
**అపామూర్మిం సచమానః సముద్రం తురీయం ధామ మహిషో వివక్తి॥**

(ఋగ్:9-96-19)

హే శత్రుంజయా! ఈశ్వరా! విశ్వపోషకా! పృథ్వీపాలకా! నీవే ఈ

సృష్టియొక్క సారానివి, హే ధనుర్ధారీ! రావణాసురుడిని వధించడం కొరకు సముద్రాన్ని దాటేవాడా! తురీయధాముడా! ఆరాధన చేత (మనుష్య రూపంలో) ప్రకటమయ్యే వాడవు నీవు.

పరమాత్మ నిర్గుణ నిరాకారుడని కొందరు, సగుణసాకారుడని కొందరు వాదిస్తారు. అలాగే అవతారవాదాన్ని ప్రతిపాదించేవారు కొంద రయితే, ఖండించేవారు కూడా కొందరున్నారు. అవతారవాదాన్ని ఒప్పుకునే వారిలో కూడా మళ్లీ ఆయన సమష్టి కారణాలవల్ల ధర్మ సంస్థాపన కొరకు అవతరిస్తాడని కొందరంటే లేదు లేదు భక్తుడి యొక్క వ్యక్తిగతమైన ప్రేమ, అవసరం, ఆతృతవల్ల, వారి ఆరాధన చేత ప్రకటమౌతాడని కొందరంటారు.

వీటన్నింటికీ జవాబు పై మంత్రంలో మనకు కనిపిస్తుంది. తురీయ ధాముడా, సృష్టిసారమా అనడంలో నిర్వికల్పసమాధిలో సాధకులకు యోగులకు అనుభూతిగా నిలిచే నిర్గుణ నిరాకార పరమాత్మ సూచించ బడ్డాడు. ఈశ్వరా, విశ్వపోషకా, పృథ్వీపాలకా అనడం వల్ల సగుణ సాకార పరమాత్మ సూచించబడ్డాడు.శత్రుంజయ, ధనుర్ధారి అనడం వల్ల ధర్మ సంస్థాపన కొరకుదిగివచ్చే అవతార పురుషుడు దర్శన మిచ్చాడు. రావణవధ నిమిత్తమై సముద్రం దాటేవాడా అనడంలో లీలామానుష విగ్రహుడు కండ్లముందు నిలిచాడు. ఆరాధన చేత ప్రకటమయ్యేవాడా అనగానే వయ్యక్తిక రూపంలో వచ్చిన బాంధవుడు, సఖుడు మన ముందు బాహువులు చాచి నిలిచాడు.

హియనిర్గున నయనని సగున
రసనా రామ సునామ!

హృదయంలో నిర్గుణుడిని పెట్టుకోండి, కండ్లలో సగుణుడిని నిలుప ుకోండి, నోటితో ఆయన మధురమైన నామాన్ని పలకండి. ఎందుకు మీకు ఘర్షణ అంటాడు శ్రీతులసి.

నిర్గుణ నిరాకారానుభూతి కేవలం అంతర్ముఖులైన మహాత్ములకే, జ్ఞానులకే కలుగుతుంది. దానివల్ల సమష్టి సమస్యలు తొలగవు, ఇతర

వ్యక్తులకు వయ్యక్తిక సంతుష్టి కలగదు. ఆ అనుభూతి కలిగిన మహాత్ముడి లో కూడా అన్యుల నలరించే రసతుష్టి పొడచూపదు. అలాగే కేవలం సగుణ లీలలను ఆధారంగా ఆదర్శంగా తీసుకుంటే వ్యక్తిలో మార్పయితే వస్తుంది...

లీలా సగున జోకహహి బఖానీ
సో ఈ స్వచ్ఛతా కరయి మలహానీ

సగుణలీలలు గానం చేసేవారి అంతఃకరణం శుద్ధమౌతుంది. కానీ అందువల్ల సత్యం యొక్క లోతు తెలియదు. సగుణావతారం బకెటెడు నీళ్లలాంటిది. అందులో మురికి గుడ్డనుతుకుతే గుడ్డ స్వచ్ఛమవడం ఖాయం, కానీ నీళ్లు మురికి అవుతాయి.

రఘుపతి మహిమా అగున అబాధా
బరనబ సోఈ బరచారి అగాధా॥

నిర్గుణ ఈశ్వరుడి మహిమ అగాధమైనది. దాన్ని వర్ణించడం ఎవరికీ శక్యం గాదు. లోతైన నీళ్లే స్వచ్ఛంగా ఉంటాయి. కానీ ఇందులో దిగిన వారు మళ్లీ పైకి రాలేరు. అందులో మునిగిపోతారు. కనుక వారు వ్యవహారానికి, ఇతరులకు ఈ తత్వానుభవాన్ని వర్ణించి చెప్పడానికి పనికి రారు.

జ్ఞానులు గజ ఈతగాళ్లు, అందుకే వాళ్లు లోతైన నిర్గుణ నిరాకారాన్ని ఇష్టపడతారు. భక్తి ఉపాసనలో, ఉపాసనలన్నీ కర్మలే, కనుక భక్తులు కర్మయోగం యొక్క లక్షణాలైన స్వచ్ఛతను, మధురతను, శీతలతను, ఈ లక్షణాల నిలయమైన సగుణ సాకారాన్ని ఇష్టపడతారు.

జీవితంలో సంపూర్ణతకు భక్తి, జ్ఞానాలు రెండూ అవసరమే. ఈ జీవితం ఒక నాటకం. జ్ఞాన, భక్తుల సమన్వయంలోనే ఈ నాటకాన్ని ఆనందించగలము. నాటకంలో రసాస్వాదన చేయాలంటే భక్తులమై హృదయంతో చూడాలి. లేదా నాటకంలోని ప్రతి పాత్రను బుద్ధితో విశ్లేషిస్తూ కూర్చుంటే - "వీడు వ్యర్థంగానే అభినయిస్తున్నాడు, వీడు ధనవంతుడై

ఉండి కూడా ఇక్కడ బీదవాణ్ణని అబద్ధం చెబుతున్నాడు. అనుకుంటూ కూర్చుంటే ఇంకెలా ఆనందించగలడు? ఆ నాటకంలో విలీనులై బుద్ధిని వెనక్కు తోసి హృదయంతో తాదాత్మ్యం చెంది, పాత్రలతో పాటు నవ్వుతూ, ఏడుస్తూ చూడగలిగితే బాగుంటుంది. కానీ అలా అని నాటకం చూసే టప్పుడు బుద్ధిని పూర్తిగా మరచిపోయినా ప్రమాదమే. మీ స్నేహితుడు ఒకడిని నాటకంలో కొందరు కొడుతున్నారనుకోండి. హృదయభావుకతతో ఇదంతా సత్యమని భావించి అతడిని రక్షించడానికి మీరు ముందుకు దూకితే ప్రమాదం వచ్చి పడుతుంది. కాబట్టి జీవిత నాటకాన్ని భక్తి జ్ఞానాల మేలుకలయికలోనే ఆస్వాదించాలి. ·

ఇప్పటి వరకు విశ్లేషించిన సగుణ నిర్గుణ తత్వాలన్నీ సమష్టి అవసరాలను పురస్కరించుకున్నవే, కానీ వీటివల్ల వయ్యక్తిక తృష్ణ తీరదు. అందుకే వ్యక్తిగత అవసరాల పూర్తి కొరకు, వయ్యక్తిక భావనల సంతుష్టి కొరకు సగుణసాకార పరమాత్మ మానవమాత్రుడై ఈ భూమి మీద అవతరించి, ఆయా వ్యక్తుల కోరికల ననుసరించి లీలలు చేయవలసిందే

"అమితరూప ప్రగటే తెహి కాలా!
జథా జోగ మిలే సబహి కృపాలా॥

లంకా విజయం తరువాత అయోధ్యను చేరిన రాముడు ఒకేసారి అనంత రూపాలలో ప్రకటమై వారి వారి యోగ్యత ననుసరించి ఒకేసారి అందరిని కలిశాడు. చిన్నవారు ఆయనకు నమస్కరించగా వారిని ఆయన ఆశీర్వదించాడు. నములను కౌగిలితో సత్కరించాడు. పెద్దలకు నమస్కరించి వారి ఆశీస్సులు తీసుకున్నాడు. ఇలా ప్రతివ్యక్తికి ఒక రాముడు లభించినప్పుడే వారికి సంతుష్టి కలుగుతుంది. అందుకే వేదమాత, భగవంతుడు సగుణుడైనప్పటికీ కేవలం వయ్యక్తిక ఆరాధన చేతనే ప్రకటమౌతాడని చెబుతోంది.

జ్ఞానము, భక్తి, రూపాలు ధరించి నిలిచాయా అన్నట్లుగా కనిపిస్తున్న అహల్య గౌతమ దంపతులు, రామస్వరూపాన్ని అనేక విధాలా స్తుతించి ధన్యులైనారు.

అవతారిక :

అహల్యా గౌతముల నుద్ధరించిన రాముడి మిథిలా నగర ప్రయాణం ముందుకు సాగింది. మార్గమధ్యంలోనే విశ్వామిత్ర మహర్షి శ్రీరాముడికి సీతా జన్మవృత్తాం తెలియజేశాడు. సూక్ష్మశరీరధారులై రాముడి వెన్నంటి ఉన్న దేవతలు, సీతను ఆది పరాశక్తిగా ఎరిగి ఆవిడను స్తుతించారు. ఈ ప్రసంగాన్ని వేదమాత 30, 31 మంత్రాలలో మనముందుంచబోతోంది.

**30, 31. మంత్రాలు**

**పితా యస్త్వాం దుహితర మధిష్కన్ క్ష్మయా రేతః సంజగ్మానో నిషించత్**
**స్వాధ్యో2జనయన్బ్రహ్మ దేవా వాస్తోష్పతిం వ్రతపాం నిరతక్షన్॥**

(ఋగ్ 10-61-7)

**అర్వాచీ సుభగే భవ సీతే వందామహే త్వా**
**యథా నః సుభగాససి యథా నః సుఫలాససి॥**

(ఋగ్ 4-57-6)

ఏ సీత యొక్క స్వయంవరానికైతే మనం ఇప్పుడు వెళుతున్నామో ఆవిడ ఉత్పత్తిని గురించి ఇలా చెబుతారు. తన ఇంట్లో ఉత్పన్నమైన పుత్రిని గురించి "ఈవిడ కులనాశిని అవుతుంది" అని దైవజ్ఞులు చెప్పగా, ఆ అమ్మాయిని రావణుడు విడిచి పెట్టాడు. ఆవిడ భూమిలోకి వెళ్లి అక్కడే ఉండిపోయింది.రావణుడి వధ ద్వారా దేవతలకు శుభం చేకూర్చడం కొరకు యజ్ఞవాటికను దున్నుతున్న జనకుడికి భూమాత గర్భం నుండి లభించింది.

విశ్వామిత్రుడి నోటి వెంట ఈ మాటలు విన్న దేవతలు సీత నిలా స్తుతించారు.

ఓ సుభగే! సీతే! మాకు ఐశ్వర్యాన్నిచ్చే నీకు, మా శత్రుపక్షాన్ని నాశనం చేసే నీకు మేము వందనమాచరిస్తున్నాము. మాకు నీవనుకూలవతి వగుదువుగాక!

రావణుడు మునులను జయించగోరి తన విజయ సూచనగా వారి రక్తాన్ని కొద్దికొద్దిగా సేకరించి ఒక పాత్రలో ఉంచాడు. కృత్స్నమదుడనే ముని ఒక కుమార్తెను పొందగోరి యజ్ఞం చేస్తూ, ఒకపాత్రలో పాలు పోసి దర్భలతో మంత్రించి ఉంచాడు. ఆ పాత్ర రావణుడి చేత చిక్కింది. దానిలో మునుల రక్తాన్ని కలపి తన భార్య మండోదరికిచ్చి" ఇది విషం, దీన్ని దాచి ఉంటు" అని చెప్పాడు. రావణుడు తనను పట్టించుకోక ఇతర స్త్రీలను చేరుతున్నాడనే బాధ తట్టుకోలేక ఆత్మహత్య చేసుకోదలచిన మండోదరి, ఆ రక్తంతో కలిసిన పాలను త్రాగింది. దానితో ఆవిడ గర్భవతి అయ్యింది. ఈ విషయం భర్తతో చెప్పడానికి భయపడిన ఆవిడ తీర్థ యాత్రల నెపంతో పుట్టింటికి చేరి అక్కడ ఒక ఆడపిల్లను ప్రసవించి, ఆ పాపను ఒక బంగారు పెట్టిలో ఉంచి, భూమిలో దాచి, సరస్వతీ నదిలో స్నానంచేసి లంకకు వెళ్లిపోయింది.

జనకుడు భూమిని దున్నుతుండగా ఈమె దొరికింది, అని అద్భుత రామాయణంలో సీత జన్మవృత్తాంతం తెల్పబడింది.

కృశధ్వజుడనే రాజు వేదం పఠిస్తుండగా అతడి భార్య మాలావతి ఒక స్త్రీ శిశువుని కన్నది. అదే సమయంలో సూతికా గృహం నుండి వేద ధ్వని వినిపించింది. కాబట్టి ఆ శిశువుకు వేదవతి అని పేరు పెట్టారు. ఆమెను శ్రీమహావిష్ణువుకే ఇచ్చి వివాహం చేయాలని కృశధ్వజుడు నిర్ణయించాడు.ఒక రాక్షసుడామెను చూసి తనకిమ్మని కృశధ్వజుడి నడిగాడు. ఆయన అందుకు అంగీకరించకపోవడంతో కోపంతో వాడాయనను చంపించాడు. భర్తృవియోగంతో మాలావతి కూడా ప్రాణత్యాగం చేసింది. తల్లిదండ్రులను పోగొట్టుకొన్న వేదవతి తపస్సు కొరకై అరణ్యానికి వెళ్లింది. తపస్సు చేసుకుంటున్న ఆమెను రావణుడు చూశాడు. తనను పెండ్లాడ మని కోరాడు. తాను విష్ణువును తప్ప మరింకెవరినీ వివాహమాడనని ఆమె చెప్పింది. కాని మోహపారవశ్యంలో రావణుడు ఆవిడను పట్టుకొని ముద్దాడబోయాడు. నువ్వు దుష్టుడవని ఎరిగి కూడా నీతో సంభాషించాను.

ఇక ఈ దేహంతో నేను ఉండలేను అంటూ యోగాగ్ని కల్పించుకొని వేదవతి "నా మనస్సు నిజంగా హరిపైనే ఉన్నదయితే నేను అయోనిజనై పుట్టి, విష్ణువుని పెండ్లాడి నీ వంశాన్ని నాశనం చేస్తాను" అని ప్రతిజ్ఞ చేస్తూ దగ్ధమైపోయింది. ఆ తరువాత ఆమె లంకలోనే ఒక పద్మంలో పుట్టింది. మొదట ఆమె రావణుడికే కన్పించింది. కానీ జ్యోతిష్యులు ఆమె జన్మము అరిష్టసూచకమని చెప్పడంతో, ఆమెనొక పెట్టిలో పెట్టి సముద్రంలో వదిలారు. ఆమె మిథిలా నగరం చేరింది. మట్టిలో కూరుకుపోయిన ఆ పెట్టె యజ్ఞవాటికను దున్నుతున్న జనకుడికి దొరికింది. నాగలి చాలులో లభించిన ఆ శిశువుకు సీత అని జనకుడు నామకరణం చేశాడు అని బ్రహ్మవైవర్త పురాణం వల్ల తెలుస్తోంది.

క్షేమేంద్రకృత దశావతార చరితాన్ననుసరించి, ఒక సరోవరంలోని ఒక కనక పద్మంలో దివ్య స్త్రీ శిశువు రావణుడికి కనిపిస్తుంది. ఆవిడను తెచ్చి రావణుడు మండోదరికి పెంచుకోవడానికి ఇస్తాడు. మండోదరి ఒడిలో ఉన్న ఆ శిశువుని చూసి నారదుడు.

"కన్యా భవిష్యత్యభిలాష భూమిశ్చపలేంద్రియస్య"

"చపలేంద్రియుడు (ఇంద్రియాలపై అదుపు లేనివాడు) రావణుడికి ఈ కన్య భవిష్యత్తులో అభిలాషా కారణం కాగలదు" అని చెప్పాడు.

దానితో భయపడిన మండోదరి ఆ శిశువును స్వర్ణ పేటికలో పెట్టి, దూరదేశంలో ఎక్కడైనా భూమిలో ఉంచమని భటులకు చెప్పింది. ఆ విధంగా మిథిల చేరిన సీత, నాగటి చాలులో జనకుడికి లభించింది.

ఈ విధంగా అనేక పురాణ ఇతిహాసాలలో, సీత స్వయంగా మహాలక్ష్మి అని, ఆదిపరాశక్తి అని, రావణ సంహారార్థమై అతడి ఇంట్లోనే పుట్టి, జనకుడి ద్వారా పెంచబడిందని తెలుస్తోంది.

సీతోపనిషత్తులో ఆవిడే శ్రీ, భూ, నీలా ఆదిశక్తులకు దివ్యకేంద్రంగా పేర్కొనబడింది. వరలక్ష్మి, ఐశ్వర్యలక్ష్మి, విజయలక్ష్మి, మోక్షలక్ష్మి మొదలైన వారంతా ఆవిడ అంశాలే. కృషి (వ్యవసాయం)కి కూడా ఆవిడే అధిష్టాత్రి

అని చెప్పబడింది.

సకల కుశల దాత్రీం భక్తిముక్తి ప్రదాత్రీం
త్రిభువన జనయిత్రీం దుష్టధీనాశయిత్రీమ్।
జనకధరణి పుత్రీం దర్పిదర్ప ప్రహర్త్రీం
హరిహర విధికర్త్రీం నౌమి సద్భక్త భర్త్రీమ్॥

సర్వశుభాలు, క్షేమాలు కలుగుజేసేది, భక్తిని ముక్తిని ఒసగేది, ముల్లోకాల పుట్టకకు కారణమైంది, దుష్టుల బుద్ధిని నాశనం చేసేది, జనకుడికి భూమి నుండి లభించినది. దాంభికుల అహంకారుల దర్పంపై ప్రహారం చేసేది, త్రిమూర్తులను సృష్టించినది, సద్భక్తులను రక్షించేది అయిన ఆదిపరాశక్తి సీతామాతకు నమస్కారిస్తున్నాను అంటూ దేవతలామెను స్తుతించారు.

సీతామాతను శక్తి, మాయ, భక్తి అనే మూడు రూపాలలో కొలుస్తారు. 'యా' ఏదైతే 'మా' లేదో దానిని మాయ అంటారు. అంటే రూపంతో ఏదైతే లేదో, ఏదైతే కేవలం శక్తో దాన్ని ఇక్కడి మాయ అన్నారు. మరి ఈ శక్తి ఎవరిది? రాముడిది-ఈవిడ సంయోగం వల్లనే ఆయన శక్తివంతు డైనాడు. ఇంద్రజాలికుడు కేవలం తన మేధస్సుతో, లేని వస్తువులను కనబడేలా చేస్తాడు. దీన్నే తెలివి, జ్ఞానం అంటారు. ఇది నిమిత్త కారణం, కాని కుమ్మరివాడు కుండలు చేయాలంటే కుండలు చేయగల జ్ఞానం (మాయ)తో బాటు పదార్థం కూడా కావాలి. ఈ పదార్థాన్నే ఇక్కడ శక్తి అన్నారు. కనుక పరమాత్మ మాయాశక్తి యొక్క ప్రక్రియలతో సృష్టి చేస్తాడు. ఇలా సృష్టి యొక్క బంధంలో ఉన్న జీవులు మళ్లీ ముక్తి పొందాలంటే ఈ సీతమ్మ యొక్క మూడవ రూపమైన భక్తి నాశ్రయించాలి.

అవతారిక :

మిథిలా నగరాన్ని చేరిన విశ్వామిత్ర రామలక్ష్మణులకు జనక మహారాజు అర్ఘ్యపాద్యాలిచ్చి సత్కరించాడు. రెండవ రోజు సభలో ఎందరో రాజులకు ఎత్తడానికి కూడా సాధ్యంకాని దుష్కరమైన శివధనుస్సును విశ్వామిత్ర మహర్షి ఆజ్ఞతో రాముడు విరిచాడు. జనకుడు సీతను

రాముడికి సమర్పించడానికి ముందుకు రాగా, దుష్టులైన కొందరు రాజులు ఈర్ష్యతో రాముడిని బంధించి సీతను చెరబట్టడానికి ఉద్యమించారు. ఇంతలో సూక్ష్మశరీరధారులైన దేవతలు ఆకాశవాణిని వినిపించారు. అంతటితో ఆ రాజులందరూ తమ రాజ్యాలకు వెళ్ళిపోయారు. ఈ విషయాన్నే వేదమాత 32,33,34 మంత్రాలలో మన ముందుంచబోతోంది.

**32, 33, 34. మంత్రాలు:**

**సుమంగలీరియం వధూరిమాం సమేత పశ్యత।**
**సౌభాగ్యమస్యై దత్త్వాయాథాస్తం వి పరేతన॥**

(ఋగ్ 10-85-33)

**ఇన్ద్రః సీతాం నిగృహ్ణాతు తాం పూషాను యచ్ఛతు।**
**సా నః పయస్వతీ దుహా ముత్తరా ముత్తరాం సమామ్॥**

(ఋగ్ 4-57-7)

**గోత్రభిదం గోవిదం వజ్రబాహుం జయన్తమజ్మ ప్రమృణన్త మోజసా।**
**ఇమం సజాతా అను వీరయ ధ్వమిన్ద్రం సఖాయో అను సం రభధ్వమ్॥**

(ఋగ్ 10-103-6)

ధనుర్భంగమై పోగానే జనకుడు సీతను తీసుకొని వచ్చి "ఈ శుభలక్షణాలు గల వధువును నీ ఇంటికి తీసుకువెళ్ళు" అన్నాడు.

ఆకాశవాణి ఇలా వినిపించింది. శ్రీరామా సీతను స్వీకరించు, జనకుడామెను రామునకిచ్చుగాక. ఈ సీత మాకు భవిష్యత్తులో ఎంతో సుఖాన్ని (ఆనందాన్ని) చేకూర్చే దవుతుంది.

స్వయంవర భవనంలోకి ప్రవేశించిన రాజుల కొరకే దేవవాక్యాలు:- రుద్రుడి ధనుస్సును భంగం చేయగల వజ్రబాహువు, బలంచేత ద్రవ్యాన్ని (లక్ష్మిని) జయించగల ఈ రాముడు తనతో సములైన మిత్రులతో (వానరులతో) శత్రువుల ప్రకోపాన్ని నాశనం చేయగలడు.

విశ్వ ఇతిహాసంలో అసంఖ్యాకులైన రాజుల చరిత్రలు వర్ణించ బడ్డాయి.

కాని మిథిలానగర రాజుల పరంపరలో కనిపించే విచిత్రం మరెక్కడా కనిపించదు. ఆ సింహాసనం పైన కూర్చున్న ప్రతి రాజు జనకుడే, విదేహుడే (శరీరం తాను కాదు అని తెలుసుకున్న మహాజ్ఞాని) ఇతర రాజ కులాలలో శౌర్యానికి ప్రధాన్యత ఇవ్వబడితే, వీరిలో జ్ఞానానికి ప్రధాన్యత ఇవ్వబడేది. బ్రాహ్మణ జాతిలో కనిపించే వైరాగ్యం, త్యాగం, జ్ఞానం మొదలైన వాటిలో జ్ఞానాన్ని, క్షత్రియులలోని భోగం, శౌర్యం, ప్రజా సంక్షేమం మొదలైన వాటిలో ప్రజా సంక్షేమాన్ని గ్రహించి జనకులు, సాంఘిక క్షేమంతో బాటుగా వయ్యక్తిక సాధనా ప్రగతిని కూడా కలుపుకొని కర్మ యోగానికి బాటలు వేశారు. అన్ని కర్మలు చేస్తూనే వ్యక్తి ఏ విధంగా కర్మబంధం, కర్మఫల బంధనం నుండి బైటపడగలగుతారో వారు వ్యవహారంలో చేసి చూపించారు. కర్మ నుండి పలాయనం చేయడం వల్ల సమాజం నిష్క్రియమౌతుంది. కానీ కర్మ చేస్తూకూడా మానవజన్మను సార్థకం చేయగల ఆధ్యాత్మికత లేకపోతే, ఆ కర్మ అతడికి భారమైపోగా, అతడి వయ్యక్తిక జీవనం బరువై పోతుంది. కర్మ భోగాసక్తి చేత ప్రేరితమైతే అది పరపీడనానికి దారితీసే రాక్షస జీవనమౌతుంది. కనుక కర్మ వెనుక కర్మ గతి నెరిగిన జ్ఞానం ఉండటం అవసరం. ఈ జ్ఞానం కలిగి లోక సంగ్రహం కొరకు కర్మ చేసే జనకులు రాజర్షులుగా పిలవబడ్డారు. వీరు ఇతర రాజుల చేత గౌరవింప బడటమేగాక, జ్ఞానోపదేశార్థమై ఎందరో సాధకులు వీరి వద్దకు వచ్చేవారు.

శ్రీరామ దర్శనం కన్నా ముందు జనకుడు ఒక జ్ఞానిగాను, సమస్త భోగాల మధ్య నిస్సంగుడై నిలిచి ఉండే కర్మయోగిగా మనకు కనిపిస్తాడు. కానీ యోగ భోగాలు రెంటి యొక్క లోతులలో భక్తి ధార ప్రవహిస్తూ ఉండేది.

జోగ భోగ మహ్ రాఖె ఉ గోఈ।
రామ బిలోకన ప్రగటె ఉ సోఈ॥

యోగ భోగాల చాటున దాచిపెట్టిన భక్తి ధార శ్రీరాముడి దర్శనం వల్ల బైటికి ప్రవహించింది.

సకామత పరమాత్మ ప్రాప్తికి అడ్డు, కేవలం నిష్కామతే భగవత్ ప్రాప్తికి

మార్గం అంటారు కొందరు. కానీ రామాయణ పాత్రలు మన ముందొక కొత్త దర్శనాన్ని నిలుపుతాయి. రెండు అతి ప్రధానమైన పాత్రలలో ఒకటి సకామత వల్ల, రెండవది నిష్కామత వల్ల, పరమాత్మను పొంద గలుగుతాయి. అసలు పరమాత్మ ప్రాప్తికి ఏ మార్గంలోనూ అడ్డులేదు. కేవలం మన అసంపూర్ణతే మనకు అడ్డయి నిలుస్తోంది. సకామత అయినా, నిష్కామత అయినా తన యొక్క చరమ స్థాయిని చేరి పరిపూర్ణమైనప్పుడు పరమాత్మ ప్రాప్తి తథ్యం.

స్వాయంభు మనువు గొప్ప చక్రవర్తిగా ఈ భూమినంతా పాలించాడు. కొన్ని వేల సంవత్సరాల వరకు సమస్త భోగాలు అనుభవించాడు. కోరికలు కోరీ కోరీ లభించిన అన్ని సుఖాలను అనుభవించి కూడా తృప్తి కలగలేదు. విపరీతమైన ఆ సకామతే చివరికి ఉత్కృష్టమైన భగవత్ప్రాప్తి అనే సకామత గా మారింది. ఏ విధంగానైతే భోగప్రాప్తి కొరకు సమస్త శక్తిని ఉపయోగిస్తూ వచ్చాడో అలాగే భగవత్ప్రాప్తి కొరకు కూడా ప్రయత్నించాడు. కొన్ని సంవత్సరాల పాటు తపస్సులో మునిగిపోయాడు. చివరికి పరమాత్మతన ఎదుట నిలిచి వరం అడగమంటే "మీరేమివ్వగలరు స్వామి?" అని ప్రశ్నిస్తాడు మనువు. అప్పుడు పరమాత్మ "ఏదైనా ఇవ్వగలను, కోరుకోండి" అంటాడు. చతురుడైన మనువు "నీవే పుత్రుడివై నా ఇంటికి రావాలి పరమాత్మ" అని అడుగుతాడు. దానమడగడం సకామత అయితే తానే కావాలని అడగడం పరిపూర్ణ సకామత. ఆవుపాలు దానంగా అడగడం కంటే ఆవునే దానంగా అడగడం ఉత్తమం కాదా! పాలు దానంగా తీసుకుంటే మళ్లీ రోజూ వెళ్లి అడగవలసి ఉంటుంది. అదే ఆవే ఇంట్లో ఉంటే పాలు అడిగే దారిద్ర్యమే తీరిపోతుంది. ఈ మనువే రెండవ జన్మలో దశరథ మహారాజుగా జన్మించి, పరమాత్మను పుత్రుడిగా పొందాడు.

దశరథుడు సకామత యొక్క పరాకాష్టలో పరమాత్మను పొందితే, జనకుడు నిష్కామత యొక్క పరాకాష్టతో భగవంతుడిని పొందాడు. నిష్కాముడైన జనకుడు పరమాత్మను కూడా కోరడు. కానీ ఆయన యొక్క

నిష్కామతే పరమాత్మను సూదంటురాయిలాగా జనకుడి ఇంటివైపు లాగుతుంది.

నిజనిజ ధరమ నిరత శ్రుతి నీతీ
తెహికర ఫలపుని బిషయ బిరాగా
తబ మమ చరన ఉపజ అనురాగా

వేదం నిర్ణయించిన స్వధర్మ ప్రవర్తనలో నిరంతరం నిలిచి ఉండటం వల్ల అందుకు ఫలితంగా విషయ వస్తువులపై వైరాగ్యం ఏర్పడుతుంది. ఆ వైరాగ్యమే చివరికి భక్తికి దారి తీస్తుంది.

శరీర జన్యపుత్రుడు నిష్కామతకు ప్రతీకగా నిలవడు. అందుకని నిష్కామతకు ప్రతిరూపమైన జనకుడి ఇంట్లో భక్తిమాత(సీత) ఉదయించింది. భూమి దున్నడం కూడా నిష్కామతకు ప్రతిరూపమే. రైతుభూమి దున్నిన తరువాత విత్తనాలు చల్లి ఫలితాన్ని ఆశిస్తాడు. కానీ జనకుడు ఆ పని కూడా చేయలేదు. ఈ విధంగా నిష్కామ కర్మయోగ ఫలితంగా జనకుడికి భక్తి లభించింది.

కానీ ఈ భక్తి ఆయన ఇంట్లో (హృదయంలో) దాగి ఉన్నది. ఈ విషయం పరమాత్మకు, విశ్వామిత్రుడి లాంటి కొందరు జ్ఞానులకు మాత్రమే తెలుసు. జనకుడి హృదయమనే 'బంగారుపెట్టె'లో ఉన్న ఈ భక్తి అనే రత్నం ప్రజలెవరికీ కనిపించడం లేదు. పెట్టిపై మూత అయిన భోగం, క్రింద భాగమైన (ఆధారమైన) యోగం మాత్రమే కనిపిస్తున్నాయి.

ఈ దాగి ఉన్న భక్తిని పొందే నెపం మీద పిలవకుండానే పరమాత్మ జనకుడి దగ్గరకు వచ్చాడు. నీవు నిష్కాముడవైతే తీసుకోవడానికి సంకోచం ఉండవచ్చుగానీ, ఇచ్చుకోవడానికి సంకోచం ఎందుకు? అంటాడు పరమాత్మ. పరమాత్మ అందరినీ స్వీకరిస్తాడు. సకాముడవైతే ఇచ్చే నెపం మీద, నిష్కాముడవైతే పుచ్చుకునే నెపం మీద మీ ఇంటికి చేరతాడు. కానీ అది ఏదైనా పరిపూర్ణంగా ఉండటం అవసరం.

అసలు తండ్రి కూతుళ్ల సంబంధమే నిష్కామమైంది. ఆమె ఏదో

ఒకనాటికి పరాయి ఇంటికి వెళుతుంది.అదే ఆవిడ ఇల్లని పిలవబడుతుంది. కానీ ఇది కాదు అని ఆవిడకు జన్మనిచ్చినప్పటి నుండి తండ్రికి తెలుసు. ఆ అమ్మాయికి వయసు వచ్చినప్పటి నుండి ఆవిడను ఎవరైనా యోగ్యుడైన వాడి చేతిలో పెట్టాలని ఆత్రుత పడుతూ ఉంటాడు. ఈ విధంగా ఈ ప్రపంచంలోని అన్ని లౌకిక సంబంధాలలోనూ ఒక్క తండ్రీ కూతుళ్ల సంబంధమే నిష్కామమై నిలిచి ఉంటుంది.

ఎవరి జీవితంలోనైతే నిష్కామత, భక్తి ఉదయిస్తాయో అక్కడ పరమాత్మ పిలవకుండానే వస్తాడు. సాధనా భక్తి రూపమైన కౌసల్య ముందు ఆవిడ కోరికననుసరించి పరమాత్మ ప్రకటమైనాడు.

దృష్ట్వాతం పరమాత్మానం కౌసల్యా విస్మయాకులా
హర్షాశ్రు పూర్ణనయనా నత్వా ప్రాంజలి రబ్రవీత్
(అధ్యా.రా. 1-3-19)

తన ముందు ప్రకటమైన పరమాత్మను కౌసల్యామాత విస్మయంతో చూసింది. కండ్ల నుండి ఆనంద బాష్పాలు ప్రవిస్తుండగా ఆయనకు నమస్కరించి, అంజలి ఘటించి స్తుతించడం మొదలు బెట్టింది.

సాధనాభక్తి యొక్క మొదటి పరిణామంలో సాధకుడు తనకు వచ్చిన సువర్ణావకాశాన్ని సద్వినియోగం చేసుకొని తనివితీరా పరమాత్మ యొక్క దివ్యమంగళ విగ్రహ సౌందర్యాన్ని ఆస్వాదిస్తాడు.

కానీ సిద్ధభక్తిలో అలాకాదు. మిథిలా నగరపుతోటలో సుందర రూపంతో సిద్ధభక్తి స్వరూపమైన సీతమ్మ ముందు పరమాత్మ సాక్షాత్కరిస్తాడు. ఆవిడ కండ్లు మూసుకుంటుంది. సిద్ధభక్తితో సాధనాప్రయాస అంతమైంది. ప్రతీక్ష(ఎదురు చూడటం) అంతమై పోయింది. ప్రేమ పరిపూర్ణమైనచోట ఇవన్నీ అంతమౌతాయి. జీవుడే పరమాత్మ చరణాలు పట్టుకోవాలంటే ఎంతకాలమని పట్టుకోగలడు? కానీ అదే పరమాత్మే జీవుడిని పట్టుకుంటే!

మాలాజపా నకర్ జపా జిహ్వా జపా నరామ్।
సుమిరన్ మేరా హరి కరైమై పావాబిస్రామ్॥

భక్తుడైనవాడు అహర్నిశలు భగవంతుడి నామం జపించాలంటారు కదా! మరి మీ చేతిలో మేమెప్పుడు జపమాలనైనా చూసి ఎరుగమే అని ఎవరో అడిగిన ప్రశ్నకు 'దాదు' ఇచ్చిన జవాబిది "నా చెయ్యిగాని, నాలుకగానీ, జపమాలగానీ రామనామజపం చేయడం లేదు. నా బదులు నా పరమాత్మే జపం చేస్తున్నాడు, నేనేమో విశ్రమిస్తున్నాను.

భరత సరిస కోరామ సనేహీ।
జగుజప రామ రాము జప జేహీ॥

భరతుడిని మించిన సిద్ధభక్తుడెవరున్నారీ లోకంలో (రామప్రియులెవరున్నారీ లోకంలో) లోకమంతా రామనామం జపిస్తుంటే రాముడేమో భరతనామం జపిస్తున్నాడు.

మన్ ఐసా నిర్మల్ భయా జైసే గంగానర్।
పాఛే పాఛే హరిఫిరై కహత కబీర్ కబీర్॥

గంగాజలంలాగా మనస్సు నిర్మలమైంది. ఇక స్వయంగా పరమాత్మే నా వెనుక కబీర్-కబీర్ అని జపం చేస్తూ తిరుగుతున్నాడు.

ఇలాగే ఉంది జనకమహారాజు యొక్క స్థితి. నిర్మల మనస్కుడైన ఆయన ఇంటికి స్వయంగా పరమాత్మ తరలి వచ్చాడు.

కస్యైతౌ నరశార్దులౌ పుత్రౌ దేవ సుతోపమౌ
మనఃప్రీతికరౌ మే 2ద్య నరనారాయణా వివ

(ఆధ్యాత్మ రామాయణం)

పురుషోత్తములు, దేవతా పుత్రులలాగా ఉన్నవారు, నరనారాయణ మహర్షులలాగా తేజరిల్లేవారు అయిన ఈ బాలకులిద్దరు ఎవరి కుమారులు? అని జనకుడు విశ్వామిత్రుడిని అడిగారు.

సహజ బిరాగరూప మనుమోరా।
థకిత హోత జిమి చంద చకోరా।
బరబస బ్రహ్మ సుఖహిమనత్యాగా॥

సహజంగా వైరాగ్యంలో స్థితమై ఉండే నా మనస్సు బ్రాహ్మీస్థితిలో కలిగే సుఖం నుండి బలవంతంగా లాగబడింది. ఈ బాలకుల ముఖాన్ని చూస్తూ, చంద్రుడిని చూస్తూ అలిసిపోని చకోర పక్షిలాగా నా మనస్సు నిలిచిపోయింది అన్నాడు.

తత్వజ్ఞుడైన జనకుడు నిర్గుణ నిరాకారవాది. ఆయన దృష్టిలో పరబ్రహ్మ నామరూప రహితుడు. ప్రత్యగాత్మ అయిన పరమాత్మ ద్రష్ట ప్రకాశకుడు-ఆయన దృశ్యం కాడు, కానీ ఈ రోజు ఆయన జ్ఞానానికి ఆయన అనుభూతి వ్యతిరేకమై నిలిచింది. నామ రూపాత్మకమైన ఈ విశ్వం ఆయన దృష్టిలో మిథ్య (లేకుండానే ఉన్నట్లు కనిపించేది). అటువంటి ఈ మిథ్యా ప్రపంచంలో బ్రహ్మానుభూతికి సంబంధించిన పరమానందం అనుభవానికి రావడమేమిటి? ఈనాడు ఆయనకు సత్యం అర్థమైంది ద్రష్టామాత్రమైన నిర్గుణ నిరాకార సత్తాయే సగుణసాకారమై, దివ్య మనోహర రూపమై దృశ్యమవుతుందని. అసలు యోగుల అపూర్ణతను దూరం చేయడం కొరకే అవతారం ఆవిర్భవిస్తుంది. కేవలం సత్యం ద్రష్టామాత్రమవడం, ప్రత్యగాత్మ కావడం, దాని సాధనలో సాధకుడు అంతర్ముఖుడు కావడం అర్ధ సత్యమే. బ్రహ్మ కేవలం నిర్గుణ నిరాకారమే అయ్యేట్లయితే మరి సగుణసాకారం ఏమిటి?

రూపనామాసక్తిలోనే కొట్టుమిట్టాడే వ్యక్తిని మిథ్యాత్వ ప్రతిపాదన ద్వారా ఆధ్యాత్మిక చింతనను జాగృతం చేసి అంతర్ముఖుడిని చేయడం కొరకు అద్వైత తత్త్వప్రతిపాదన చేయడం ఉచితమే. అంటే దాని అర్థం కేవలం నీకు కనిపించే నామరూపాత్మకమైన జగత్తు మాత్రమే బ్రహ్మతత్త్వం కాదు. ఇది ఆయన సంకల్పశక్తిలోని అణుమాత్రమేనని, అది ఆయన విరాట్ రూపంలోని కేవలం ఒక బిందువేనని చెప్పడం.

కానీ బైట, లోపల రెండు వైపులా పరబ్రహ్మ సాక్షాత్కారమైనప్పుడే అది పూర్ణత్వానికి దారి తీస్తుంది. ఇందులో ఒకటి రాత్రయితే, మరొకటి పగలు - ఒకటి ప్రవృత్తి మరొకటి నివృత్తి, నిద్రలో సమస్త జగత్తు

నిషేధమవుతుంది. ఇది ఆ వ్యక్తికి విశ్రాంతి నిస్తుంది. దీని ద్వారా వస్తు నిషేధంలో కూడా నా అంతర్ నిరపేక్ష సుఖం నిత్యమని నిరూపించ బడుతుంది. ఏ బాహ్యాలంబనం లేకుండానే నేను నాలో ఆనందాన్ని పొందగలనని గ్రహించగలడు. కానీ రాత్రి గడిచిన తరువాత పగలు కూడా అనివార్యం అందులో అనేక వస్తువులు, వ్యక్తులను దర్శించడం వారితో వ్యవహరించడం జరుగుతుంది. ఈ వ్యవహారిక అలజడి నుండి బైట పడటానికి గమనిక నిద్ర నాశ్రయిస్తే అది తమోగుణంగాను, వ్యవహారిక జగత్తు నుండి పలాయనంగాను చెప్పబడుతుంది. కానీ అదే వ్యవహారంలో అలసిన వ్యక్తి విశ్రాంతి కొరకు శయ్య నాశ్రయిస్తే ఆ నిద్ర సార్థకమౌతుంది. రెండవ రోజు వ్యవహారానికి స్ఫూర్తి నిస్తుంది. ఆ శక్తితో వ్యక్తి కర్తవ్య కర్మలో ఆరూఢుడౌతాడు. అలాగే ధ్యానమనే విశ్రాంతిలో సమస్త ప్రపంచాన్ని విలీనం చేసిన యోగి, లోక సంగ్రహార్థమై ప్రపంచంలో వ్యవహరించేటప్పుడు ఆ అనుభూతిని వివిధ నామ రూపాలలో సాక్షాత్కారించుకొని ధన్యు డౌతాడు - పూర్ణుడౌతాడు.

ఈ రోజు జనకుడు తన నిర్గుణ నిరాకార ద్రష్టామాత్ర పరమాత్మను, సగుణ సాకార దృశ్యరూపంలో చూసి పూర్ణుడైనాడు, ధన్యుడైనాడు.

ఏవంబ్రువతి మౌనీశే ఆగతా శ్చాపవాహకాః
చాపం గృహీత్వా బలినః పంచసహస్ర సంఖ్యాకాః
ఘణ్టా శత సమాయుక్తం మణి వజ్రాది భూషితమ్

శివధనుస్సును రాముడికి చూపమని విశ్వామిత్రుడంటూ ఉండగానే, బలవంతులైన ఐదువేల మంది నూరు గంటలతోనూ, అనేక మణులు మొదలైన వాటితో అలంకరింపడి ఉన్న శివధనుస్సును అక్కడకి తెచ్చారు.

ఆధ్యాత్మ, ఆనంద రామాయణాలు, పద్మ పురాణాల ననుసరించి త్రిపురాసురులను నాశనం చేయడానికి శివుడు వాడినది ఆ విల్లు. వాల్మీకి రామాయణాన్ననుసరించి దేవతలు దాన్ని 'నిమి' మహారాజు యొక్క జ్యేష్ఠ పుత్రుడైన దేవరాతుడికి ఇచ్చారు. అప్పటి నుండి జనకుడి వంశంలో ఈ

విల్లు పూజింపబడుతూ వచ్చింది.

"అహంకార శివ" - ఇది ఈశ్వరుడి విల్లు. అంటే సమష్టి అహంకారానికి ప్రతీక అన్నమాట. వ్యక్తిగత అహంకారం అంతం చేసుకొని సమష్టి క్షేమం కొరకు అంకితం అయిన విదేహ రాజవంశానికి ఇది అవసరమైనది, వారిచేత పూజింపబడేది. ఆ కర్మ యోగంలో చరమావస్థకు చేరుకున్న వీరికి ఫలితంగా భక్తి (సీత) లభించింది. ఈ కర్మ ఫలితాన్ని పరమాత్మ చరణాల వద్ద సమర్పించుకోవలసి ఉంది.

ఒక రోజు పూజామందిరం శుభ్రం చేసేపని జనకుడు సీతకు వప్పచెప్పగా, ఎడమ చేతితో శివధనుస్సును లేపి, కుడి చేత్తో దాని కింద శుభ్రం చేసిందట.

ఉద్భవ స్థితి సంహార కారణీం క్లేశహారిణీమ్।
సర్వశ్రేయస్కరీం సీతాం నతో2హం రామవల్లభామ్।

సర్వక్లేశాలు హరించేది, సృష్టిస్థితి లయాలకు కారణమైనది. సర్వజనులకు శ్రేయస్సును కలిగించేది ఆదిపరాశక్తి శ్రీరామపత్ని సీతకు నమస్కారం.

అంతటితో మహాశక్తి ఉత్పన్నమైందని జనకుడు గ్రహించాడు. మనకు దారిలో ఏదైనా విలువైన వస్తువు కనిపించిందనుకోండి, ఏం చేస్తాం? మనలో చాలామంది దాన్ని ఇంటికి పట్టుకు వెళతారు. స్వార్థరహితులయితే అది ఎవరిదో కనుక్కొని వారికి అందజేస్తారు. అలాగే జనకుడు ఆ శక్తి ఎవరిదో వారు వచ్చి తీసుకువెళ్లండి అని ప్రకటన చేశాడు.వెంటనే అది నాదంటే నాదేనని ముందుకొస్తారని ఆయనకు తెలుసు. అందుకే ఆ శక్తి తమదేనని నిరూపించడానికి కొలబద్దలాగా ఈ శివధనుస్సును ముందుంచాడు. శక్తి, శక్తిమంతుడి దవుతుంది కాని శక్తిహీనుడిది కాదు. శక్తిమంతుడు తన శక్తిని ప్రదర్శించి తన వస్తువును తాను తీసుకు వెళ్లవచ్చు.

శక్తిని మించిన కర్తలు ఎవరూ ఈ సృష్టిలో లేరు. పరబ్రహ్మను మించిన ఆ కర్తలు కూడా ఈ సృష్టిలో ఎవరూ లేరు. శక్తి ఎడమచేత్తో విల్లును లేపి తన కర్తృత్వాన్ని నిరూపించుకుంది. ఇప్పుడు దాన్ని విరిచి

కర్తృత్వాన్ని నాశనం చేసి అకర్తృత్వాన్ని నిరూపించుకోవలసిన బాధ్యత రాముడిది.

నైతత్ సురగణాః సర్వేసాసురా న చ రాక్షసాః।
గన్ధర్వ యక్షప్రవరాః సకిన్నర మహోరగాః।
క్వగతిర్మానుషాణాశ్చ ధనుషోఽస్య ప్రపూరణే।
ఆరోపణే సమాయోగే వేపనే తోలనే తథా॥

(మహానాటకం)

ఎందరో దేవతల, రాక్షసుల, గంధర్వుల, యక్షుల, కిన్నెరుల, మహోరగులకే ఈ విల్లును ఎత్తడంగానీ, ఎక్కుపెట్టడంగానీ కదిలించడంగానీ, తూచడం గానీ, సాధ్యం కాలేదు. ఇక మనుష్యుల సంగతి ఏమని చెప్పగలం!.

సాధకుడు అన్ని సాధనలు చేయవచ్చు. అనేక సాధనలలో విజయం కూడా పొందవచ్చు. లోభాన్ని దానంతో జయించవచ్చు. క్రోధాన్ని శాంతంతో. జయించవచ్చు. ఇలా అనేక సాధనలతో దుర్గుణాలను విడుస్తూ పురోగమించవచ్చు. కానీ ఈ సాధనాహంకారం అంతమయ్యేదెలా? లోభాన్ని దానంతో జయించినా, తాను దాతననే అహంకారం అంతమవడం ఎలా? ఈ అహంకారం అంతమవడానికి మరే సాధనా లేదు. ఇది కేవలం పరమాత్మ యొక్క అనుగ్రహం వల్ల మాత్రమే సాధ్యమౌతుంది. అందుకే సమష్టి అహంకారరూపమైన శివుడి ద్వారా త్యజించబడ్డ ఈ కర్తృత్వం కేవలం పరమాత్మ వల్ల అంతం కావలసిందే.

అందుకే "రామా లే ఇక, జనకుడి సంతాపం అంతం చేయడం కొరకు, భవచాపాన్ని భంజించు'' అని విశ్వామిత్రుడాజ్ఞాపించగానే, శ్రీరాముడు లేచి నిలబడ్డాడు. ఆసనం నుండి లేచి నిలుచుని విశ్వామిత్రుడి చరణాలకు నమస్కరించి, హర్షంగానీ, విషాదంగానీ, ఉద్వేగంగానీ లేకుండా రాముడు శివధనుస్సువైపు మందగమనంతో కదిలాడు. తూర్పు దిక్కున ఉదయించే సూర్యుడిలాగా రాముడు లేచి నిలబడగా, సత్పురుషులనే కమలాలు వికసించాయి, వారి నేత్ర భృంగాలు ఆనందమగ్నమైనాయి.

రాజుల యొక్క ఆశ అనే రాత్రి అంతమై పోయింది. నక్షత్రాలలాగా మెరుస్తూ ఉన్న వారి డాంబిక మాటలు లుప్తమై పోయాయి. అభిమానులైన రాజులు కొందరు కుముదపుష్పాలలాగా ముడుచుకుపోయారు. కపటులైన రాజులు సిగ్గుతో గుడ్లగూబలలాగా దాక్కున్నారు. మునులు, దేవతలు చక్రవాక పక్షులలాగా శోక ముక్తులైనారు. వారంతా పుష్పవర్షం కురిపించడం మొదలు బెట్టారు.

ఈ రూపకాన్ని మాధ్యమంగా పెట్టుకొని సూర్యోదయం తరువాత సృష్టిలో ఏర్పడే వాతావరణాన్ని ధనుర్యజ్ఞానికి పోల్చారు. సూర్యుడు ఎవరినీ బాధపెట్టడు, హాని చేయడు, కానీ అంధకారం కారణంగా ఏ వస్తువులు మనకు కనిపించవో అవన్నీ సూర్యోదయం తరువాత వాస్తవరూపాలలో కనిపిస్తాయి.తాత్వికదృష్టిలో అంధకారాన్ని అంతం చేసే కర్తృత్వం సూర్యుడి లో లేదు. కానీ సహజంగానే అంధకారం అంతమవడం జరిగిపోతుంది. కనుక ప్రత్యేకంగా అంధకారానికి వేరుగా సత్తాలేదు. సూర్యుడు కనిపించకుండా ఉండటమే అంధకారం. శివధనుస్సనే అంధకార అహంకారం అంతం చేయడం కొరకు రామసూర్యుడి భుజబలం అవసరం. నక్షత్రాల లాంటి రాజులంతా రాత్రంతా ప్రయత్నించి కూడా ఈ అంధకారాన్ని దూరం చేయలేక పోయారు.

జనకుడు గొప్ప తత్వజ్ఞుడనడంలో సందేహం లేదు. కానీ జీవుడి జ్ఞానం అఖండమై ఉండలేదు. "గ్యాన అఖండ ఏక్ సితాబర్" కేవలం ఒక సీతారాముడే అఖండ జ్ఞానం. జనకుడనే జ్ఞాన సూర్యుడిని అప్పుడప్పుడూ మేఘాలు, గాలి దుమారాలు కప్పివేయగలవు. అందుకే ఇంత జ్ఞాని అయిఉండి కూడా సీతమ్మ వివాహవిషయంలో ఒక సాధారణమైన ఆడపిల్ల తండ్రిలా తల్లడిల్లిపోతూ కనిపిస్తాడు.

వ్యక్తిగత అహంకారాన్ని మోసుకుంటూ వెళ్లిన రాజులంతా సమష్టి అహంకారాన్ని తుంచుదామని చూస్తే అది విరగకపోగా, వీరి అహంకార బరువు కూడా అందులోకి ప్రవేశించి అది మరింత బరువైందట. ఈ

ధనుస్సు ఒకసారి శివుడితో "మీరు నా ద్వారా ఇతరులను సంహరించి వారికి ముక్తినిస్తున్నారు బాగానే ఉంది కానీ మరి నాకు ముక్తి ఎప్పుడు? మీరు నన్నెప్పుడూ బంధిస్తూ (త్రాటితో) ఉంటారెందుకూ?'' అని ప్రశ్నించిందట. శివుడు నవ్వుతూ "రాముడు నీ దగ్గరకు రాగానే నీ అంతట నీవు విరిగిపో అప్పుడు ఇక నిన్ను ఎవరూ బంధించరు కానీ జాగ్రత్త! ఒక్క పరమాత్మ ముందు తప్ప మరెవరి ముందు విరగకూడదు, నిన్ను విరవలేక అందరి అహంకారం అంతమైనాకే ఈశ్వరుడు వస్తాడు'' అన్నాడట.

తన అహంకారమనే ధనుస్సు విరగాలని కోరుకునే ఉత్తమ సాధకుడు జనకుడైతే, తన అహంకారమనే ధనుస్సు విరగకూడదని కోరుకునే అజ్ఞాని కంసుడు. కానీ కోరుకున్నా కోరుకోకపోయినా సమయమాసన్నమైనప్పుడు అహంకారాన్ని అంతం చేసేపని మాత్రం ఆ పరమాత్మదే.

శ్రీరాముడు ధనుస్సు వద్దకు వెళ్లడం వరకు మాత్రమే సభాసదులకు కనిపించింది, ఆ తరువాత ఏం జరిగిందో తెలియదు.

ద్విధాభగ్నం ధనుర్దృష్ట్వా రాజాలింగ్య రఘూద్వహమ్

రెండు ఖండాలుగా భూమి మీద పడిఉన్న విల్లుని చూసి సంతుష్టుడైన జనకుడు రాముడిని కౌగిలించుకున్నాడు.

ఇంత బరువైన వింటిని ఎత్తి ఎలా ఎక్కుపెట్టగలిగావు అని రాముడిని జనకుడడిగితే "ఈ రాజులంతా వింటిని తూచడానికి వెళ్లారు గానీ, వారి వద్ద తూచగల తూనికరాళ్లే లేవు. నేను నా గురువుకు నమస్కారం చేసి కర్తృత్వాభిమానరహితుడనై నిలిచాను. నా గురువుయొక్క గురుత (బరువు) ఒక పక్క త్రాసులో పడటం వల్ల గురుతరమైన ఈ విల్లు ఇటుపక్క లేచింది. ముట్టుకోగానే తనంతట తాను విరిగి పోయింది'' అన్నాడట. అవును మరి నిర్గుణ కూటస్థ రూపుడిలో కర్తృత్వ మెక్కడిది!.

శివధనుర్భంగం వల్ల దుష్టులైన రాజులకు, పరశురాముడికి తప్ప తక్కిన అందరు ప్రజలకు ఆనందం కలిగింది. స్వయంగా విరిగిన ధనుస్సుకు కూడా ఆనందం కలిగిందట. ఆది గురువైన శివుడి సాహచర్యంలో అసంఖ్యాకులైన సాధకులకు జిజ్ఞాసులకు జ్ఞానం కలగగా లేనిది ఆయన చేతిలో ఉండే ధనుస్సుకు కలగదా? అది జడంగా ఉండ గలుగుతుందా?

ఎవరో ఆ ధనుస్సుతో "అయ్యో! పాపం రాముడు నిన్ను విరిచాడు కదా'' అంటే విరిగిన ధనుస్సు నవ్వుతూ "అది ఆలోచించే దృష్టి కోణాన్ని బట్టి ఉంటుంది నేను మాత్రం ఆయన నన్ను గుణ (త్రాటి) బంధనంలో పడకుండా ముక్తి నిచ్చాడని భావిస్తున్నాను''. అన్నదట. పైగా మళ్లీబంధంలో పడకుండా ఉండటమేకాక పరమాత్మ శ్రీకరాల్లోకి వెళ్లగలిగాను కదా అని కూడా అన్నదట. వెంటనే ఆ వినేవారు వ్యంగ్యంగా "తన చేతులతో ఎత్తితే ఏం, మళ్లీ నిన్ను కిందపడేశాడు కదా'' అన్నారట. అప్పుడా ధనుస్సు "మళ్లీ ఇది కూడా ఆలోచించే కోణాన్ని బట్టి ఉంటుంది లేపినప్పుడు ఆయన శ్రీకరాల్లో ఉన్నాను. పడవేసినప్పుడు శ్రీచరణాల వద్ద పడ్డాను. గంగోద్గమన స్థానాన్ని చేరిన నా కన్నా ధన్యులెవరు?'' అన్నదట.

ఆనందం అవధులు దాటిన జనకుడు ధన్యత ననుభవిస్తూ రాముడిని పూర్ణ బ్రహ్మంగా గుర్తించినవాడై వెళ్లి సీతమ్మను వెంటబెట్టుకు వచ్చి "శుభాన్ని చేకూర్చే ఈ వధువును వెంటబెట్టుకొని నీ ఇంటికి వెళ్ళు'' అన్నాడు.

భక్తి (సీత) పూలమాల వేయడానికి ముందుకు వచ్చింది, జ్ఞానం (రాముడు) తలవంచి నిలిచింది. సిగ్గుకారణంగా ముడుచుకొని పోయిన సీతమ్మ, చేతులు ఎత్తి మాల వేయలేకపోతోంది. ఆలస్యమైనప్పటికీ కోపగించక అలాగే తలవంచి నిలుచుని ఉన్నాడు రాముడు. అవును మరి వినయమే కదా జ్ఞానం యొక్క లక్షణం. ఈ సన్నివేశాన్ని చూసిన వైరాగ్యం (లక్ష్మణుడు) తనువు పులకరించింది. భక్తి జ్ఞానాల కలయికలో వైరాగ్యానికి

గాక మరింకెవరికి ఆనందం కలుగుతుంది! రాముడిని పూల మాలాలంకృతుడిని చేసిన సీత వామభాగంలోనూ, లక్ష్మణుడు దక్షిణ భాగంలోనూ నిలవగా ఆ దృశ్యాన్ని చూసిన విశ్వామిత్రుడు దశరథుడి స్థానంలో నిలిచి ఉప్పొంగిపోయాడు. తన సాధనా తపస్సుల యొక్క ఫలితాన్ని ఇన్నాళ్లకు నిండుగా కనులారా చూసుకోగలిగాడు.

ఈర్ష్యతో రాముడిని, జనకుడిని బంధించి సీతను చేబడదామని సంసిద్ధ మౌతున్న రాజుల నుద్దేశించి ఆకాశవాణి వినిపించింది. "మూర్ఖుల్లారా ఐదువేల మంది పట్టినా లేపలేని ధనుస్సును విరిచిన వజ్రబాహుడు ఈ రాముడు అనే విషయాన్ని కన్నులారా చూస్తు కూడా అతడిని జయించ గలమనుకుంటున్నారా - భవిష్యత్తులో ఈయన తన వానరమిత్రులతో వెళ్లి జగజ్జేత అయిన రావణుని వధించబోతున్నాడు, అందుకు సీత నిమిత్తమై నిలిచి మాకు (దేవతలకు) సుఖాన్ని ఇచ్చేది కాబోతుంది. కనుక మీ ఈ దుష్ట ప్రయత్నాన్ని విరమించండి"

ఆకాశవాణి వినిపించగానే భయంతో దుష్టరాజులంతా తమ తమ రాజ్యాలకు వెళ్లి పోయారు. ఈ రాజుల దుష్టప్రయత్న సన్నివేశం అవాల్మీకం - ఇది మనకు ఆనందరామాయణంలోనూ, శ్రీరామచరిత మానసము మొదలైన రామాయణాలలో కనిపిస్తుంది. వీటి యొక్క బీజాన్ని శ్రీ నీలంకంఠాచార్యులవారు మనకు వేదాలలో చూపిస్తున్నారు.

అవతారిక:

శివధనుర్భంగం, స్వయంవరం పూర్తయినాయి. ఇక నా కర్తవ్య మేమిటి అని జనకుడు విశ్వామిత్రుడిని అడగగా ఆయన వివాహనిమిత్తమై బంధుమిత్రులతో రమ్మని దశరథమహారాజుకు ఆహ్వానం పంపమన్నాడు. మొత్తం అయోధ్యనగరవాసులందరితో కూడి వచ్చిన దశరథమహారాజు సమక్షంలో వివాహం సుసంపన్నమైంది. పసుపు బట్టలతో అయోధ్యకు వెళుతున్న రాముడికి పరశురాముడెదురొచ్చాడు. ఆయనపై విజయాన్ని సాధించిన రాముడిని దేవతలు స్తుతించారు. ఈ విషయాన్నే వేదమాత

35, 36 మంత్రాలలో మనముందుంచబోతోంది.

**35,36. మంత్రాలు:**

**గృభ్ణామి తే సౌభగత్వాయ హస్తం మయాపత్యా జర దష్టిర్యథాసః।**
**భగోఅర్యమా సవితాపురంధిర్మహ్యాం త్వా దుర్గార్హపత్యాయదేవాః॥**
(ఋగ్ 10-85-36)

**అయం స్తుతో రాజావన్ది వేధా అపశ్చ విప్రస్తరతి స్వసేతుః।**
**స కక్షీవన్తం రేజయత్సో అగ్నిం నేమిన్నచక్ర మర్వతో రఘుద్రు॥**
(ఋగ్ 10-61-16)

తనకు దానంగా ఇవ్వబడ్డ సీతను స్వీకరిస్తూ రాముడిలా అన్నాడు "నీవు సౌభాగ్యవతివై పతితో (నాతో) శోభించుదువుగాక, నేను నీ పాణిని గ్రహిస్తున్నాను. భగాది దేవతలు గృహస్థాశ్రమ ధర్మాచరణకొరకై నిన్ను నాకిచ్చారు''.

సీతను తీసుకొని అయోధ్యకు వెళుతున్న రాముడి ద్వారా పరశు రాముడు జయించబడటంతో దేవతలు ఇలా స్తుతించారు. " ఈ రోజు రాముడు మా (దేవతల) చేత పూజింపబడుతూ జమదగ్నిపై విజయాన్ని పొందగలడు (పొందాడు). సేతువును నిర్మించి సముద్రాన్ని జయించ గలడు. దశరథుడిచ్చిన దానాలతో సంతుష్టుడైన ఋషి (ఋష్యశృంగుడు) 'నీ పుత్రుడు సముద్రాన్ని జయించగలడు' అని వరమిచ్చాడు. ఆ తరువాత చరు(పాయస) రూపంలో ఈయనకు సంతానాన్ని కలగజేయడం కొరకు అగ్నిని ప్రేరేపించాడు. ఈ విధంగా కక్షీవాన్ ఋషి (ఋష్యశృంగుడి) ద్వారా ప్రేరితుడైన రఘు(రాముడు) రథచక్రంలాగా శీఘ్రగామియగుగాక.

మోహిక్కృత కృత్య కీన్హదుహుఁ భాఈః।
అబజో ఉచిత సోకహి అగొసాఈః॥

ఈ అన్నదమ్ములిద్దరూ (రామలక్ష్మణులు) నన్ను కృతకృత్యుడిని చేశారు. ఇప్పుడు నన్నేం చేయమంటారో చెప్పండి అన్నాడు విశ్వామిత్రుడితో జనక మహారాజు.

ఈ సంసారంలో చేయబడే ఏ కర్మ కూడా సంపూర్ణం కాదు. ఏ కర్మా పూర్తిగా అయిపోవడం అంటూ ఉండదు. వ్యక్తికి వాసనలు (సంస్కారాలు) ఉన్నంతవరకు అవి బుద్ధితో కోరికలను పుట్టిస్తూనే ఉంటాయి. ఆ కోరికలు మనస్సులో అలజడులు రేపుతూనే ఉంటాయి. ఆ అలజడులు శరీరాన్ని స్థిరంగా ఉండనీయక నిరంతరం కర్మలో ప్రవృత్తం చేయిస్తూనే ఉంటాయి. అలా చేసిన కర్మల వల్ల మళ్లీ సంస్కారాలు ఏర్పడతాయి, తిరిగి మళ్లీ కర్మచక్రం ప్రారంభమౌతుంది. దీనికి అంతం లేదు. కానీ కర్మఫలితాన్ని (ప్రత్యేక ఫలితాన్ని) ఆశించకుండా కర్తవ్య కర్మలను ఈశ్వరార్పణ బుద్ధితో చేసే కర్మయోగికి మళ్లీ సంస్కారాలు ఏర్పడవు.

అలా సంస్కారాలను అంతం చేసుకున్నవాడే జనకమహారాజు. కృత్యం అంటే కర్మ, కృతం అంటే చేయబడింది అని అర్థం. చేయవలసిన పనులన్నీ (నిస్స్వార్థ కర్మలు లేదా కర్తవ్యాలు) అయిపోతే ఈ కృతకృత్య భావం కనబడుతుంది. యజ్ఞం కొరకు భూమి దున్నడం అనే నిస్స్వార్థ కర్మ చేసేప్పుడు లభించిన సీతను రాముడికి సమర్పించడం అనే చివరి కర్తవ్యకర్మ చేయడంలో జనకుడికి కృతకృత్యభావం జనించింది. అప్పు డాయన "ఈ అన్నదమ్ములిద్దరూ నన్ను కృతకృత్యుడిని చేశారు. ఇక ఇప్పుడు నన్నేం చేయమంటారో చెప్పండి" అని విశ్వామిత్రుడిని ప్రశ్నించాడు.

ఇది చాలా విచిత్రమైన ప్రశ్న అన్ని కర్తవ్యాలు అంతమైన స్థితే కృతకృత్యత అయితే మళ్లీ ఇప్పుడు ఏం చేయాలి అనే ప్రశ్న ఎందుకు ఉదయిస్తుంది? అటువంటి స్థితికి చేరిన మహాత్ముడికి "తస్య కార్యం న విద్యతే" ఇక చేయవలసిన కర్మలే ఉండవు అని కృష్ణుడు అర్జునుడికి ఉపదేశం చేస్తూనే "నాకు మూడులోకాల్లోనూ చేయవలసిన కర్మగానీ, చేయడం వల్ల పొందవలసిన ఫలంగానీ ఏమీ లేకున్నా లోకసంగ్రహార్థం నిరంతర కర్మలో ప్రవృత్తుడిని అవుతూనే ఉన్నాను" అంటాడు.

87000 సంవత్సరాల తరువాత వినాశనం లేని శివుడు తన సమాధిని విడిచి కండ్లు తెరిచాడు.

అఖండమైన సమాధిని విడిచిన శివుడు పార్వతికి రామకథ చెప్పడం మొదలు బెట్టాడు. కేవలం తన మనస్సులో దాచుకున్న రామకథను సర్వజనహితార్థమై గంగానదిలాగా బైటికి పంపడం మొదలు బెట్టాడు.

గంగ బ్రహ్మదేవుడి కమండలంలో నివసించినప్పుడు ఉన్నత స్థానంలో ఉన్నది. "వివేకభ్రష్టానామభవతి విని పాతఃశతముఖే" ఒకసారి పతనమైనవాడు ఎన్ని ముక్కలయ్యేది (ఎక్కడికి చేరేది) ఎవరూ చెప్పలేనట్లు బ్రహ్మకమండలం నుండి విష్ణుపాదాలు, శివుడి శిరస్సు, ఉన్నత హిమలయాలు స్పృశించి క్రమంగా సముద్రపు ఉప్పునీటిలో కలిసి పోయింది అనిపిస్తుంది. కానీ తన ఈ శ్రేష్ఠస్థానాన్ని విడవడం వల్ల ఎంతోమంది పవిత్రులు కాగలిగారు. ఇదే లోకసంగ్రహం.

ఏదైనా సాధించడం కొరకు లేదా పొందడం కొరకు సాధారణ ప్రజలంతా బహిర్ముఖులౌతారు. కానీ కృతకృత్యులైన మహాత్ములు సాధించవలసింది గానీ పొందవలసిందిగానీ ఏదీ మిగిలిలేదు కనుక వారు కేవలం లోకకళ్యాణం కొరకే బహిర్ముఖులౌతారు.

నిజానికి శివధనుర్భంగానంతరం సీత రాముడికి వరమాల వేయడం తోనే వారి వివాహం జరిగిపోయింది. వారిని అలానే రథం ఎక్కించి అయోధ్యకు పంపించి వేయడంలో కూడా తప్పులేదు. కానీ జనకుడు అలా చేయక ఆ తరువాత తన కర్తవ్యం ఏమిటి అని విశ్వామిత్రుడిని అడిగాడు. అప్పుడు విశ్వామిత్రుడు "శివధనుర్భంగం పైనే వివాహం ఆధారపడి ఉంది. అది జరిగిపోయింది కూడా. అయినప్పటికీ కులవృద్ధుల, పెద్దల సలహా అనుజ్ఞలు తీసుకొని శాస్త్రానుగతమైన పద్ధతిలో ఆ తరువాత కర్తవ్యాన్ని గూర్చి ఆలోచించు, వివాహనిమిత్తమై తరలి రమ్మని దశరథమహారాజుకు వార్త పంపు" అంటాడు.

విశ్వానికి మిత్రుడు విశ్వామిత్రుడు లోకానికి మేలు చేసే విషయాన్ని

గూర్చే ఆయన ఆలోచిస్తూ ఉంటాడు. స్వయం వరం, గాంధర్వ వివాహం, రాక్షస వివాహం, పైశాచిక వివాహం మొదలైనవన్నీ శాస్త్రసమ్మతమైన వివాహాలైనప్పటికీ, మానవజాతి చరిత్రనంతటినీ పరిశీలించి చూసినట్లయితే శాస్త్రసమ్మతమైన వివాహపద్ధతులన్నీ అంతగా ఫలవంతమైనట్లు కనపడవు. శకుంతలాదుష్యంతుల విషయంలో అదే జరిగింది. పెద్దల అనుమతి, ఆశీస్సులు, సాక్ష్యాధారాలు లేని వివాహాలు ఏ పరిణామాలకు దారితీస్తాయో వారి విషయంలో మనకు అర్థమౌతుంది. అందుకే విశ్వామిత్రుడు సీతారామ కళ్యాణాన్ని వేదమార్గంలో చేయించమని జనకుడిని ప్రోత్సహించాడు.

అంతేకాదు "జన జీవ ఉరచారి అవస్థా విభున్వా సహిత బిరాజహి" వివాహమంటపంలో నలుగురు రాజకుమారులు తమ వధువుతో కలిసి నాలుగు అవస్థలు తమ అధిష్టాన దేవతలతో కలిసి వచ్చాయా అన్నట్లు కనిపించసాగారు. ఈ అద్భుత దృశ్యాన్ని మనకు సాక్షాత్కరింపజేయడానికే విశ్వామిత్రుడు జనకుడిని ప్రేరేపించి దశరథుడిని మిథిలకు రప్పించాడు. వసిష్ఠ విశ్వామిత్ర మహర్షుల ఉపదేశం మేరకు సీతారామకల్యాణానికే కృశకేతు (జనకుడి తమ్ముడు)కుమార్తెలైన మాండవి, శ్రుతకీర్తులను, జనకుడి చిన్న కుమార్తె అయిన ఊర్మిళను, భరత శత్రుఘ్న లక్ష్మణులకూ కూడా ఇచ్చి వివాహం చేయడానికి రాజులంతా సమ్మతించారు. వారి ఈ ప్రేరణ వల్లే మనకు ఈ అద్భుత దృశ్యం నయనారవింద మౌతోంది.

పైన చెప్పిన మాట కేవలం ఒక ఉపమానం మాత్రమే కాదు. సీత, మాండవి, శ్రుతకీర్తి, ఊర్మిళలు వరసగా తురీయ, స్వప్న, సుషుప్తి. జాగ్రదవస్థలు గాను, శ్రీరామ, భరత, శత్రుఘ్న, లక్ష్మణులు నలుగురూ నాలుగవస్థల విభావులైన బ్రహ్మ, ప్రాజ్ఞ, తైజస, విశ్వరూపులుగానూ కామతాపనీ ఉపనిషత్తులో వర్ణించబడ్డారు.

ప్రతి వ్యక్తి తన జీవితంలో ఈ మూడు అవస్థలకు లోనవుతూ వాటి అధిష్టాతగా ఆ మూడు రూపాలను పొందుతాడు. కానీ ఇవన్నీ ఒకే చోట ఒకేసారి సాక్షాత్కరించవు. మేల్కొని ఉండగా స్వప్నం చూడటం

సాధ్యం కాదు, నిదురపోతూ మేల్కొని ఉండలేము. ఇక నాలుగవ అవస్థ అయిన తురీయం మాత్రం సాధన చేసినప్పటికీ ఏ కోటిమందిలోనో ఒక్కరికి సిద్ధిస్తుంది. సమాధి స్థితిలో ఈ తురీయానుభూతి కలిగినప్పుడే వ్యక్తిలో ద్వైతబుద్ధి నశిస్తుంది. కానీ ఏ యోగీ నిరంతరం ఆ తురీయావస్థ లోనే ఉండడు. అందులో నుండి బైటికి వచ్చి తక్కిన మూడు అవస్థలకు లోనవుతూ ఉంటాడు. కానీ ఇతరులకు అతడికి ఒకటే భేదం అతడు అన్ని అవస్థలకు లోనవుతూ కూడా అన్నింటిలోనూ జాగరూకత కలిగి ఉంటాడు. అన్నింటి నుండి విడివిడి సాక్షిరూపుడై వీక్షిస్తూ ఉంటాడు. తక్కిన వారు వాటికి లొంగి స్మృతి కోల్పోయి (మద్యం) తాగినవారిలాగా మత్తులో జీవిస్తారు. ఒక్క జ్ఞానికి మాత్రమే ఈ నాలుగు అవస్థలు, వాటి అధిష్ఠాతల తో సహా ఒకేసారి సాక్షాత్కరించగలుగుతాయి. విశ్వామిత్రుడి కృపవల్ల అది ఈనాడు సర్వజన వీక్షణీయ దృశ్యమైంది. ఇదీ! లోకసంగ్రహమంటే.

లోకాచరణద్వారా ధర్మసంస్థాపన చేసే నిమిత్తం తాను జయించిన కన్యనే తిరిగి దానంగా స్వీకరించ సిద్ధపడ్డాడు కరుణామూర్తి శ్రీరామచంద్ర ప్రభువు, సీతమ్మ చేతిని తన చేతిలోకి తీసుకొని భగాది దేవతలు నిన్ను నాకు గృహస్థాశ్రమ ధర్మాచరణ కొరకై ఇచ్చారు అన్నాడు. మంత్రశాస్త్రంలో భగాది దేవతల ఆరాధన కనిపిస్తుంది. దాని మంత్రం "ఓం ఆం ఐం భగమాలిన్యై నమః" ఉత్తమ కన్యను భార్యగా పొందదలచిన వరులు ఈ మంత్రాన్ని అనుష్ఠిస్తారు. దీనివల్ల గృహస్థాశ్రమం ధర్మాచరణకే గాని భోగాచరణకు కాదు అని కూడా తెలుస్తోంది.

శ్రీరాముడి వివాహం అనేక రామాయణాలలో అనేక రకాలుగా వర్ణించబడింది. తులసీ రామాయణంలో మన్మథుడు (కామదేవుడు) వరుడి వేషంలో ఉన్న రామునికి వాహనంగా మారాడని, ఆ అందమైన తెల్లటి గుఱ్ఱాన్ని చూసి అంతా విస్మయం చెందారని వర్ణించబడింది. సాధారణంగా వధూగమనాభిలాషతో వరులంతా కామాతురులై మన్మథుడు తలకెక్కి కూర్చోగా అతడికి వాహనాలై వస్తారు, కామం అదుపులో

వారుంటారు- వారి అదుపులో కామం ఉండదు. కానీ ఇక్కడ ధర్మాచరణ నిమిత్తం గృహస్థాశ్రమ ధర్మాన్ని స్వీకరిస్తున్నా శ్రీరాముడు కామాన్ని తన అదుపులో ఉంచుకొని దానినే తన వాహనం చేసుకొని వచ్చాడని శ్రీతులసీ వర్ణిస్తాడు.

వాల్మీకి మరియు మరికొన్ని రామాయణాలలో, వివాహమై అయోధ్యకు వెళుతున్న రాముడికి పరశురాముడు ఎదురు వచ్చినట్లు గాను, మహావీర చరితం, అనర్ఘరాఘవం, రాజశేఖరరచిత బాలరామాయణం, మహానాటకం, ప్రసన్న రాఘవం, రామచరితమానసం, రామచంద్రిక ఆది గ్రంథాలలో మిథిలలోనే పరశురాముడి తేజోభంగమైనట్లుగా వర్ణన కనిపిస్తుంది. రాజశేఖరరచిత బాలరామాయణంలో రాముడి ఆజ్ఞతో లక్ష్మణుడే విష్ణుధనుస్సును ఎక్కుపెట్టగా అది చూసిన జనకుడు ఆయనతో ఊర్మిళా వివాహ ప్రసక్తి తీసుకు వచ్చినట్లుగా ఉంది.

వివిధ కథలలో ఎన్ని భేదాలు కనిపించినా అన్ని రామాయణాల లోనూ పరశురామ పాత్ర దర్శనమిస్తుంది. అందుకు మూలం ఋగ్వేదం లోనే మనకు శ్రీ నీలకంఠాచార్యులవారు చూపిస్తున్నారు. ఆకాశం నుండి పరశురాముడిపై రాముడు విజయం సాధించిన ప్రక్రియను చూసిన దేవతలు రామచరిత్రలో ఋష్యశృంగుడి చేత నిర్ణయించబడిన భవిష్యత్ సంఘటనలలో ఒకటి సత్యమవడాన్ని గ్రహించి తక్కినవి కూడా నిజమౌతాయనే ధైర్యం పెరగగా శ్రీరాముడు రథచక్రంలాగా శీఘ్రగామియై రావణవధ ద్వారా మాకు ఆనందాన్ని కలిగించుగాక అని స్తుతిస్తున్నారు.

శ్వేతాశ్వతర ఉపనిషత్తులో పరమాత్మను చక్రంలాగా ఉపాసించే విధానం ఇవ్వబడంది.

మం॥ తమేక నేమిం త్రివృతం షోడశాంతం
శతర్ధారం వింశతి ప్రత్యరాభిః।
అష్టకైష్షడ్భి ర్విశ్వరూపైక పాశం
త్రివర్గ భేదం ద్వినిమిత్తైక మోహమ్॥

ఆయనకు ఒకే నేమి (చక్రం చుట్టూ బిగించే ఇనప పట్టా) మూడు వృత్తాలు (ఆవరణలు-త్రిగుణాలు) పదహారు అంతాలు, యాభై అరలు (ఆకులు), ఇరవై ప్రత్యరలు (చక్రం ఆకుల బిగువు కొరకు వేయబడ్డ కీలకాలు) ఆరు అష్టకాలుగాను, నానావిధ రూపాలుగా గల కాలమనే పాశాలు కలవాడు ధర్మ అధర్మ జ్ఞానమనే మూడు బేదాలు గలవాడు, రెండు రకాల మోహాలు గలవాడు. ఆ పరమాత్మ, పంచభూతాలు, పంచ జ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు, మనస్సు వెరశి 16 అంతాలు. ఐదు విపర్యాయాలు, 28 అశక్తులు, 9 రకాల తుష్టి, 8 సిద్ధులు వెరసి, 50 అరలు. అవి ఏమిటంటే 1. తపస్సు: అనాత్మలైన అష్టవిధ ప్రకృతిలో ఆత్మబుద్ధి నుంచడం. 2. మోహం: అణిమాది సిద్ధులలో గల ప్రీతి, 3. మహామోహం: శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలలో గల అభినివేశం (నేను విన్నాను, చూశాను గనక సత్యం అనడం) 4. తామిస్రం : ఈ ఐదు ఇంద్రియాలలో అష్టసిద్ధులను పొందడం కొరకు ప్రయత్నిస్తున్నప్పుడు అవి లభింపకపోవడం వల్ల క్రోధం 5. అంధతామిస్రం : ఒక వేళ కొంత సాధన తరువాత ఆ అష్టసిద్ధులు లభిస్తే వాటిని అనుభవించేప్పుడు మరణం ఆసన్నమయినప్పుడు అయ్యో కష్టపడి సంపాదించుకున్న వీటిని పూర్తిగా అనుభవించకుండానే నాకు మరణం ఆసన్నమైందే అని దుఃఖించడం - ఇవి 50 అరలలోని ఐదు విపర్యయాలు.

ఇక అశక్తులు, పంచజ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, మనస్సులలో గల అశక్తులు (చెవులు వినపడక, కండ్లు కనపడక ఉండటం మొ॥) ఉంటాయి. అంతఃకరణంలో పురుషార్థ యోగ్యతా తుష్టి లేకపోవడమనే అశక్తులు 9 రకాలుగా ఉంటాయి. అష్టవిధ సిద్ధులు పొందడంలో అశక్తత వెరసి మొత్తం 28 రకాలు అశక్తులు ఉన్నాయి.

ఇక తుష్టి-(ప్రకృతి, ఉపాదాన, కాల, భాగ్య అని నాలుగు విధాలుగా ను, విషయోపరమతుష్టి - ఆర్జన, రక్షణ, విషయ, సంగ, హింసలను దోషదర్శనం చేత ఐదు విధాలుగా లేకపోవడం కలసి మొత్తం తుష్టి 9 రకాలుగా ఉంటుంది.

1. ప్రకృతి తుష్టి:- ప్రకృతి పరిజ్ఞానం కలిగినంత మాత్రాననే కృతార్థుడ నైనానని తలచి తుష్టిపొందడం.

2. ఉపాదాన తుష్టి:-సన్యాసాశ్రమం స్వీకరించినంత మాత్రాననే కృత కృత్యుడ నైనానని తుష్టి పొందడం.

3. కాలతుష్టి:- వీటన్నిటి వల్ల మన కొరిగే దేమిటి? మనకు మోక్షం రావలసి ఉంటే అదే వస్తుంది అని కాలానికి వదిలేసి ఉపేక్షించి ఊరుకోవడం.

4. భాగ్యతుష్టి:- ఏం చేసినా ఏమీ ప్రయోజనం లేదు. మోక్షం పొందే భాగ్యం మనకు ఉంటే అదే లభించగలదు అని తృప్తి పొంది ఊరుకోవడం.

5. రక్షణ తుష్టి : సంపాదించడమే కష్టం, ఒక వేళ సంపాదించినా దాన్ని పోకుండా నిలుపుకోవడం మరింత కష్టం అనుకొని ఆ ప్రయత్నం నుండి విరమించడం.

6. విషయ తుష్టి : మనం కష్టపడి సంపాదించిన దాని కన్నా ఎక్కువగా సంపాదించాల్సింది ఉంది, అది ఇంకా లభించలేదే అనే దుఃఖం కలగడంతో ఆ ప్రయత్నం విరమించడం.

7. సంగ తుష్టి : విషయ సుఖాలు ఎంత అనుభవించినా తృప్తి కలగదు కనుక నా కసలు విషయసుఖాలే వద్దని ఊరుకోవడం.

8. హింసా తుష్టి : ఒకరిని కష్టపెట్టక భోగం లభించదు, ఇంకొకరిని పీడించడం అధర్మం, అధర్మం వల్ల నరకం లభిస్తుంది కనుక నాకీ భోగాలే వద్దనడం.

ఇక అష్ట సిద్ధులు:

1. ఊహా సిద్ధి : పారమార్థికార్థం తెలుసుకునే కోరిక కలిగి దాని కొరకు ప్రయత్నిస్తుండగా జన్మాంతర సుకృతం చేత, సంస్కారబలం చేత, గురూపదేశం లేకుండానే యథార్థజ్ఞానం కలగడం.

2. శబ్ద సిద్ధి : నిరంతరాభ్యాసం లేదా కొద్దిగా సత్ సత్యశ్రవణం చేతనే జ్ఞానం పొందడం.

3. అధ్యయన సిద్ధి : నిరంతరాధ్యయనం వల్ల కలిగే జ్ఞానం.

4. ఆధ్యాత్మిక సిద్ధి : 5. ఆదిభౌతిక సిద్ధి : 6. ఆధిదైవిక సిద్ధి : ఈ త్రివిధ దుఃఖాలలో ఉదాసీనుడై ఉండటం వల్ల శీతోష్ణాది ద్వంద్వాలకు అతీతుడై త్రివిధ జ్ఞానం కలగడం.

7. సుహృత్సిద్ధి: మిత్రుడి మూలకంగా జ్ఞానం కలగడం.

8. దానసిద్ధి: ఆచార్యుడికి ఇష్టమైన వస్తువేదో గ్రహించి అది ఆయనకిచ్చి ఆయనను తృప్తిపరచి ఆయన ద్వారా జ్ఞానాన్ని పొందడం.

ఇవి ఐదు విపర్యాయాలు, 28 అశక్తులు, 9 రకాల తుష్టి 8 సిద్ధులు వెరసి చక్ర రూప భగవానుడిలో 50 అరలు (ఆకులు) ఏర్పడతాయి.

ఇక 20 ప్రత్యరలు, ఐదు కర్మేంద్రియాలు, ఐదు జ్ఞానేంద్రియాలు కలిపి 10, వాటి విషయాలు 10 మొత్తం 20 ప్రత్యరలు.

చక్రరూప భగవానుడిలో ఇక మిగిలిన ఆరు అష్టకాలు.....

1. ప్రకృత్యష్టకము 2. ధాత్వష్టకము 3. ఐశ్వర్యాష్టకము, 4. భావాష్టకము, 5. దేవాష్టకము, 6. ఆత్మ గుణాష్టకము.

1. ప్రకృత్యష్టకము : పంచభూతాలు, మనసు, బుద్ధి, అహంకారం అనేవి ప్రకృత్యష్టకం.

2. ధాత్వష్టకము : చర్మము, త్వక్, మాంసము, రక్తము, మేధస్సు, అస్థి, మజ్జా, శుక్లము - ఇది ధాత్వష్టకము.

3. ఐశ్వర్యాష్టకము : అణిమ, మహిమ, గరిమ, లఘిమా, ప్రాప్తి, ప్రాకామ్యం, ఈశిత్వం, వశిత్వం వెరసి ఐశ్వర్యాష్టక మౌతుంది.

4. భావాష్టకం : ధర్మం, జ్ఞానం, వైరాగ్యం, ఐశ్వర్యం, అధర్మం, అజ్ఞానం, అవైరాగ్యం, అనైశ్యర్యము. ఈ ఎనిమిది భావాష్టకంగా చెప్పుకోబడతాయి.

5. దేవాష్టకం : బ్రహ్మ, ప్రజాపతి, దేవ, గంధర్వ, యక్ష, రాక్షస, పితర, పిశాచాలు వెరసి దేవాష్టకం అనబడుతుంది.

6. ఆత్మ గుణాష్టకం : దయ, క్షాంతి, అనసూయ, శౌచం, అనాయాసం, మంగళము, అకార్పణ్యాం, అస్పృహ మొదలైనవాటిని ఆత్మగుణాష్టకం అంటారు.

ఎవరైతే ఒక నేమి, మూడు వృత్తాలు, పదహారు అంతాలు, యాభై అరలు, ఇరవై ప్రత్యరలు, ఆరు అష్టకాలుగా వ్యాపించి ఉన్న భగవానుడిని చక్రరూపంలో ఉపాసిస్తారో వారికి ఈతి బాధలు తొలగిపోయి, సాధన పురోగమించి ముక్తిని పొందుతారు. ఇది ఉపనిషత్ ద్రష్టలు సూచించిన ఉపాసనా మార్గం.

ఇటువంటి చక్రరూప రఘురాముడు శీఘ్రగామియై మా కష్టాలను తొలగించుగాక అని దేవతలు స్తుతించారు.

అవతారిక :

36వ మంత్రం వరకు బాల కాండ కథాభాగాన్ని పూర్తి చేసిన వేదమాత 37వ మంత్రంలో "ధర్మసేతు" రూపుడైన శ్రీరాముడు తన ఈ లీలల ద్వారా రామరాజ్యస్థాపన చేసిన రహస్యవృత్తాంతాన్ని చెప్పబోతోంది.

**37. మంత్రం :**

**స ద్విబన్ధు ర్వైతరణో యష్టా సబర్ధుం ధేనుమస్వం దుహధ్యై।**
**సం యన్మిత్రావరుణా వృంజ ఉక్థైర్జ్యేష్ఠేభి రర్యమణం వరూథైః॥**

(ఋగ్ : 10-61-17)

ఆ రాజు పరస్పర విరోధులైన వసిష్ఠ, విశ్వామిత్రులకు బంధువు. వసిష్ఠుడు వైతరణ దాత, విశ్వామిత్రుడు యజ్ఞకర్త. వసిష్ఠుడి వద్ద ఉన్న గోవు బదులు విశ్వామిత్రుడు కోట్ల కొద్దీ గోవులనిచ్చాడు (ఇవ్వబోయాడు) కానీ వసిష్ఠుడు వాటిని స్వీకరించలేదు, తన గోవు నివ్వలేదు. విశ్వామిత్రుడాయనకు అనేక దుఃఖాలు కలుగజేశాడు, కాని వసిష్ఠుడి యోగ ప్రభావం వల్ల ఉత్పన్నమైన సేన ద్వారా ఆయన పరాజితుడైనాడు.

పరమాత్మ శ్రీరాముడై ఈ భూమిపైన అవతరించడానికి గల కారణమేమిటి? ఈ ప్రశ్నకు జవాబు 'ధర్మ సంస్థాపన' అని వస్తుంది. మరి శ్రీరాముడు జన్మించేసరికి భూమి మీద అవతార పురుషులు గానీ, మహాత్ములు గానీ లేకపోయారా? ఉండి ఉంటే మరి వారి వల్ల ఎందుకని ధర్మ సంస్థాపన జరగలేదు? నిజానికి రామావతార కాలంలోనే శ్రేష్ఠులైన వ్యక్తులెందరో ఉన్నారు.

శక్తికి పరాకాష్ట అయిన పరశురామావతారం ఉంది. వసిష్ఠ విశ్వామిత్రాది ఋషు లున్నారు. వారి తపోశక్తి యొక్క వర్ణన పురాణాలలో ఎంతో కనిపిస్తుంది. దశరథ మహారాజు లాంటి శక్తి మంతులు, జనకుడి లాంటి జ్ఞానులు అయిన రాజులున్నారు. ఇంత మంది ఉండి కూడా సమాజం యొక్క సమస్యకు జవాబు కనిపించలేదు. భూభారం తగ్గలేదు. (పరశు రాముడి చేత ఇంతమంది రాజులు సంహరించబడినా కూడా) అందుకే భూదేవి విష్ణుమూర్తిని అవతరించమని ప్రార్థిస్తూ వెళ్లింది. శ్రీ రాముడిగా పరమాత్మ అవతరించాడు. మరి ఎవరికీ సాధ్యం కాని ఈ ధర్మ సంస్థాపన కార్యాన్ని ఆయనెల సాధించాడు? తక్కిన వారిలో ఉన్న లోపం ఏమిటి?

అన్నిటికన్నా ముఖ్యమైన విషయం ఏమిటంటే దుర్గుణాలన్నీ సంఘటితమై పనిచేస్తున్నాయి. సద్గుణాలన్నీ పరస్పరం విడిపోయి ఉన్నాయి. ఇది ఈ సమాజం యొక్క శాశ్వత సత్యం. మంచి ఆచరణ, చక్కని విచారణ గల ప్రజలు ఏకత్రితం కాలేరు. అంతర్గతంగా కూడా మంచి ఆలోచనలన్నీ ఏకమై కార్యరూపాన్ని ధరించలేవు. దీన్నొక అవకాశంగా చేసుకొని దుర్విచారాలన్నీ శక్తిమంతమై అధికారాన్ని చేజిక్కించుకుంటాయి. ఒకసారి ఇది జరిగిన తరువాత ఈ మంచివారు మంచి చేద్దామనే ఆలోచన కలిగి ఉండి కూడా ఏమీ చేయలేక పోతారు. ఈ వ్యావహారిక జీవన సమస్యే అన్ని కాలాలలోనూ ఉంటూ వచ్చింది.

కానీ అసలు ప్రతిసారీ ఇలాగే ఎందుకు జరుగుతుంది? దీని వెనుక ఒక మనోవైజ్ఞానిక సత్యం దాగున్నది. అదేమంటే సద్గుణాలలోనూ,

సద్గుణవంతులలోనూ ప్రదర్శనాపేక్షత ఉంటుంది. కానీ, ఈ ప్రవృత్తి దుర్గుణాలలోనూ, దుర్గుణవంతులలోనూ కనిపించదు. ఈ విషయం వినడానికి విచిత్రంగా ఉంటుంది కానీ ఇది సత్యం. సద్గుణాలు పైకి కనిపించినప్పుడే సన్మానించబడటం జరుగుతుంది, దుర్గుణాలు దాగి ఉన్నప్పుడే అవి మనగలుగుతాయి.

ఇక సమీకరణంలోని మూల సూత్రం ఏమిటంటే "తమను తాము విలీనం చేసుకోవడం". ప్రతివ్యక్తి తానే నాయకుడవుదామని ప్రయత్నిస్తే సంఘర్షణ తప్పదు. ఎంత సద్గుణవంతుడిలో కూడా సన్మానాపేక్ష, నలుగురిలోనూ గుర్తించబడాలనే అహంకారం కొంచమన్నా ఉంటుంది. కనుక ప్రతి సద్గుణవంతుడు నాయకుడౌదామని చూస్తాడు. దానితో సంఘర్షణ, దాని వల్ల ఏకం కాలేకపోవడం జరుగుతుంది. దుర్గుణమేది ప్రదర్శించబడి పూజలందుకోలేదు. తాను చెప్పేది సత్యమైనా అసత్యమైనా ఇతరులు స్వీకరించాలని ప్రతివారు కోరుకుంటారు. అందుకే సత్యవాది కూడా తాను చెప్పిన సత్యం సత్యమేనని నిరూపించ ప్రయత్నిస్తాడు. అసత్యవాది కూడా తాను చెప్పిన అసత్యాన్ని - సత్యం క్రింద నిరూపించ ప్రయత్నిస్తాడు. అంతేకాదు ఇతరులతో అసత్యం చెప్పేవాడు, ఇతరులను మోసం చేసేవాడు, ఇతరుల వస్తువులను దొంగిలించేవాడు కూడా ఇతరులు తనతో సత్యమే చెప్పాలని, ఇతరులు తనను మోసం చేయగూడదని, ఇతరు లెవరూ తన వస్తువులు దొంగిలించకూడదని కోరుకుంటాడు. చెల్లని వంద రూపాయల నోటును మార్చే వ్యక్తి తనకు ఇవ్వబడ్డ చిల్లర నోట్లు అన్నీ చెల్లుతాయో లేదోనని చూస్తాడు.

కనుక సత్యం, ధర్మం పేరుతో ప్రపంచంలో ప్రచారమయ్యేదానిలో ఎంత కల్తీ ఉందో తెలుసుకొని దాన్ని విడదీయడం చాలా కష్టమౌతుంది. గొప్ప పనిగా గానీ, సద్గుణంగా గానీ పేరు మోస్తున్నది సామాన్యంగా అహంకార ప్రదర్శనేగానీ సత్యం మాత్రం కాదు. ఒక వ్యక్తి కొన్ని గంటలపాటు సైకిల్ మీద మైదానంలో గిరగిరా తిరిగితే అది పత్రికలో

వార్తగా మారుతుంది. కానీ అంతే సమయంలో ఇంకొక వ్యక్తి సైకిల్ మీద వేరొకచోటికి వెళితే అదివార్తగా మారదు. నిజానికి మైదానంలో తిరిగిన వ్యక్తి ఒక గమ్యమంటూ లేదు కానీ అది శక్తి సామర్థ్యాల ప్రదర్శన కనుక ప్రాముఖ్యతను పొందింది. రెండవ దానికి ఒక గమ్యముంది కానీ ప్రదర్శన లేని కారణాన అది ప్రాముఖ్యతను సంతరించుకోలేదు. సద్గుణాల యొక్క గమ్యం పరమాత్మ యొక్క ప్రాప్తి అయినప్పుడు అందులో గోపనీయత ఉంటుంది. కానీ సద్గుణవంతుడికి సన్మానం గమ్యంగా మారినప్పుడు, సన్మానమే గుర్తుంటుంది గాని సద్గుణం గుర్తుండదు. కనుక క్రమంగా సత్యం స్థానాన్ని అహంకారం ఆక్రమిస్తుంది. అప్పుడు అహింసకుడి దృష్టి అహింసమీద కన్నా ఎక్కువగా అహింసకుడిగా గుర్తింపబడాలనే కోరికపై ఉంటుంది.

తీనికాల త్రిభువన మతమోరే।
పున్యసిలోక తాత తరతోరే॥

మూడు కాలాలలోనూ మూడు లోకాలలోనూ నిన్ను మించిన పుణ్యాత్ముడు లేడయ్యా, ఓ భరతా! అంటాడు శ్రీరామచంద్రుడు.

సత్యానికి రెండు రూపాలున్నాయి. ఒకటి ఇతరులకు గానీ తనకు గానీ జీవదానం చేసేది. రెండవది అహంకారంతో ప్రదర్శింపబడేది. రెండవ దానికి సమాజం సన్మానాన్నిస్తుంది. మొదటి దానిని అసలులోకం గుర్తించ లేదు.సత్యానికి ప్రతి రూపంగా హరిశ్చంద్రుడు, ధర్మరాజు తీసుకోబడతారు గాని రాముడు, కృష్ణుడు తీసుకోబడరు. నిజానికి రాముడి, కృష్ణుడి జీవితంలోని సత్యవాక్పరిపాలనే ఉత్తమమైంది కూడా. శుక్రాచార్యుడు ప్రతిపాదించినట్లు ఒక్కొక్కసారి చెప్పబడిన అసత్యం (వారి జాక్షులందు వైవాహికములందు...) సత్యం కన్నా విలువైనది.

ధర్మరాజుకు కూడా సత్యవాక్పరిపాలనపై కంటే, తాను సత్యవాక్ పరిపాలకుడిగా పొందిన పేరు జారిపోగూడదనే చింతే ఎక్కువగా కనిపిస్తుంది. అశ్వత్థామ చనిపోయాడని తాను చెప్పింది అసత్యమని తనకు

తెలుసు.ఆ పేరుతో ఉన్న ఏనుగు చనిపోవడం తానెరుగును. కానీ లోకంలో గుర్తింపుకోసం అసత్యం చెప్పికూడా తప్పించుకుందామని చూస్తాడు. కానీ అదే భారతంలో చివరికి కృష్ణుడు "జీవితంలో నేను అసత్యాన్ని ఆశ్రయించని వాడినైతే ఈ బాలకుడు జీవితుడగుగాక" అంటూ స్పృశిస్తే మృతశిశువు పరీక్షిత్తు జీవితుడౌతాడు. కృష్ణుడు అనేక అబద్ధాలాడాడని అందరికీ తెలుసు. అటువంటప్పుడు ఇదెలా సాధ్యమైంది. హరిశ్చంద్రుడికి గానీ, ధర్మరాజుకు గానీ సత్యవాక్పరిపాలనవల్ల ఇంత శక్తి ఎందుకు కలగ లేదు?

కురుక్షేత్ర సంగ్రామంలో తాను శస్త్రం పట్టనని ప్రతిజ్ఞ చేసిన కృష్ణుడు, భీష్ముడి ప్రతిజ్ఞ నెరవేర్చడం కొరకు శస్త్రం పడతాడు. కృష్ణుడికి సత్యము, అహంకార పర్యాయవాచక పదాలైతే ఆయన శస్త్రం తీసేవాడే కాదు. ప్రజలు సత్యం జయించాలనరు. నా సత్యం జయించాలంటారు. ఇక్కడ వ్యక్తిగతమైన అహంకారం కనిపిస్తుందే గానీ సత్యం కనిపించదు.

రాముడిది కృష్ణుడిది భావాత్మకమైన సత్యమేగాని శబ్దాత్మకమైన సత్యంకాదు. సమష్టి క్షేమాన్ని, వ్యక్తి యొక్క క్షేమాన్ని కోరేది సత్యం. "ఏ బాణంతోనైతే నేను వాలిని కూల్చానో ఆ బాణంతోనే రేపు సుగ్రీవుడిని కూడా చంపుతాను" అంటాడు రాముడు లక్ష్మణుడితో అన్నమాట ప్రకారం సీతాన్వేషణా తత్పరుడు కాకుండా సుఖభోగాలలో మునుగుతున్న సుగ్రీవుడి గురించి. కానీ అలా జరగలేదు. మరి రాముడు మాట తప్పినట్లేనా? కాదు వాడి తమోగుణం వదలగొట్టి కర్తవ్యపాలనలో పెట్టడం అనేది ఆ మాట వెనకనున్న భావం. ఆ పని పూర్తయినప్పుడు కేవలం శబ్దాల వెనక వెళ్లి అన్నమాట నిలబెట్టుకోవడం కొరకైనా నేను నిన్ను చంపాల్సిందే ననడం మూర్ఖత్వం కాదా? ఇది ఎలాగుందంటే "నాలుగు రోజుల తరువాత ఆపరేషను చేసి నీ పుండును తొలగిస్తాను" అన్నా డనుకోండి ఒక డాక్టరు, కానీ వాడి అదృష్టం బాగుండి మూడో రోజుకే ఆ పుండు చాలా బాగా తగ్గిపోయింది. "తగ్గుముఖం పట్టినా సరే నేను

ఆపరేషను చేసి అన్నమాట నిలుపుకుంటాను" అనే డాక్టరు సత్యవాక్పరి పాలకుడనాలా, మూర్ఖుడనాలా?

ఈ దేశంలో సత్యం పేరుతో అహంకారానికే ఎక్కువగా పూజ జరుగుతూ వచ్చింది. అందుకే నా చేత సత్యం, ధర్మం ప్రతిష్ఠించబడాలి, లేదా లేకున్నా ఫరవాలేదు గానీ అది ఇంకెవరి వల్లనో కాగూడదు. అనే వైయ్యక్తి కాహంకారమే సన్మార్గులలో ఎక్కువగా కనిపిస్తుంది. ఇందుకు పూర్తి వ్యతిరేకత దుర్మార్గులలో కనిపిస్తుంది. ఎందుకంటే అందులో ప్రకటించబడటం కన్నా దాపరికమే ఎక్కువగా ఉంటుంది కనుక. అందుకే ఒక దుర్మార్గుడిని తక్కిన దుర్మార్గులంతా నాయకుడిగా పెట్టుకోవడానికి ఎవరికీ అభ్యంతరం ఉండదు. ఇంకొక విషయమేమిటంటే సన్మార్గులలో అహంకార కారణంగా వ్యక్తిగత గుర్తింపునకు ప్రాధాన్యత ఇవ్వడం జరుగుతుంది గనుక వ్యక్తిగత జీవితంలో భద్రత భోగాపేక్ష మొదలైనవి ఉంటాయి. దుర్మార్గులలో సమష్టిబలం ఉంటుంది కనుక వారు తమ వ్యక్తిత్వాలను మరచి గుంపులో ఒకరై దౌర్జన్యానికి దిగగలరు. తాము కేవలం సంఘటితంగా ఉంటేనే మనగలమని వాళ్లు గుర్తిస్తారు.

అసత్యంగానీ, అధర్మంగానీ గెలవడానికి పూర్ణత్వం అవసరం లేదు. కానీ సత్యమైనా ధర్మమైనా గెలవాలంటే అవి పూర్ణమై తీరాలి. ఒక కిలో నెయ్యి స్వచ్ఛంగా శుద్ధంగా ఉండాలంటే అందులో ఏమాత్రమైన వేరే వస్తువు కలవకూడదు. కానీ అశుద్ధమైన నెయ్యి ఒక చుక్క అందులో కలిసినా ఆ మొత్తం కిలో నెయ్యి అశుద్ధమైపోయినట్లే లెక్క. అందుకే రామావతార సమయం వరకు ధర్మాత్ములు, శక్తివంతులు, సత్యవంతులుగా పేర్కొనబడే వారి వల్ల ధర్మసంస్థాపన కాలేదు. అంటే వారిలో పూర్ణత్వం లోపించింది అనవలసివస్తుంది. ఒకవేళ ఎవరైనా (పరశురాముడు మొ॥) సర్వశక్తిమంతులుగా కనిపించినా అది కేవలం ప్రదర్శన అనవలసివస్తుంది. తన పరశుకు (గొడ్డలికి) ఎదురులేదని నిరూపించడం కొరకు ఏ తప్పు చేయని అనేకమంది క్షత్రియులను బలిపెట్టిన పరశురాముడు దానిని

రావణాసురుడి మీద మాత్రం ప్రయోగించ లేదు. ఒకవేళ రావణుడు బ్రాహ్మణుడు కనుక ఆ పని చేయలేదు అనేట్లయితే మరి జన్మతః క్షత్రియుడైన విశ్వామిత్రుడిని ఎందుకు విడిచిపెట్టినట్లు అనే ప్రశ్న వస్తుంది. ఇంత శక్తిమంతుడు కూడా తన వ్యక్తిగతమైన పగను చల్లార్చుకోవడం కొరకు తన శక్తుల నుపయోగించాడేగాని సమష్టిక్షేమం కొరకు ఉపయోగించ లేదు. ఒక వేళ రావణ సంహారానికి ఆయన శక్తిగురించి ప్రతిచోట చెప్పుకున్న మాటలు (ఇటు త్రేతాయుగం నుండి ద్వాపర యుగం వరకు) అన్నీ బీరాలు (గొప్పలు) మాత్రమే అనవలసివస్తుంది.

లోకరీతి అంతే, వస్తువుగానీ, వ్యక్తిగానీ సరియైన ప్రదర్శన, ప్రచారం లేకపోతే వారెంత గొప్పవారైనా ఈ లోకంలో గుర్తించబడరు. కానీ ప్రచారం చేయగలగితే చాలు ఎంతపనికిరాని వస్తువైనా ప్రసిద్ధిని పొందుతుంది. కాబట్టి లోకంలో ధర్మాత్ములుగా ప్రచారం పొందిన వారిలో పూర్ణత్వం లోపించడం, ఉన్నవారంతా వ్యక్తిగత అహంకారం కారణంగా ఏకత్రితం కాలేకపోవడంతో రామావతార సమయం వరకు ధర్మ సంస్థాపన జరగలేదు.

ఇది ఇలా ఉంటే మరొక ప్రక్క రాక్షసులంతా లంకలో కలిసి ఉండగలుగుతున్నారు. అంతకు ముందు లంకను పాలించిన దేవతలు గానీ, యక్షులుగానీ నిరంతరం తమ నాయకుణ్ణి(రాజును) మార్చుకునే వారు. కానీ రాక్షసులకు మాత్రం కేవలం రావణుడే రాజుగా ఉన్నాడు. అందుకు కారణమేమిటి? రావణుడు లంకను ఆక్రమించిన మరుక్షణం మొత్తం ధనసంపత్తినంతా రాక్షసుల కందరికీ పంచి పెట్టాడు. కేవలం తనకొరకే దాచి పెట్టుకోలేదు. దొంగతనం అధర్మమే, కానీ దొంగిలించుకు వచ్చిన సొమ్మును మాత్రం పంచుకోవడంలో ఏ మాత్రం పరస్పరం మోసగించు కోరు, ధర్మమార్గంలో పంచుకుంటారు. రావణుడు రాక్షసు లందరికీ వారి అర్హతను బట్టి ఇండ్లు కేటాయించాడు. ఈ విషయం తెలిసి ప్రపంచం నలుమూలల నుండి రాక్షసులు వచ్చి అతడితో చేరి పోయారు. రావణుడు వాళ్లందరినీ సంతోష పెట్టాడు. ఎక్కడి నుండి

ధనరాసులు కొల్లగొట్టు కొచ్చినా వాటిని వెంటనే పంచిపెట్టేవాడు. అతడితో యుద్ధాలకు వచ్చి వ్యక్తిగతంగా ఎవరన్నా ఏదైనా దోచుకు వస్తే అది వాళ్లనే ఉంచుకోనిచ్చాడు.

మంచి వాళ్లుగా చెప్పుకోబడేవారు ఇందుకు వ్యతిరేకం. వారు అంతా వ్యక్తిగతంగా మంచిపనే చేద్దామని చూస్తూ ఉంటారు. కానీ ఒకరి ఆదర్శాలు ఇంకొకరికి కలవవు. ఒక వేళ వారు కలసి పని చేద్దామని చూసినా అహంకార కారణంగా ప్రతివారూ తమ పద్ధతిలోనే తక్కిన వారు పనిచేయాలంటారు. చివరికి ఎవరన్నా ఉన్నత స్థానానికి చేరి మంచి పేరు తెచ్చుకున్నా, ఆ ఫలాన్ని ఇతరులతో కలసి పంచుకోవడానికి ఇష్టపడరు. అంటే రాక్షసుల కర్మ అధర్మమార్గంలోనూ ఫలం పంచుకోవడం ధర్మమార్గం లోనయితే- మంచివారి పని, ఫలం ఇందుకు పూర్తి విరుద్ధంగా ఉంటుంది.

సూర్యవరుణుల వీర్యం నుండి జన్మించినవారు వసిష్ఠ, అగస్త్య మహర్షులు. ఈయన మొదట ఇటు రఘువంశానికి అటు విదేహవంశానికి కూడా పురోహితుడిగా ఉండేవాడు. ఇక్ష్వాకు మహారాజు నుండే ఈ రెండు వంశాలు వచ్చాయి. ఇక్ష్వాకు పెద్దకుమారుడైన వికుక్షి నుండి రఘువంశము, మూడవ కుమారుడైన నిమి నుండి విదేహ వంశము వచ్చాయి. ఒకనాడు నిమి మహారాజు ఒక యజ్ఞం చేయదలచి వసిష్ఠుల వారిని పురోహితుడిగా ఉండమన్నాడు. ఆయన ఇంద్రుడి యాగం చేయించివస్తానని వెళ్లాడు. మరణం ఎప్పుడు ఆసన్నమవుతుందో తెలియదు. మంచి కార్యాలు వెంటనే చేయాలని తలచి ఆయన గౌతముడిని పురోహితుడిగా ఉంచుకొని యాగం చేయించుకున్నాడు. ఇంద్రుడి యాగం నుండి తిరిగి వచ్చిన వసిష్ఠుడికి కోపం వచ్చి నిమిని చచ్చిపొమ్మని శాపం ఇచ్చాడు. నిమి కూడా వసిష్ఠుడికి అదే శాపం ఇచ్చాడు. నిమి శరీరాన్ని మూలికా రసాలలో దాచి ఉంచి గౌతముడు యాగం పూర్తి చేశాడు. ఆహుతులు స్వీకరించడానికి వచ్చిన దేవతలను ఆయన్ను బ్రతికించమని కోరగా నిమి అందుకు సమ్మతించ లేదు. ఆయన శరీరం లేకుండానే అందరి కండ్లలో నివసించడం మొదలు

బెట్టాడు. ఆయన బరువు వల్లే రెప్పలు మూసుకోని పోయినప్పుడు దానిని నిముషం అంటారు. నిమి శరీరాన్ని మథించగా పుట్టినవాడే మిథిలేశుడు (మథించగా పుట్టినవాడు). శరీరంలేని నిమి కారణంగానే ఆ వంశాన్ని విదేహ అని పిలిచారు. ఆ సింహాసనాన్ని అధిరోహించిన రాజులందరూ జనకులుగాను, మిథిలేశులుగాను. విదేహులుగాను పిలవబడ్డారు.

ఇక శరీరాన్ని పోగొట్టుకున్న వసిష్ఠుడు బ్రహ్మను ప్రార్థించగా ఆయన తిరిగి సూర్యవరుణుల వీర్యం వల్ల పుట్టగలవని వరమిచ్చాడు. తిరిగి జన్మించిన వసిష్ఠుడు కోపం వల్ల మిథిలా రాజవంశ పౌరోహిత్యం విడిచి కేవలం రఘువంశాన్నే సేవించడం మొదలు బెట్టాడు.

చూడండి ఇది ధార్మికమైన యజ్ఞకార్యాలలో కూడా అహంకారాల ఘర్షణ చివరికి శాపాలకు ప్రతిశాపాలకూ దారి తీసింది.

విశ్వామిత్రుడు స్వయంగా రఘువంశరాజు, ఒకనాడు ఆయన వసిష్ఠుడి ఆశ్రమానికి వచ్చినప్పుడు, కామధేనువు నడిగి వారికి పరివారంతో సహా సర్వసపర్యలు చేయించాడు. విశ్వామిత్రుడు ఆ గోవును తన కిమ్మని అడిగాడు. దాని బదులుగా తాను లక్ష గోవులైనా ఇస్తానన్నాడు. కానీ విసిష్ఠుడు అందుకు సమ్మతించలేదు. విశ్వామిత్రుడు దాన్ని బలవంతగా లాక్కుపోదామని చేస్తూ ఆ గోవు శరీరం నుండి శబరాదులు పుట్టి విశ్వామిత్రుడిని, అతడి పరివారాన్ని మోదారు. అప్పటి నుండి విశ్వామిత్రుడు వసిష్ఠుడి మీద ద్వేషం పెంచుకొని, బ్రహ్మశక్తిని సాధించడం కొరకు రాజ్యాన్ని విడిచి పెట్టి తపస్సు చేయడం మొదలు బెట్టాడు. అనేక సార్లు కామానికి క్రోధానికి లోనవుతూ, పతనమౌతూ, తపశ్శక్తిని వ్యర్థం చేసుకుంటూ అనేక దివ్యాస్త్రాలు, శక్తులు సాధించుకుంటూ వసిష్ఠుడికి హాని చేయడం కొరకు ప్రయత్నించాడు. (ఇంత గొప్ప కార్యాలు కూడా వ్యక్తిగతమైన అహంకారంతోనే ప్రేరితమైనాయి). విశ్వామిత్రుడు శక్తి మొదలైన నూరుగురు వసిష్ఠుడి పుత్రులను చంపివేశాడు.

సత్యవ్రతుడు(త్రిశంకు) సూర్యవంశరాజు. ఆయన హరికి చంద్రుడికి

పుట్టిన పుత్రుడిని పెంచుకున్నాడు. అతడే హరిశ్చంద్రుడు. సత్యవ్రతునకు బొందితో స్వర్గానికి వెళ్లాలని కోరిక ఉండేది. కులగురువు వసిష్ఠుడిని ఆశ్రయిస్తే ఆయన కోరిక తీరలేదు. విశ్వామిత్రుడిని ఆశ్రయించగా ఆయన కోరిక ప్రకారం తన తపశ్శక్తితో స్వర్గానికైతే పంపాడు గాని, దేవతలు అతడిని కిందికి తోసివేయగా త్రిశంకు కొరకే ఒక ప్రత్యేకమైన స్వర్గాన్ని సృష్టించవలసి వచ్చింది. ఇదంతా కూడా వసిష్ఠుడిపై గల ద్వేషంతో చేసిందేగాని త్రిశంకుడిపైన ప్రేమతో కాదు.

ఇంద్ర సభలో సత్యం తప్పక చెప్పేవాడెవరనే ప్రశ్నవస్తే, అది కేవలం హరిశ్చంద్రుడికే సాధ్యమౌతుందని వసిష్ఠుడన్నాడు. సత్యాసత్యాలలో ప్రీతి చేత కాక కేవలం వసిష్ఠుడిని ఎదిరించే నిమిత్తం, హరిశ్చంద్రుడితో అబద్ధం చెప్పిస్తానని ప్రతిజ్ఞచేసి అందులో కృతార్థుడు కాలేకపోయాడు విశ్వామిత్రుడు. అప్పటి నుండి విశ్వామిత్రుడు అయోధ్యకు వెళ్లడం మాని వేశాడు.

వసిష్ఠుడిది విధివాదం, విశ్వామిత్రుడిది పురుషార్థవాదం. విధి అన్న పదానికి రెండర్థాలున్నాయి - ఒకటి శాస్త్రీయమైన పద్ధతి అని, ఇంకొకటి తలరాత అని. పద్ధతి ప్రకారం త్రిశంకుడు బొందితో స్వర్గానికి వెళ్లడానికి వీల్లేదని వసిష్ఠుడంటే, పురుషార్థంతో దాన్ని సాధిస్తానంటాడు విశ్వామిత్రుడు. ఈ రెండు విపరీతాలే. కేవలం అంతా తలరాత విధి, పద్ధతి అంటూ కూర్చుంటే దాని చాటున ఎన్నయినా అత్యాచారాలు జరుగుతాయి. కేవలం పురుషార్థం అంటూ కూర్చుంటే ప్రకృతి సహకరించనప్పుడు అగచాట్లు తప్పవు. ఈ ఇద్దరూ ధార్మికులేగాని వారిలో సఖ్యత లేదు.

జనకుడు గొప్పజ్ఞాని, తపస్వి, దశరథుడు గొప్పవీరుడు. ఎందరో సాధకులు, మునులు కూడా ఏ సందేహాలు వచ్చినా చర్చించడానికి జనకుడి వద్దకు వచ్చేవారట. అలాగే దేవతలకు కూడా యుద్ధంలో సహాయం చేయడానికి దశరథుడు వెళ్లేవాడట. ఈ ఇద్దరు మహారాజులు ఏనాడు కలవలేదు.

ఇటు వసిష్ఠ విశ్వామిత్రులు కలిసినా రావణసంహారం జరిగి ఉండేది.

అటు దశరథ జనకులిద్దరు కలిసినా రాక్షస సంహారం జరిగి ఉండేది. కానీ ధర్మంలో కన్నా వీరికి వ్యక్తిగత అహంకారంలోగల ప్రీతి వల్ల ధర్మ సంస్థాపన జరగలేదు.

"ధర్మసేతు" వైన శ్రీరాముడివల్లే ఈ ధర్మ సంస్థాపన సాధ్యమైంది. మారీచ సుబాహువులను ఎదుర్కొనడంలోని తన నిరర్ధకత తెలుసుకున్న విశ్వామిత్రుడు చాలాకాలం తరువాత రాముణ్ణి యాచిస్తూ అయోధ్యకు వచ్చాడు. అంతటితో వసిష్ఠ విశ్వామిత్రుల శత్రుత్వం అంతమైంది. సీతారాముల వివాహంతో జనకదశరథులు వియ్యంకులవడంతో ఆ రెండు మహాతీరాలు ధర్మసేతువు ద్వారా కలపబడ్డాయి. రాముడిని ఎదుర్కొన్న మరుక్షణం తన అవతారం వ్యక్తిగత ద్వేషంలో ఎలా నిరర్ధకమైందో తెలుసు కొని పరశురాముడు తొలగిపోయాడు.చక్రవర్తి దశరథుడు చేయలేని ధర్మ సంస్థాపన నిమిత్తం, దండకారణ్యాన్ని నిష్కంటకం చేయడానికి, రావణ సంహారార్ధం వారిని దునమడం కొరకు ధర్మసేతువు ముందుకు కదిలింది.

పరస్పర విరోధులైన వసిష్ఠ విశ్వామిత్రులకు బంధువైన రాముడు రామరాజ్యస్థాపన చేయడంలో గల రహస్యాన్నే పై వేదమంత్రం వివరిస్తోంది.

అవతారిక:

శ్రీరాముడిని ధర్మసేతు రూపంలో మన ముందుంచిన వేదమాత, యోగమార్గంలో రామోపాసనాస్థానాన్ని, రామతత్త్వాన్ని 38, 39, 40 మంత్రాలలో వివరించబోతోంది.

**38, 39, 40. మంత్రాలు:**

**తద్బన్ధుః సూరిర్దివితే ధియంధా నభానేదిష్ఠోరపతి ప్రవేనన్।**
**సా నో నాభిః పరమాస్య వా ఘాహం తత్ పశ్చాకతిథశ్చిదాస॥**

(ఋగ్ : 10-61-18)

**ఇయం మే నాభిరహ మే సధస్థమిమే మే దేవా అయమస్మిసర్వః।**
**ద్విజా అహ ప్రథమజా ఋతస్యేదం ధేనురదుహజ్జాయమానా॥**

(ఋగ్ : 10-61-19)

**అధాసు మన్ద్రో అరతిర్విభావావ స్యతి ద్వివర్త నిర్వనేషాట్।**
**ఊర్ధ్వాయచ్ఛ్రేణిర్న శిశుర్దన్మక్షూ స్థిరం శేవృధం సూత మాతా॥**
(ఋగ్: 10-61-20)

నాభోనేదిష్టుడనే ఋషి తన శిష్యుడితో ఇలా అంటున్నాడు. "ఓ శిష్యా! నీ హృదయంలో బుద్ధిని ధరించే బ్రహ్మతత్వం ఉంది. ఆ రాజు మనకు జీవనాన్నిచ్చే నాభిగా నాభిస్థానంలో అవిశిష్టంగా ఉన్నాడు. ఆయనను అక్కడ సాక్షాత్కరించుకున్నాక ఇక నేనేమి తర్కమివ్వగలను?

నా ఈ పంచకోశగృహంలో ఈ రాజు శుద్ధరూపుడై నాభిస్థానంలో ఉంటాడు. ఈయనే అందరి ఆత్మ. ఈయన సత్వస్వరూపుడు. మొదట ఈయన అవ్యక్తరూపంలో ఉత్పన్నమైనాడు. ఆ తరువాత వ్యక్త రూపంలో ఈయనవల్లే శాస్త్రతత్వాలను ప్రకాశితం చేయగలవాణి ప్రకటమైంది.

భూమి మీద నివసించే ప్రాణులందరిలోనూ ఈ రాజు మధ్యగతి గలవాడు, తేజోసంపన్నుడు, బ్రహ్మచర్యవ్రత నిష్టుడు. రెండు రకాల మార్గాలను ఆచరిస్తూ, రాక్షసులను వధించగలడు. అరణ్యంలో నివసిస్తూ శీతోష్ణాలను సహిస్తూ రాక్షసులను వధించగలడు. ఈయన తపస్వి మార్గాన్ని అనుసరిస్తాడు. ఉచ్చస్థానాన్ని పొందదలచిన ఈయన చిన్న వయసులోనే శత్రువును సంహరించి సుఖాన్ని పెంచగలడు.

స్వాయంభూమనువు కుమారుడు ప్రియవ్రతుడు. ఈయన కుమారుడు ఆగ్నీధ్రుడు. ఈయన జంబూద్వీపాన్ని పాలించేవాడు. సంతానం కోసం తపస్సు చేయగా బ్రహ్మ పూర్వాచిత్తి అనే అప్సరసను ఇతని వద్దకు పంపాడు. ఆవిడ వల్ల ఈయనకు నాభి, కింపురుషుడు, హరివర్షుడు, ఇలావ్రతుడు, రమ్యుడు, హిరణ్వంతుడు, కూరుడు, భద్రాశ్వుడు, కేతుమాలుడు అనే కుమారులు కలిగారు.

ఆగ్నీధ్రుడు జంబూద్వీపాన్ని తొమ్మిది భాగాలుగా చేసి తన ఈ తొమ్మిది మంది కుమారులకు పంచి ఇచ్చాడు. అందులో పెద్దవాడైన నాభి హిమాలయపర్వతానికి దక్షిణాన ఉన్న దేశాన్ని పాలించాడు. ఈయన

సంతానం కొరకు తపస్సు చేయగా విష్ణువు ప్రత్యక్షమై తానే ఇతడి పుత్రుడిగా జన్మిస్తానని చెప్పాడు. నాభికి అతని భార్య సుదేవి(మేరువు)కి విష్ణువు వృషభదేవుడు (ఉరుక్రముడు) అనే పేరుతో పుట్టాడు. ఋషభుడి శక్తికి ఈర్ష్య చెంది ఇంద్రుడు నాభి రాజ్యంలో అనావృష్టి కలుగజేస్తే ఋషభుడు తన ప్రభావంతో వర్షం కురిపించాడు. నాభి ఋషభదేవుడికి రాజ్యమిచ్చి అరణ్యాలకు వెళ్లాడు. ఈయన ఆ తరువాత నాభోనేదిష్టుడనే ఋషిగా పిలువబడ్డాడు. ఋగ్వేదంలో ఈయన దర్శించిన ఋక్‌లు (మంత్రాలు) అనేకం కనిపిస్తాయి.

విష్ణుమూర్తి అవతారమైన ఋషభుడికి ఆయన భార్య జయంతికి నూరుగురు పుత్రులు కలిగారు. పెద్దవాడు భరతుడు, ఈయన పేరు మీదే మనదేశానికి భరతవర్షం అనే పేరువచ్చింది. ఈయన కాక కుశావర్తుడు, ఇలావర్తుడు, బ్రహ్మావర్తుడు, ఆర్యావర్తుడు, మలయకేతు, భద్రసేనుడు అనేవారి వల్ల ఇతర ఆరు వర్షాలకు ఆయా పేర్లు వచ్చాయి. మనది కర్మభూమిగా తనకు తెలిసినప్పటికీ బ్రాహ్మణుల వల్ల వేదాన్ని ఎరిగి కర్మతంత్రాన్ని ఎరుక పరచి సమస్త కర్మలు చేశాడు. పుత్రులకు రాజ్యం ఇస్తూ ఇహసౌఖ్యాలలో వాంఛపెట్టుకోక ధర్మపాలన చేయమన్నాడు. అవిద్యారూప కర్మబంధనాలను అప్రమత్తయోగం అనే చురకత్తితో ఛేధించమని బోధచేసి యోగయుక్తుడై ద్వంద్వాతీతుడై, అవధూత వేషంలో దేహాభిమానం లేక సంచరిస్తూ దక్షిణ కర్నాటకలో గుటకాచలోపవనంలో తిరుగుతూ ఉండగా దావానలం మధ్య దగ్ధమైనాడు.

జైనపురాణాలు ఆయననే తమ ప్రథమ తీర్థంకరుడంటాయి. ఈయన తరువాత రాజ్యదాహం కలిగిన భరతుడు తన తమ్ముల నందరినీ జయిస్తూ వెళ్లి "బాహుబలి" అనే తమ్ముడి వల్ల ఓడిపోతాడు. తిరిగి మళ్లీ బాహుబలే భరతుడిని అన్నగా గౌరవించి క్షమాపణలడిగి అరణ్యానికి వెళ్లి తండ్రి ఋషభదేవుడి అనుమతితో కర్ణాటక అరణ్యాలలో నగ్నంగా తపస్సు చేస్తూ నిలబడతాడు. స్థాణువుగా నిలిచిన ఆయన శరీరం మీదికి అనేక

లతలు పెరుగుతాయి. ఎన్నో సర్పాలు చుట్టు కుంటాయి. అయినా ఆయన తపస్సు సిద్ధించదు. అందుకు కారణ మేమిటో భరతుడు తండ్రి ద్వారా తెలుసుకొని వెళ్లి ఆయన ముందు మోకరిల్లి తాను నిలిచిన భూమి తనది కాదనే గ్లాని విడవమని నచ్చజెప్పిన తరువాత నేను, నాది, అతడు, అతనిది అనే భావాన్ని విడిచి సమాధిని పొందుతాడు. ఇప్పటికీ శ్రావణ బెల్గొన, హళిబీడు ప్రాంతాలలో ఎంతో ఎత్తుయిన బాహుబలి నగ్నవిగ్రహం పూజింపబడుతోంది.

ఇంతటి మహాత్ములను పుత్ర పౌత్రులుగా పొందిన నాభోనేదిష్టుడికి యోగదర్శనంతో నాభిస్థానంలో (స్వాధిష్టానం, కొందరు జననేంద్రియ స్థానాన్ని స్వాధిష్టానమంటారు కానీ అది కాదు) ఆరు దళాల కమలం మధ్యగల విష్ణురూపమే శ్రీరాముడిగా భూమి మీద అవతరించిందని ఆయన దర్శించాడు. శ్రీరాముడు ప్రతివారి నాభిస్థానంలోనూ ఉన్నాడు. కానీ ఏ కొద్దిమందో దర్శించగలుగుతున్నారు. అందుకే ఆయన రాముడు అవిశిష్టంగా అందరిలోనూ ఉన్నాడంటాడు పై వేదమంత్రంలో. నాభిచక్రం లో అవ్యక్త రూపంలో ఉన్నరాముడు ధర్మసంస్థాపనార్థమై వ్యక్తమైనాడు. స్వాధిష్ట చక్రోపాసన వల్ల ఆకర్షణ పెరుగుతుందని వారికి వాక్శుద్ధి కలుగు తుందని యోగ గ్రంథాలు తెలియజేస్తున్నాయి. "వేదాంతకృత్ వేద విదేవచా2హం" వేదాలు వ్రాసిన వాణ్ణి నేను, సంపూర్ణంగా వేదసారాన్ని ఎరిగిన వాణ్ణి కూడా నేనే అని శ్రీకృష్ణ భగవానుడు గీతలో అంటాడు. ఆయనను స్వాధిష్టానం (నాభి)లో ఉపాసించిన వారికి కూడా ఈ శక్తి కలగడం సహజమే "పుంసాం మోహనరూపాయ" పురుషులకే మోహం కలిగే రూపంగల శ్రీరాముడిని స్వాధిష్టానంలో ఉపాసించడం వల్ల కూడా జనాకర్షణ కలుగుతుంది. మనకు ప్రాణప్రదాతగా నిలిచిన రాముడిని స్వాధిష్టానంలో సాక్షాత్కరించుకున్న నాభోనేధిష్టమహర్షి కబీరుదాసు లాగా "మన్ మస్త్ హువా తబ్ క్యోం బోలే" మనస్సు ఆ తత్త్వంలో ఉన్మత్తమైపోగా ఇంకేమని మాట్లాడను నేను అంటున్నాడు.

మానవుడు మానవుడిగా ఉండటానికి కారణం అతడు నిటారుగా లేచి నిలబడటమే నంటున్నారు శరీర శాస్త్రవేత్తలు. జంతువులన్నీ భూమికి సమాంతరంగా నాలుగు కాళ్లపైన నడుస్తూ ఉండటంతో వాటి శరీరంలో అన్ని భాగాలకు రక్తప్రసారం సమానంగా జరుగుతుంది. కనుక అన్ని అంగాలు స్థూలం (గ్రాస్) అవుతాయి. అవి ప్రకృతి యొక్క అదుపులో ఉంటాయి. మనిషి నిటారుగా నిలబడటం వల్ల భూమికి 90 డిగ్రీల కోణంలో ఎటూ ఒరగకుండా ఉంటాడు. అతడి రక్తప్రసరణం తక్కువగా ఉండటం వల్ల కొన్ని సూక్ష్మమైన జీవకణాలు సూక్ష్మంగా మిగిలిపోతాయి. వారికి ఆలోచించి నిర్ణయించగల అవకాశం, తెలివి వస్తుంది. ప్రకృతి తన అదుపును వారిపైన సడలిస్తుంది. (అందుకే మేధావులైనవారికి ఎత్తయిన తలగడ లేక దిండు పెట్టుకోనిదే నిద్రపట్టదు. తలగడ పెట్టుకోకుండా పడుకోవడం వల్ల వారి మెదడులోకి రక్తప్రసరణ ఎక్కువగా జరిగి వెంటనే అన్ని కేంద్రాలు జాగ్రతమవుతాయి. మెదడు అంత వేగంగా పని చేస్తుంటే వారికి నిద్రించడం సాధ్యం కాదు. కనుక మనిషి మనిషిగా జీవించాలంటే నిటారుగా నిలబడాలే గాని ఎటూ ఒరగకూడదు (శారీరకంగా మానసికంగా కూడా) అనే విషయం అవగతమౌతున్నది.

విశ్వామిత్రుడు రాజుగా ఉన్నప్పుడు తన క్షాత్రశక్తితో వసిష్ఠుడిని జయించలేకపోయాడు. కనుక దానిని త్యజించి బ్రాహ్మ్యం వైపు ఒరిగి పోయాడు. తన తండ్రి బ్రాహ్మ్యశక్తి క్షాత్రం ముందు వ్యర్థమై కార్త వీర్యార్జునుడి చేత చంపబడ్డాడు. కనుక పరశురాముడు బ్రాహ్మ్యాన్ని విడిచి క్షాత్రం వైపు ఒరిగిపోయాడు. క్షణికోద్రేకంలో కేవలం వ్యక్తిగత స్పర్థల కారణంగా తీసుకోబడ్డ నిర్ణయాలు శాశ్వత సమస్యలకు జవాబు నివ్వలేవు. అటు మహాత్ముల పరిస్థితి ఇలా ఉంటే ఇటు రావణుడు జన్మతః బ్రాహ్మణు డై ఉండి తపస్సు చేసి బ్రాహ్మీశక్తిని సమీకరించాడు. ఇటు శివుడి నుండి చంద్రహాసమనే దివ్యకరవాలాన్ని పొంది క్షాత్రాన్నికూడా వృద్ధిపరుచు కున్నాడు. అందువల్లే కేవలం ఒక వైపు ఒరిగిపోయిన ఈ మహాత్ములెవరూ

రావణునికి ఎదురు నిలవలేకపోయారు. ఈ రెంటిని సాధించిన రావణుడు మాత్రం రెంటినీ దురుపయోగం చేయడం మొదలుబెట్టాడు.

వాడిలాగే ఈ రెంటినీ సమీకరించినవాడు, ఈ రెంటినీ సమాజ క్షేమానికి వినియోగించేవాడు. రావణుడిని ఎదుర్కోవడానికి అవసరమైనాడు, అప్పుడే ఇదం బ్రాహ్మ్యం, ఇదం క్షాత్రం అంటూ బ్రహ్మచర్యాన్ని అవలంబిస్తూ రాజ్యసుఖాలను అన్నిటినీ విడిచి అరణ్యంలో కఠిన తపశ్చర్యనాచరిస్తూ, విశ్వామిత్ర, అగస్త్యాది మహర్షుల నుండి దివ్యాస్త్రాలను మంత్రశక్తులను పొందిన రాముడు అవతరించాడు.

అందుచేత కొన్ని వేల ఏండ్ల నుండి ఎంతో శక్తిమంతులు, మహానుభావులు కూడా సాధించలేనిది కేవలం అతి పిన్నవయసులోనే రాముడు సాధించనున్నాడంటుంది వేదమాత.

శ్రీః